# ప్రతిమ × విగ్రహ
# దైవము × దైయ్యము


ప్రతిమ


విగ్రహ


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# ప్రతిమ X విగ్రహ
# దైవము X దైయ్యము


రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)




త్రైత శకము-40 ద్వితీయ ముద్రణ : మే-2018

ప్రతులు : 1000 **వెల : 120 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన

77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) సుప్రసిద్ధి బోధ.
98) సిద్ధి బోధ.
99) ప్రవచన మాలిక
100) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
101) రూపము మారిన గీత.
102) సున్న.
103) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.

82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

08

### ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ప్రతిమ x విగ్రహ - దైవము x దైయ్యము

ప్రపంచములో ఎవరి ఊహకు అందని దేవుడు ఆయన బిరుదుకు తగినట్లు ఎవరికీ తెలియనివాడై యున్నాడు. అందువలన ఆయనను **"దేవులాడబడేవాడు దేవుడు"** అని అంటున్నాము. దేవులాడడము అనగా వెతకడము అని అర్థము. వెదకినా తెలియడు కావున ఆయనను అర్థమునకు తగినట్లు **'దేవుడు'** అని అన్నారు. దేవునకు పేరులేదు కనుక దేవుడు అనునది పేరు కాదనీ, అది అర్థముతో కూడుకొన్న బిరుదు మాత్రమేయని తెలియవలెను. పేరు అందరికీ సర్వసాధారణముగా ఉండును. బిరుదు అందరికీ ఉండునది కాదు. ఉన్న ప్రత్యేకతను గుర్తించి దానికి తగినట్లు ఆ ప్రత్యేకతను సూచించులాగున చెప్పబడిన దానిని బిరుదు అంటారు గానీ పేరు అనరు. పేరు మనిషిలోని ప్రత్యేకతను చూపునది కాదు. 'రామ' అను రెండు అక్షరముల పేరు 'కర్మను నశింపజేయువాడు' అని అర్థముతో కూడుకొని ఉన్నది. అయితే రామ అని పేరు పెట్టుకొన్నవాడు అంతటి స్థోమత లేనివాడైయుండును. అందువలన మనుషులకున్న పేర్లు వారిలోని ప్రత్యేకతను చూపలేవు. బిరుదు అయితే ప్రత్యేకతనుబట్టి పెట్టినదై ఉండును. ఆట ఆడువానిని 'ప్లేయర్' అని అంటారు. ప్లేయర్ అనగా అతని ప్రత్యేకతనుబట్టి, అతను ఆడు వాడని అర్థమునిచ్చుచూ చెప్పునదిగా ఉన్నది. అందువలన ప్లేయర్ అనునది పేరు కాదు. ప్లేయర్ అనునది బిరుదు మాత్రమే. అలాగే దేవుడు అనునది పేరుకాదు, అది ఆయన ఉన్న విధానమును తెలుపు శబ్దము మాత్రమే.

దేవునికి పేరు ఏమాత్రము లేదు. ఎవరయినా పేరు ఎందుకు లేదు? అని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! రూపమున్న దేనికయినా పేరుండును. దేవునికి రూపము లేదు కదా! అందుకు పేరులేదు. రూపమునకు పేరుకు అవినాభావ సంబంధముండును.

రూపముంటే పేరుండును, పేరుంటే రూపముండును రెండూ లేనివాడు ప్రపంచములో ఒక్కడే ఒక్కడు గలడు, వాడే దేవుడు. రూపము, పేరు రెండూ లేనివాడు బయటికి తెలియునట్లు స్థూలముగా ఉండడు. అందువలన దేవుడు చేయు పనులు కూడా స్థూలముగా ఉండవు. అందువలన దేవునికి పనిలేదు అని చెప్పవచ్చును. దేవుడు తెలియబడడు అని అంటున్నాముగానీ ఆయన అసలుకు లేడు అని మనము చెప్పలేదు. అలాగే ఆయన పని కనిపించదు కావున ఆయనకు పని లేదు అంటున్నాము. ఈ విధముగా దేవున్ని రూప, నామ, క్రియారహితుడు అని అన్నారు. దేవుని రూపము కనిపించదు, దేవుని పేరు వినిపించదు. దేవుని పని (కార్యము) తెలియదు. దీనినిబట్టి దేవుడు స్థూలముగా లేడు, సూక్ష్మముగా ఉన్నాడు అని తెలియగలదు. ఇది దేవుని ప్రాథమిక ధర్మము. అదే శాసనము, దీనిని ఎవడూ మార్చుటకు వీలులేదు. ఎవడయినా నేను దేవున్ని చూచాను అని అంటే అది పూర్తి అసత్యము.

దేవుడు సూక్ష్మముగాయుండి స్థూలమైన ప్రపంచమును నిర్మించాడు. స్థూలమైన ప్రపంచమునకు, సూక్ష్మమైన ప్రపంచమును కూడా జోడించాడు. కనిపించే మనుషులను సృష్ఠించినట్లే, కనిపించని భూతములను, గ్రహము లను దేవుడు సృష్ఠించాడు. దేవుడు సృష్ఠించిన తన సృష్ఠియంతయూ స్థూల, సూక్ష్మమని రెండు భాగములుగాయున్నది. కనిపించని సూక్ష్మ భాగమునకు తాను కనిపించని వాడుగాయుండి వాటిని నడుపుచున్నాడు. అదే విధముగా కనిపించే వాటితో కూడా దేవుడు కనిపించే వానిగానే సంబంధపడి వాటికి తన జ్ఞానమును తెలియజేయవలసి యుంటుంది. దేవుని సృష్ఠి రెండు రకములుగా ఉండుట వలన దేవుడు కూడా స్థూల, సూక్ష్మ అను రెండు రకములుగా ఉన్నాడు. దేవుడు సూక్ష్మముగా నామ,

రూప, క్రియారహితునిగా ఉన్నాడు. అట్లే స్థూలముగా నామ, రూప, క్రియా సహితునిగా కూడా ఉండవలసిన అవసరమున్నది. ఇక్కడ దేవుడు నామ రూప క్రియారహితుడని చెప్పి క్రిందనే నామ, రూప, క్రియాసహితు డని ఎలా చెప్పగలరని? ఎవరయినా ప్రశ్నించవచ్చును. అలా చెప్పడము వలన వాక్యములో శాస్త్రబద్దత లేకుండాపోయి అసత్యముగా కనిపించును కదా!యని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఈ విధముగా కలదు.

దేవుడు సూక్ష్మమైనవాడు, నామ, రూప, క్రియారహితుడు అని చెప్పి ఇది శాసనము, దేవుని ప్రాథమిక ధర్మము అని చెప్పిన తర్వాత దానికి వ్యతిరేఖముగా ఏమి చెప్పినా అది అసత్యమగును, అశాస్త్రీయమగును. అందువలన దేవుడు అలా నామ, రూప, క్రియలు కల్గియున్నాడని చెప్పడము పూర్తి తప్పగును. అందువలన ఈ సమస్యను దేవుడే పరిష్కరిస్తూ ఆయనే తన స్థూల, సూక్ష్మముల వివరమును గురించి తెలియజేశాడు. దేవుడు ఎప్పటికీ సూక్ష్మముగానే ఉండును. స్థూలముగా ఎప్పుడైనా కొంత సమయములో ఉండు ఆయనను అప్పుడు దేవుడు అని అనకూడదు. స్థూలముగా వచ్చినవాడు దేవుడే అయినా, అప్పుడు ఆయనను దేవుడు అని చెప్పకూడదు. దేవుడు ఎప్పటికీ సూక్ష్మమైనవాడే కనుక దేవుని స్థూలరూపమునకు దేవుడను మాట వర్తించదు. స్థూలముగాయున్న సమయములో భగవంతుడని చెప్పవచ్చును లేక 'గురువు' అని చెప్పవచ్చును. దేవుడే ఆ విధముగా తన విధానమును నిర్ణయించుకొన్నాడు. ఇప్పుడు స్థూలముగాయున్న దేవున్ని భగవంతుడు లేక గురువు అని చెప్పడమేకాక, సూక్ష్మముగాయున్న వానిని దేవుడు అని పిలువవచ్చును అని తెలిసిపోయింది. ఈ విధముగా దేవుడు రెండు రకములుగా కలదు. సూక్ష్మముగాయున్నప్పుడు

దేవుడు అని చెప్పబడిన వాడు స్థూలముగాయున్నప్పుడు భగవంతునిగా చెప్పబడుచున్నాడు. దీనినిబట్టి ఏ విధముగా స్థూలము, సూక్ష్మములు రెండు వేరు వేరుగా ఉన్నవో, అదే విధముగా దేవుడు, భగవంతుడు వేరువేరుగా పిలువబడుచున్నారు. సూత్రము ప్రకారము దేవున్ని భగవంతుడని చెప్పకూడదు. అలాగే భగవంతున్ని దేవుడని చెప్పకూడదు. దేవుని ప్రాథమిక జ్ఞానము ప్రకారము దేవుడు వేరు, భగవంతుడు వేరుగా ఉన్నారని తెలియుచున్నది.

దేవుడు 'ఏకస్వరూపుడు' అని కొందరు అనగా వినియున్నాము. అటువంటప్పుడు స్థూల, సూక్ష్మమని రెండు రకములుగా చీల్చి దేవుడు, భగవంతుడు అని అంటున్నారు. దేవుడు, భగవంతుడు అను రెండు రకములుగాయున్న వానిని ఏకస్వరూపుడని ఎలా పిలువాలి? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు! దేవుడు ఒక్కడే అయినా ఆయన మనకు తెలిసి ఒక రకముగా, తెలియక ఒక రకముగా ఉన్నాడు. తెలిసి భగవంతునిగా, తెలియక దేవునిగా ఉన్నాడని ఇంతవరకు తెలుసుకొన్నాము. అయితే దేవున్ని గురించి ఇంకా ఎంతో తెలియవలసియున్నది. దేవుడు సులభముగా అర్థమగువాడు కాడు. ఎందుకనగా! రూప, నామ, క్రియలు లేని దేవుడు సర్వజీవరాశులను ఎలా సృష్టించాడు? అను ప్రశ్న రాగలదు. దేవుడు పనిచేయనివాడయితే ఇంతమంది మానవులను, ఇన్ని జీవరాశులను ఎలా సృష్టించాడు? సృష్టించాడు అంటే పని చేసినట్లే కదా!యని ప్రశ్నించుటకు అవకాశము గలదు. అప్పుడు దానికి జవాబు లేకుండా పోవు అవకాశము గలదు. జ్ఞానము అంటే ప్రతి ప్రశ్నకు జవాబు ఉండునది అని అర్థము. నిజమైన జ్ఞానములో జవాబు లేని ప్రశ్న వుండదు. అందువలన దేవుడు నామ,

రూప, క్రియలు లేనివాడు అనకముందుగానీ లేక తర్వాతగానీ ఏదో మనకు తెలియని రహస్యమున్నదనీ, లోతుగా చూచి నట్లయితే దేవుని విధానములో కొంత మనకు తెలియని విషయము తెలియుచున్నది, అదేమనగా!

దేవుడు రెండు రకములుగా ఉన్నాడనీ ఒకటి రూప, నామ, క్రియలు లేని సూక్ష్మముగా ఉన్నాడనీ, రెండు రూప, నామ, క్రియలుగల స్థూలముగా ఉన్నాడని చెప్పుకొన్నాము. అయితే మన ఊహకు కూడా అందని విధానమంటు ఒకటున్నది, అదే మూడవ విధానము. మూడవ విధానములో దేవున్ని దేవుడని కూడా చెప్పలేము. ఆ విధానము ఇటు స్థూలముగాగానీ, అటు సూక్ష్మముగానీ లేనిదై ఉన్నది. దేవుడు, భగవంతుడు రెండూకాని విధానముగా మూడవ విధానము గలదు. ఇది ఎటూ చెప్పలేని విధానముగా ఉండడమేకాక, ఎటూ అర్థముకాని విధానముగా యున్నదని చెప్పవచ్చును. మూడవ విధానములో స్థూలములోవలె క్రియలు కలవానిగా ఉన్నాడు, సూక్ష్మములోవలె ఆకారము లేనివాడైయున్నాడు. పేరును చూస్తే దేవుడు, భగవంతుడు అని కాకుండా 'స్థిరాస్థిరునిగా' యున్నాడు. **'స్థిరాస్థిరుడు'** అను పదమును విడదీసి చూస్తే స్థిర+అస్థిర అని కలదు. స్థిర అనగా శాశ్వతమైన దని, అస్థిర అనగా అశాశ్వతమైనదని అర్థము. శాశ్వత, అశాశ్వతములు కలవాడని దాని అర్థము. ఇది ఎటూగాని రెండువైపుల నుండి చెప్పునదిగా ఉన్నది. దీనిని పేరు అని చెప్పలేము, పేరుకానిదని కూడా చెప్పలేము. మూడవ విధానములో రూపములేదుగానీ పని ఉన్నది. పని ఉన్నది గానీ రూపము లేదనియే చెప్పవచ్చును. స్థిరాస్థిరుడు అంటే ఒక అర్థమునకు కూడా అందనివాడు. దేవుడు అంటే దొరకనివాడు, తెలియనివాడు అని చెప్పవచ్చును. అయితే స్థిరాస్థిరుడు అంటే ఎటూ చెప్పలేము. అందువలన పేరు ఉన్నా లేనివాడు అని చెప్పవచ్చును.

దీనినిబట్టి మూడవ విధానములో ఆకారములేదు కార్యమున్నది. అలాగే పేరున్నదిగానీ అర్థము లేనిదిగా ఉన్నది.

మూడవ విధానము కొంత విచిత్రముగాయున్నది. దేవుడు స్థూలముగా భగవంతుడయితే, సూక్ష్మముగా దేవుడయితే, స్థిరాస్థిరునిగా కొంత స్థూలము, కొంత సూక్ష్మముగా యున్నాడు. ఆకారములో సూక్ష్మముగా, కార్యములో స్థూలముగా యున్నాడని చెప్పవచ్చును. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! ఇంతవరకు ఎందరో భూమిమీద జ్ఞానమును తెలుపు స్వామీజీలు, మతపెద్దలు, బోధకులు ఉన్నారు. అయినా ఒక్కరు కూడా మీరు చెప్పిన మూడవ విధానమును గురించి ఎవరూ చెప్పలేదు. భూమిమీద ముఖ్యముగా మూడు దైవగ్రంథములున్నాయి. అందులో గీతయందుగానీ, బైబిలుయందుగానీ, అంతిమ దైవగ్రంథము ఖురాన్‌యందుగానీ మీరు చెప్పిన మూడవ విధానము లేదు. ఆ మూడు గ్రంథములలో స్థూల, సూక్ష్మ అను రెండు విధానములు కూడా పూర్తిగా కాకుండా అస్పష్టముగా కనిపించుచున్నవి. అదియూ బుద్ధి గ్రహించుకొను శక్తియున్న వారికి మాత్రమే ఆ గ్రంథములలో స్థూల, సూక్ష్మ రెండు విధానములు కనిపించుచున్నవి. మీరు చెప్పు మూడవ విధానము ఎక్కడా లేదు దీనికి మీరేమంటారు? గ్రాహితశక్తి లేనివారికి స్థూలము తప్ప సూక్ష్మము కనిపించడము లేదు. ముస్లీమ్‌లకు ఖురాన్ గ్రంథములో స్థూలము మాత్రము కనిపించుచున్నది, దేవుని యొక్క సూక్ష్మత ఏమాత్రము కనిపించడములేదు. మూడు గ్రంథములలో దేవుని రెండు విధానములు వ్రాయబడియుండగా మూడవ విధానము బుద్ధియున్న వాడు గ్రహించగలిగినదైయున్నది. అయినా ఇంతవరకు రెండు విధానములనే మనిషి సరిగా గ్రహించలేకయున్నాడు. మూడవ విధానము గ్రంథములలో ప్రత్యేకించి చెప్పకపోవడము వలన,

స్పష్టముగా లేకుండా అస్పష్టముగాయుండుట వలన, మూటలో ముడివేసి పెట్టిన గంటువలెయుండుట వలన మూడవ విధానము కొందరికి కూడా అవగాహనకు రాకుండా పోయినది. ఇప్పుడు కొందరు మరియొక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! భూమిమీద అందరికీ అర్థముకాని జ్ఞానము అనగా దేవుని మూడవ విధానము మీకెలా తెలిసిందని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు చూడండి!

ఎవరికీ తెలియని దానిని గ్రంథమునుండి నేను గ్రహించుకొన్నాను. అందరి బుద్ధికంటే నా బుద్ధి గొప్పదియని నేను ఎప్పుడూ చెప్పలేదు. నాకు పుట్టుకతోయున్న భావమే గ్రంథములోయున్నది గానీ గ్రంథములోనుండి నేను గ్రహించుకొన్నది ఏమీ లేదు. **నా భావములే మూడు గ్రంథము లలో యుండుట వలన అందులో నాకు రహస్యములంటూ ఏమీ లేవు.** వాటి నుండి నేను నేర్చుకొన్నది కూడా ఏమీ లేదు. నేర్చుకొనే వాడు ఒక గ్రంథమునకే పరిమితి కాగలడు. ఇతర గ్రంథములను, ఇతర మతములను ద్వేషించును. ఫలానా మతమువాడని గుర్తింపు తెచ్చుకొనును. సత్యమును చెప్పితే నేడు ఒక గ్రంథములోని విషయమును (జ్ఞానమును) కూడా సరిగా తెలుసుకొన్నవాడు లేడు. మూడు గ్రంథములలోని వాస్తవ జ్ఞానమును నేను చెప్పుచున్నానంటే అది నేర్చుకొన్నదైతే కాదు. మనుషులలో ఒక దానిని కూడా సరిగా తెలియని వాడు మూడింటిని ఎలా తెలియగలడు? అందువలన నేడు లోకమున దేవుని జ్ఞానము అసంపూర్ణముగానే మనుషులకు తెలిసినదని చెప్పవచ్చును. జ్ఞానము తెలియని దానివలన నేను సులభముగా చెప్పు దేవుని జ్ఞానమును మనిషి గుర్తు పట్టలేక పోవుచున్నాడు.

దేవుడు తన జ్ఞానమును స్థూల, సూక్ష్మములని చెప్పడమైనది, అంతేగానీ స్థిరాస్థిరములని ఎక్కడా ప్రత్యేకముగా చెప్పలేదు. తన జ్ఞానము మీద ఆసక్తియున్నవానికి మాత్రము తెలియునట్లు తన మూడవ విధానము తన గ్రంథములలో ఇమిడియుండునట్లు చేశాడు. దేవుని మూడవ విధానమైన స్థిరాస్థిరము, రెండు విధానములను బాగా గ్రహించినప్పుడు మూడవ విధానము తెలియగలదు. రెండు విధానములు తెలియని వారికి మూడవ విధానము మీద ధ్యాస ఏమాత్రముండదు. దేవుడు మూడు విధములుగా ఉన్నాడని గుర్తించుటకు తన ఆత్మను మూడు విధములుగా క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అని విభజించి చెప్పాడు. ఇక్కడ మనము కొంత ప్రక్కకు జరిగి చెప్పుకొంటే దేవుడు అని కొందరికి, అల్లాహ్ అని కొందరికి, యెహోవా అని కొందరికి పరిచయమున్న వాడు ఒక్కడే దేవుడు. ఆధ్యాత్మిక పరిభాషలో దేవున్ని పురుషుడు అనీ, సమస్త ప్రపంచమును ప్రకృతియని అంటున్నాము. కనిపించే ప్రపంచమంతయు ప్రకృతియనీ, కనిపించని దేవున్ని పురుషుడని అంటున్నాము. ప్రకృతిని విభజించితే ఐదు భాగములుగా కలదు. ప్రకృతి ఐదు భాగములుగా ఉండుట వలన 'ముతైదువ' అంటారు. ముతైదువ అనగా ఐదు లక్షణములు గలది అని అర్థము. ఐదు లక్షణములు గల శరీరమును తయారు చేయునది స్త్రీ అని అర్థము. మొత్తము మీద ప్రకృతిని స్త్రీ అని అంటున్నాము. దేవున్ని పురుషుడు అని అంటున్నాము. ప్రకృతి పరమాత్మలకు స్త్రీ, పురుషుడు అని పేరు పెట్టకముందు పురుషుడిని ఆత్మ అనియూ, స్త్రీని ప్రకృతి అనియూ ఆధ్యాత్మికరీత్యా అనెడివారము. దాని ప్రకారమే ప్రకృతి ఐదు భాగములని ముతైదువని, పురుషుడైన దేవున్ని ఆత్మ అనియు, ఆత్మ మూడు భాగములని త్రైతాత్మ అని అంటున్నాము. ప్రకృతిని ఐదు భాగములుగా విభజించకపోతే ప్రకృతి ఒకే స్త్రీగా మిగిలిపోతుంది. అనగా ఉత్పత్తి చేయు సాధనముగా

మిగిలి పోతుంది. అలాగే దేవున్ని మూడు భాగములుగా విభజించకపోతే ఒకే పురుషునిగా మిగిలిపోగలడు. అనగా ఉత్పత్తి చేయు బీజముగా మిగిలిపోవును.

పురుషుని విషయమునే గ్రహించగలిగితే పురుషుడు మూడు రకములుగా ఉన్నాడని మూడు దైవగ్రంథములు గొంతెత్తి చాటుచున్నవి. ముగ్గురు పురుషుల విషయము మూడు గ్రంథములలో చాటిచెప్పుచున్నా, మనుషులకు మాత్రము పురుషుడు ముగ్గురుగా ఎలా ఉన్నాడు అని తెలియదు. ముగ్గురు పురుషుల విషయము మొదట మాతోనే ప్రచారము లోనికి వచ్చినదని, అది మాలోని భావమని చెప్పగలము. మా భావమునకు సరి సమానముగా ముగ్గురు పురుషుల సమాచారము మూడు గ్రంథములలో గలదు. ప్రపంచమునకంతటికీ ఒకే దేవుడు లేక ఒకే పురుషుడు ఉన్నప్పుడు ఆయన ఎలా మూడు భాగములయినాడని ఎవరయినా ప్రశ్నించవచ్చును. అయితే ఇక్కడ మూడు భాగములను ముక్కలుగా చీల్చి చేయలేదు. ఒకే బొమ్మ మూడుచోట్ల మూడు నీడలుగా ప్రతిబింబిచినట్లు ఒకే ఆత్మ మూడు ఛాయలుగా మారిపోయినది. ఒకే పేపరులోని సమాచారమును మూడు కాపీలుగా జీరాక్స్ తీసినట్లు, ఒకే పురుషుడు ముగ్గురు పురుషులుగా మారిపోయాడు. ఒక పేపరు మీద సమాచారమును జీరాక్స్ ద్వారా మూడు పేపర్ల మీద సమాచారముగా మార్చి వేయుచున్నాము కదా! ఆ మూడు పేపర్లలో ఒకటి వర్జినల్ (అసలయిన) సమాచారముకాగా, రెండు జీరాక్స్ పేపర్లలోని సమాచారము డూప్లికేట్ (మొదటి దానిని పోలిన) సమాచారముగా యున్నది. జీరాక్స్ కాపీ మొదటి పేపర్ సమాచారమే రెండవ, మూడవ పేపర్ మీదయున్న దానిని వర్జినల్ పేపర్ అనము. అలాగే మొదటి ఆత్మను పోలిన రెండు ఆత్మలు తయారయినా, అవి

మొదటి ఆత్మ పోలికయేయున్నా, అవి మాత్రము మొదటి ఆత్మ కావు. ఒకే పురుషుడు లేక ఒకే ఆత్మ నుండి మిగతా రెండు ఆత్మలు తయారయినా, అవి మొదటి ఆత్మను పోలియున్నా వాస్తవానికి మొదటి ఆత్మ కావు.

ఈ విధముగా ఒక పురుషుడయినా ఆత్మ మొదటి పురుషుని నుండి ఇంకా రెండుగా విడిపోయి మొత్తము ముగ్గురు పురుషులుగా మిగిలి యున్నది. మొదటి పురుషునినుండి రెండవ పురుషుడు విడిపోగా, రెండవ పురుషునినుండి మూడవ పురుషుడు విడిపోయి మొదటి పురుషునితో సహా ముగ్గురు పురుషులుగా చెప్పబడుచున్నవి. అందులో **మొదటిది ఉత్తమ పురుషుడుకాగా, రెండవది అక్షర పురుషుడు, మూడవది క్షర పురుషుడుగా** చెలామణి అగుచున్నారు. ముగ్గురు పురుషులను మూడు ఆత్మలుగా చెప్పితే మొదటి ఆత్మ పరమాత్మయనీ, రెండవ ఆత్మ ఆత్మయనీ, మూడవ ఆత్మ జీవాత్మయని పిలువబడుచున్నవి. ఈ ముగ్గురిని ఇంకొక విధముగా దేవుడు, పొరుగువాడు, జీవుడు అని కూడా చెప్పుచున్నారు.

| | | |
|---|---|---|
| **1) ఉత్తమ పురుషుడు** | **2) అక్షర పురుషుడు** | **3) క్షర పురుషుడు** |
| **1) పరమాత్మ** | **2) ఆత్మ** | **3) జీవాత్మ** |
| **1) దేవుడు** | **2) పొరుగువాడు** | **3) జీవుడు** |

ఈ విధముగా గల ముగ్గురిని మూడు గ్రంథముల యందు ముఖ్యముగా చెప్పియున్నా, ఎవరూ ఈ ముగ్గురిని గుర్తించలేదు, దైవ గ్రంథములో చెప్పిన మూడు ఆత్మల విషయములో మధ్య ఆత్మ విషయము ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. ఇంతవరకు ఆధ్యాత్మిక బోధకులను వారికి మధ్యఆత్మ అయిన అక్షర పురుషుని గురించి ఏమాత్రము తెలియ దనియే చెప్పవచ్చును. ఆత్మయను పేరు అందరి నోళ్ళలో పలుకబడు

చున్నా, ఆత్మంటే ఏమిటో ఎవరికీ తెలియకుండా పోయినది. ఆత్మ విషయములో ఎటువంటివాడయినా వెనుకబడియున్నాడని తెలియగలదు. ఆధ్యాత్మికములో మధ్య ఆత్మ, లేక అక్షర పురుషుడు, లేక పొరుగువాడు అని చెప్పబడుచున్నవాని పాత్రయే ఎక్కువగాయున్నది. అందువలన మధ్య ఆత్మ విషయము తెలియని వానిని పూర్తి జ్ఞాని అని అనుటకు వీలులేదు. ఈ మూడు ఆత్మలను ఒక్కొక్క దానిని వివరముగా విశదీకరించుకొందాము.

ఇంతకుముందు మనము ఆధ్యాత్మిక విద్యలో అనగా బ్రహ్మవిద్యలో చాలామార్లు మొదటి ఆత్మను గురించి చెప్పినప్పుడు దేవుడు అని చెప్పుచూ వచ్చాము. మొదటి ఆత్మను అనగా ఉత్తమపురుషున్ని గురించి చెప్పు కొనుటకు అంతకంటే మించిన పదముగానీ, మంచి పదముగానీ లేని దానివలన అలాగే చెప్పుకుంటూ వచ్చాము. ఆత్మ అను విషయానికి వస్తే దాని అర్థము ప్రకారము ఆత్మ అనగా అణిగియున్నదనీ, తెలియకుండా ఉన్నదని అర్థము గలదు. తెలియకుండా ఉన్నదానివలన మధ్య ఆత్మను కూడా 'దేవుడు' అని అనవచ్చును. దేవుడు అనగా తెలియబడని వాడనియేగా అర్థము. అలాగే ఆత్మకూడా ఎవరికీ తెలియక శరీరములో అణిగి యున్నందున ఆత్మను శరీరములోని దేవుడని అనవచ్చును. మొదటి పురుషుడయిన పురుషోత్తమున్ని శరీరము బాహ్యములో కూడా దేవుడని చెప్పవచ్చును. ప్రపంచమంతా అణువణువునా వ్యాపించి ఎవరికీ తెలియకుండా ప్రపంచమంతాయున్న మొదటి పురుషున్ని 'బాహ్య దేవుడు' అని అనవచ్చును. శరీరములోపలయున్న ఆత్మ తెలియదు కావున 'ఆత్మ శరీరములోని దేవుడు'గాయున్నది. ఇట్లు దేవుడు అను పదమును రెండు విధములుగా వాడవచ్చును. మాటల సందర్భములో 'దేవుడు బుద్ధి పుట్టించితే' అని అప్పుడప్పుడు అంటూవుంటాము. దేవుడు పనిచేయని

వాడని ఒకవైపు చెప్పుచూ, మరొకవైపు దేవుడు బుద్ధి పుట్టించితే అనడములో దేవుడు పని చేసినట్లే కదా! అందువలన దైవజ్ఞానమును మాట్లాడునప్పుడు పూర్తి ఎరుక కల్గి మాట్లాడవలెను. శరీరాంతర్గతములో అన్నీ చేయువాడు మధ్య ఆత్మే అయినందున, మధ్య ఆత్మను 'దేవుడు' అని ఉచ్ఛరించుచూ మధ్య ఆత్మ చేయు పనులను దేవుడు చేయుచున్నాడని చెప్పవచ్చును. మనకు మధ్య ఆత్మ విషయము తెలియకపోయినా **'దేవుడు నన్ను ఎట్లు ఆడిస్తే అట్లు ఆడగలను'** అని ఒకడు అంటున్నాడు. **'దేవుడు చేపిస్తే నేను చేశాను'** అని మరొకడు అంటున్నాడు. **'దేవుడు నా బుద్ధికి అందిస్తే చెప్పగలను'** అని ఇంకొకడు అంటున్నాడు. దేవుడు పని చేయనివాడని, దేవుడు తన ప్రాథమిక ధర్మము ప్రకారము కార్యరహితుడని మనము జ్ఞానములో చెప్పుకొన్నా, కొన్ని సందర్భములలో మనకు తెలియకుండానే దేవుడు పనిచేయువానిగా చెప్పుచున్నాము.

మొదట పురుషుడయిన దేవుడు ప్రపంచము పుట్టక పూర్వము స్థిరాస్థిరుడని చెప్పబడుట వలన ఆయనను ఊహించుటకు కూడా సాధ్యమయ్యేది కాదు. ప్రపంచము సృష్ఠించబడక పూర్వము దేవుడు దేనికీ సంబంధము లేనివాడుగా యుండెడివాడు. అప్పుడు దేవుడు అనే పదము కూడా ఆయనకు వర్తించదు. వెదికేవాడే లేనప్పుడు వెతకబడేవానిని గురించి ఏమీ చెప్పలేము. అటువంటి శూన్యస్థితిలో అనగా సృష్ఠికి పూర్వము **'నిరామయుడు, నిర్వికారుడు, నిరాధారుడు, దేనికీ సంబంధము లేనివాడు'**, ఆయనను గురించి ఎటూ చెప్పలేము. అందువలన సృష్ఠికంటే పూర్వమున్న వానిని ఎటూ చెప్పలేక ఆయన అన్నిటికీ సంబంధము లేనివాడని చెప్పాము. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథములో అల్ ఇఖ్లాస్ అను 112వ సూరాలో నాలుగు వాక్యములుగా చెప్పారు చూడండి.

**(112-1,2,3,4) "1) ఆయన ఒక్కడే గలడు. 2) ఆయనకు ఎవరి అక్కరా లేదు. 3) ఆయనకు సంతానము లేదు, ఆయన ఎవరికీ సంతానము కాదు. 4) ఆయనకు సమానము ఏదీ లేదు."**

ఒక దైవగ్రంథములో చెప్పిన నాలుగు విధానములను చాలామంది చదివారు. హిందువులు, క్రైస్తవులు ఈ వాక్యములను చదివియుండరు. ఎందుకనగా! అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో చివర 112వ సూరాలో చెప్పినందున, ఖురాన్ గ్రంథమును ముస్లీమ్‌లు తమ గ్రంథమని చెప్పుకోవడము వలన, మతభేదమున్న వారందరూ వారిది మేమెందుకు చదవాలని హిందువులు, క్రైస్తవులు చదవకుండా వదిలివేయడము జరిగినది. అంతిమ దైవగ్రంథములో 112వ సూరాలోని నాలుగు వాక్యములు నాకు చాలా ఇష్టమైనవని నేను ఎన్నోమార్లు చెప్పియుండడమూ కొందరికి తెలుసు. ఈ వాక్యములు నాకు ఎందుకు ఇష్టమో చాలామందికి తెలియదు. ఈ వాక్యములను చదివిన ముస్లీమ్‌లు చాలామంది గలరు. అయితే వారిలో కనీసము ఒక్కరికయినా ఈ సూరా అర్థమయిందని చెప్పలేము. ఈ సూరాలోని నాలుగు వాక్యములలో ఒక్క వాక్యమునకు కూడా సరియైన జవాబును చెప్పలేరు. ఎందుకు చెప్పలేరు అనగా! 112వ సూరా మొత్తము నాలుగు వాక్యములు సృష్ఠి పూర్వమున్న దేవున్ని గురించి చెప్పిన వాక్యములు. అయితే మనిషికి జ్ఞానము ద్వారా తెలిసినది సృష్ఠి తర్వాత గల దేవుని విషయము. సృష్ఠి తర్వాత గల దేవున్ని గురించి భగవద్గీతలో గుణత్రయ విభాగయోగమున చెప్పిన 3, 4 శ్లోకముల ప్రకారము **"సమస్త మానవులకు తండ్రి దేవుడు"** అని గలదు. ఈ మాట మనుషులందరికీ సంబంధించినదై ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతయందు చెప్పబడినది. ద్వితీయ దైవ గ్రంథము బైబిలులో కూడా దేవున్ని తండ్రియని చెప్పియున్నారు. అంతిమ

దైవ గ్రంథము ఖురాన్‌లో **'సమస్తమును దేవుడు సృష్ఠించెను'** అని చెప్పడమే కాక, **'దేవున్ని సృష్ఠికర్తయని', 'సమస్త మనుషలను సృష్ఠించినవాడు అల్లాహ్ యని'** చెప్పియున్నారు. అలా చెప్పడము వలన దేవుడు అందరికీ తండ్రియని తెలియబడుచున్నది.

తండ్రియైన దేవుడు అని బైబిలు గ్రంథములో యోహాన్ సువార్త 6వ అధ్యాయము 27వ వచనమందు గలదు. **(యోహాన్ 6-27)** **"క్షయమైన ఆహారము కొరకు కష్టపడకుడి గానీ నిత్యజీవము కలుగజేయు అక్షయమైన ఆహారము కొరకే కష్టపడుడి. మనుష్య కుమారుడు దానిని మీకిచ్చును. ఇందుకై "తండ్రియైన దేవుడు" ఆయనకు ముద్రవేసి యున్నాడు"** అని గలదు. భగవద్గీతయందు గుణత్రయ విభాగయోగమున 4వ శ్లోకములో "అహం బీజ ప్రదః పితా" **'బీజదాతనైన నేను తండ్రిని'** అని చెప్పియున్నాడు. అంతేకాక అదే భగవద్గీతయందు రాజవిద్యా రాజగుహ్యాయోగమున 17వ శ్లోకమందు "పితాహ మస్య జగత్" అని గలదు. దాని అర్థము **"సమస్త జగతికి తండ్రిని నేనే"** అని కలదు. అదే ఖురాన్ గ్రంథములో కూడా సూరా 10, ఆయత్ 56లో **(10-56) "దేవృడే ప్రాణము పోస్తాడు, దేవృడే ప్రాణము తీస్తాడు. మీరంతా ఆయన వద్దకే మరలింపబడుతారు"** అని కూడా కలదు. అంతేకాక **'అందరికీ సృష్ఠికర్తయైన దేవుడు'** అని చాలామార్లు ఖుర్‌ఆన్ గ్రంథములోనే చెప్పబడినది. ఈ విధముగా మూడు దైవ గ్రంథములలో **"దేవుడు అందరికీ తండ్రి"** అని చెప్పియున్నారు. అయితే ఖురాన్ గ్రంథములో **112వ సూరాలో 3వ ఆయత్‌నందు "ఆయనకు సంతానము లేదు, ఆయన ఎవరికీ సంతానము కాదు"** అని కలదు. దైవగ్రంథములో ఒకమారు దేవుడు చెప్పినమాటకు వ్యతిరేఖముగా రెండవమారు దేవుడు చెప్పలేదు అను మాట ప్రకారము

చూస్తే, మూడు గ్రంథములలోనూ దేవునికి సంతానముంది, సమస్త జీవులు ఆయన సంతతియే, అందరికీ ఆయనే తండ్రియని చెప్పియున్నాడు. అలా చెప్పినవాడు అంతిమ దైవగ్రంథములో చివరిలో 112వ సూరాలో మూడవ వాక్యమందు **"నాకు సంతతే లేదు"** అని ముందు మాటలన్నిటికీ వ్యతిరేఖముగా చెప్పాడు. **'దేవుడు సత్యబద్ధుడు, సత్యసమేతముగా తన జ్ఞానమును ప్రజలకు అందించాడు'** అని చెప్పిన వారి మాటకు వ్యతిరేఖముగా 'నాకు సంతతి లేదు' అని చెప్పాడు. ఈ మాటను చాలామంది ముస్లీమ్‌లు కూడా చెప్పగా విన్నాము. మూడు గ్రంథములలో చెప్పిన మాటకు పూర్తి వ్యతిరేఖముగా 112వ సూరాలో వాక్యమున్నది. దేవుడు ఎందుకు అలా ఒకచోట ఒకరకము మరొకచోట మరొక రకముగా చెప్పాడు? అని అడిగాము. దానికి చాలామంది ముస్లీమ్‌లు దేవుడు చెప్పిన మాటను ప్రశ్నించకూడదు. దేవుడు దేనిని చెప్పితే దానినే నమ్మవలెను, దానినే వినవలెను. అంతేగానీ అదెలాయని ప్రశ్నించకూడదు అని అంటున్నారు.

దేవుడు **'అందరికీ తండ్రిని నేనే'**యని ఒకచోట చెప్పి, మరియొక చోట **'ఎవరికీ నేను తండ్రిని కాను'** అంటే, అప్పుడు రెండు మాటలగును కదా! ఆ రెండు మాటలలో దేనిని నమ్మాలి? అని ప్రశ్నిస్తే దేవుడు ఏది చెప్పినా వినాలి, నమ్మాలి అంతేగానీ తిరిగి ప్రశ్నించకూడదు అని ఒక కథ చెప్పుచున్నారు. దేవుడు మన ఎదుటే ఒక పక్షిని చంపి నాలుగు ముక్కలుగా నరికి, నాలుగు ముక్కలను నాలుగు వైపుల విసరివేసి తర్వాత ఆ పక్షిని పిలిస్తే అది బ్రతికి వచ్చింది. ఇక్కడ పక్షి చచ్చిపోయింది కదా!యని ప్రశ్నించకూడదు. దేవుడు ఏమయినా చేయగలడు. ఆయన అనుకొంటే ఏదయినా సాధ్యమే. అందువలన దేవుని విషయములో ప్రశ్న ఉండకూడదు అని అంటున్నారు. ఒక విధముగా ఈ వాదము సరియైనదని దేవుడు

కూడా ఒప్పుకోడు. ప్రశ్న ఉన్నప్పుడే జవాబు ఉంటుంది. ఆకలి లేనిది ఆహారముతో అవసరమే లేదు. తెలుసుకోవాలను ఆసక్తియున్నప్పుడే చెప్పే దానిని వినగలడు. మొదటికి వినే ఆసక్తి, తెలుసుకోవాలను శ్రద్ధ లేనప్పుడు మనిషికి వినే అవసరమే ఉండదు. తెలుసుకోవాలను ఆసక్తినే **'శ్రద్ధ'** అంటున్నాము. శ్రద్ధ యున్నప్పుడే మనిషి దేనినయినా ఓపికగా తెలుసుకో గలడు. శ్రద్ధలేని వానికి ఏమి చెప్పినా అది వాని బుర్రకు ఎక్కదు. **భగవద్గీతలో అర్జునుని ప్రశ్నలున్నాయి, కృష్ణుని జవాబులున్నాయి.** అలాగే **బైబిలులో శిష్యుల ప్రశ్నలకు ఏసు జవాబులిచ్చాడు. ఖురాన్ గ్రంథములో కూడా దేవుడు తన జ్ఞానమును సత్యసమేతముగా చెప్పాడుగానీ, ఎక్కడా అనుమానముండునట్లు చెప్పలేదు. చాలాచోట్ల 'విడదీసి చెప్పుచున్నాను', 'వివరముగా చెప్పుచున్నాను'** అని కూడా చెప్పాడు.

అంతేకాక తనది దైవగ్రంథమయిన దానివలన అది అన్నిటికీ **'గీటురాయి'** అని చెప్పాడు. ఇప్పుడు ఒక ఉదాహరణను చెప్పుకొందాము. ఒక బంగారు షాపులోనికి ఒక రైతు తన బంగారును అమ్ముకోవడానికి తెచ్చుకొన్నాడు. బంగారు షాపు యజమాని ప్రతి దినము బంగారును చూస్తున్నా, అప్పుడు రైతు తెచ్చిన బంగారు స్వచ్ఛమైనదో కాదోయనీ, అతను తెచ్చినది బంగారమో కాదో తేల్చి చూచుకోవడానికి తనయొద్ద ఒక రాయిని ఉపయోగించి చూచాడు. రైతు తెచ్చిన బంగారును ఆ రాయితో గీచి చూచి అది బంగారమో కాదో తేల్చుకొన్నాడు. అట్లే అది స్వచ్ఛమయిన బంగారమా! కాదా!యను విషయము కూడా తెలిసిపోయింది. రాయితో గీచి చూడడము వలన బంగారము యొక్క బండారము బయటపడుచున్నది. అందువలన బంగారును పరీక్షించుటకు ఉంచుకొన్న రాయిని "గీటురాయి" అంటున్నాము. ఏ విధముగా బంగారు స్వచ్ఛతను తెలియుటకు గీటురాయిని

ఉపయోగిస్తున్నామో, అలాగే దేవుని జ్ఞాన విషయము బంగారులాంటిదే కావున దీనిని కూడా గీచి చూచుకొనుటకు దేవుడు **'గీటురాయి'** తప్పనిసరిగా అవసరము అంటున్నాడు.

ఏ విషయములో అయినా, ఏ జ్ఞానములో అయినా అందులోని స్వచ్ఛత, అందులోని సత్యాసత్యము తెలుసుకొనుటకు తన గ్రంథమే గీటురాయిగా ఉన్నదని చెప్పిన దేవుడు తన జ్ఞాన విషయములో ప్రశ్నించవద్దని, ప్రశ్నించకూడదని చెప్పునా? అట్లు ఎక్కడా చెప్పలేదు. అలా చెప్పాడనీ, జ్ఞాన విషయములో చెప్పిందే వినాలిగానీ ప్రశ్నించకూడదనీ, చెప్పేవారు వినేవారిని మోసము చేయడానికేగానీ వేరు ఏమీ లేదని తెలియుచున్నది. అల్లాహ్ మాటను ప్రశ్నించకూడదని అలా ప్రశ్నించడము అవిశ్వాసము అవుతుందని చెప్పడము మోసపూరితమే గానీ, వేరు కాదు. బంగారును ఎంతో కాలమునుండి చూస్తున్న బంగారు వ్యాపారి కూడా కొనే ప్రతి బంగారును గీటురాయితో గీచి చూచి అది స్వచ్ఛమయినదో కాదో, అందులోని స్వచ్ఛత ఎంతో తేల్చి చూచుకొనును. అలాగే దేవుడు జ్ఞాన విషయములలో స్వచ్ఛత తెలుసుకొను నిమిత్తము తన గ్రంథమునే గీటురాయిగా ఇచ్చాడు. ఎవరూ మోసపోకుండా తేల్చుకొనుటకు, తెలుసు కొనుటకు తన గ్రంథమును ఇచ్చి తానే ప్రశ్నించవద్దని చెప్పునా, బంగారును కంటితో చూడు రాయితో పరీక్షించవద్దని చెప్పునా? దేవుడు అలా ఎక్కడా చెప్పలేదు. ఇతరులను మోసము చేయదలచుకొన్నవాడు తన బంగారు స్వచ్ఛమయినదని, దానిని పరీక్షించి చూడవద్దని చెప్పును. అలాగే కొందరు బోధకులుగాయున్న ముస్లీమ్‌లు ఇతరులను ప్రశ్నించకూడదని నియమమును ఉంచి అమాయకమైన ముస్లీమ్‌లను ఎందరినో వారు చెప్పినది వినునట్లు చేసుకుంటున్నారు. అవసరమైతే పక్షి, పర్వతాల కథను చెప్పి దేవుడు పిలిస్తే చచ్చిపోయిన పక్షి వచ్చింది కదా! అని నమ్మబలుకుచున్నారు.

ఇటువంటి మోసములు చేయడములో మానవుడు చేయితిరిగిన వాడని తెలిసిన దేవుడు ముందే తన చివరి గ్రంథమున గీటురాయిని గురించి చెప్పాడు. "దివ్యఖురాన్ సందేశం" అను గ్రంథములో సూరా 2, ఆయత్ 53యందు (2-53) **"మరియు (జ్ఞాపకము చేసుకోండి!) మీరు సన్మార్గులవుతారేమోనని మేము మూసాకు గ్రంథాన్ని మరియు (సత్యా సత్యాలను వేరు చేసే) గీటురాయిని ప్రసాదించాము"** అని చెప్పాడు. అంతేకాక మరియొక చోట ఇలా కలదు **(3-4) "దీనికి ముందు ప్రజలకు సన్మార్గము చూపడానికి మరియు (సత్యాసత్యాలను విశదీకరించే) ఈ గీటు రాయిని కూడా అవతరింపజేశాడు. నిశ్చయంగా ఎవరయితే అల్లాహ్ ఆజ్ఞలను తిరస్కరిస్తారో వారికి కఠిన శిక్ష ఉంటుంది. మరియు అల్లాహ్ (దేవుడు) సర్వశక్తిమంతుడు, ప్రతీకారము తీర్చుకోగలవాడు"** అని గలదు. అంతేకాక మరియొక చోట ఇలా కలదు చూడండి.

**(21-48) "మేము మూసా మరియు హారూన్‌లకు తీర్పులు చేసే గీటురాయిని, జ్యోతిని భయభక్తులుగలవారికి హితోపదేశముతో కూడిన గ్రంథాన్ని ఇచ్చాము"** అని కలదు. ఇంకా **(25-1) "సర్వలోకాలకు హెచ్చరిక చేసేదిగా ఈ గీటురాయిని తన దాసునిపై క్రమక్రమముగా అవతరింపజేసిన ఆయన (దేవుడు) ఎంతో శుభదాయకుడు"** అని చెప్పియున్నారు. ఈ విధముగా ఇన్ని వాక్యములలో దేవుడు తాను గ్రంథరూపముగా, జ్ఞాన రూపముగా ఇచ్చిన గీటురాయిని గురించి చెప్పాడు. దేవుడిచ్చిన గీటురాయిని తెలియని వాడు ఏది సత్యమైన జ్ఞానమో, ఏది అసత్యమైన జ్ఞానమో తెలియలేడు. అటువంటప్పుడు జ్ఞానవిషయములో మోసపోవు అవకాశము గలదు. ఇప్పుడు దేవుని సంతతి విషయములో సందిగ్ధత వచ్చినది. ఏది సత్యమో, ఏది అసత్యమో తెలియని పరిస్థితి ఏర్పడినది. సత్యాసత్యములను

తేల్చుకొనుటకు మొదటనే మూసా ప్రవక్తకు **'తౌరాత్ గ్రంథము'**ను ఇచ్చానని 2-53లో చెప్పియున్నారు. అరబ్బీ భాషలో 'తౌరా' అనగా మూడు అని అర్థము. **'తౌరాత్'** అనగా **'మూడు రాత్రులని'** అర్థము. **తౌరాత్** అను పేరుతో మూడు ఆత్మల వివరముగల **భగవద్గీత** గ్రంథమును ఇవ్వడము జరిగినది.

బంగారు విషయములో గీటురాయిని ఉపయోగించినట్లే బంగారు పోలికయున్న దేవుని జ్ఞానములో ఇది నిజమైనదా! కాదా!యని అనుమానము వచ్చినది. అందువలన ఇక్కడ గీటురాయిని ఉపయోగించి జవాబును నిర్ణయించుకోవలసియున్నది. ఇప్పుడు ఈ విషయము సులభముగా అర్థమగుటకు ఒక చిన్న ఉదాహరణను తీసుకొని చూస్తాము. 20 సంవత్సరముల వయస్సున్న ఒక యువకున్ని నీకు పిల్లలెంతమంది? అని ప్రశ్నిస్తే అబ్బే! నాకు పెళ్ళేకాలేదు, భార్యలేనిది పిల్లలెలా పుట్టగలరు. నాకు సంతానము లేదండీ! అని చెప్పాడు. అప్పుడు ఆ యువకుడు సైకిల్ మీద ప్లాస్టిక్ బిందెలను అమ్ముకొని వ్యాపారము చేసుకొనేవాడు. ఒక బిందెను కొనుక్కొనే సమయములో బిందె రేటును తగ్గించమని అడిగే దానికొరకు మాట పరిచయముండాలి కదా!యని బిందెను కొనేవాడు ఆ విధముగా అమ్మేవానిని అడిగాడు. తర్వాత ఐదు సంవత్సరములు గడచినది. బిందెలు అమ్మేవాడు బజారులో ఒక షాప్ పెట్టుకొని అందులో స్టీల్‌పాత్ర సామాన్ల వ్యాపారము చేయుచుండెను. ఆ సమయములో ఐదు సంవత్సరముల క్రిందట బిందెను కొన్నవాడు, స్టీల్ సామాన్ల షాప్‌కు వచ్చి పూర్వము బిందెను అమ్మిన వానిని గుర్తించాడు. అప్పుడు మాటల సందర్భములో బిందెల వ్యాపారమును తీసివేసి పాత్రల వ్యాపారమును పెద్దగా పెట్టావే! అని అడిగాడు. అప్పుడు స్టీల్ పాత్రల వ్యాపారి "ముగ్గురు బిడ్డలున్నారు వారి

కట్నము కొరకు డబ్బు సంపాదించాలంటే ఇలా వ్యాపారమును పెద్దగా చేసుకోవలసి వచ్చినది" అని అన్నాడు. అప్పుడు కొనే దానికి వచ్చిన వాడు "ఇంతకుముందు పిల్లలే లేరు అన్నావు, ఇప్పుడేమో ముగ్గురు పిల్లలని అబద్ధమును చెప్పుచున్నావా" అని అడిగాడు. అప్పుడు లేరు, ఇప్పుడున్నారని షాప్ యజమాని చెప్పినా ఇతను నమ్మలేదు. మొదట చెప్పినమాటనే గట్టిగా నమ్మియున్నాడు. నేను ఐదు సంవత్సరములప్పుడు అడిగాను అప్పుడు సంతతేలేదు అనినవాడు ఐదు సంవత్సరములలో ముగ్గురు పిల్లలకు ఎలా తండ్రి అయినాడు అని ప్రశ్న మిగిలిపోయింది. తర్వాత ఆ విషయములోని సత్యాసత్యమును తెలియు నిమిత్తము అమ్మేవానితో, కొనేవానితో పరిచయమున్న ఒక వ్యక్తి దగ్గరికి పోయి తన సందిగ్ధమును అడిగాడు.

"అయ్యా! నాకు ఒక అనుమానము వచ్చింది. ఐదు సంవత్సరముల క్రిందట నేను ఒక వ్యక్తిని అతని సంతతిని గురించి అడిగాను. అప్పుడు అతడు నాకు భార్యే లేదు, సంతతి ఎలా కల్గును అని తిరిగి ప్రశ్నించి నాకు ఎవరూ పుట్టలేదు, ఎవరూ సంతతి లేదు అని చెప్పాడు. ఇప్పుడు కూడా అదే మనిషిని సంతతిని గురించి అడిగాను, ముగ్గురు బిడ్డలని చెప్పాడు. తర్వాత భార్య ఏమి చేస్తుంది అని అడిగాను, నాకు భార్యలేదు అన్నాడు. ఆ మాట విన్న నాకు పెద్ద సంశయము వచ్చినది అప్పుడూ భార్యలేదు, ఇప్పుడూ భార్యలేదు. అప్పుడు సంతానము లేదు. అయితే ఇప్పుడు సంతానముంది అంటున్నాడు. అతని మాటను ఎలా నమ్మాలి?" అని అడిగాడు. ఇప్పుడు మూడవ వ్యక్తిని రెండవ వ్యక్తి గీటురాయిగా ఉపయోగించుకొన్నాడు. సత్యాసత్యములను తేల్చి చెప్పునది గీటురాయే, కావున మూడవ వ్యక్తి ఇలా అన్నాడు. "అతనికి భార్య మొదట లేదు ఇప్పుడు లేదు. అయితే మధ్యలో ఉండవచ్చును కదా! నీవు అడిగినప్పుడు

పెళ్ళికాలేదు, భార్యలేదు. ఇప్పుడు అడిగినప్పుడు పిల్లలున్నారు భార్య లేదు. అయితే ముగ్గురు పిల్లలు పుట్టగానే భార్య చనిపోయివుండవచ్చును కదా! ఆ ఆలోచన నీకెందుకు రాలేదు. అతను చెప్పిన దానిలో సత్యముంది అయితే నీవు విన్న దానిలో అనుమానమున్నది. నాకు తెలిసిన వాస్తవము ప్రకారము అతనికి భార్య ఉన్నా, ఇప్పుడు ఆమె అతనికి చాలా దూరముగా యున్నది. అంతేకాక ఇతని మీద (భర్తమీద) ఆధారపడకుండా స్వంతముగా బ్రతుకుతాయున్నది. ఆమె భర్తను వదలివేసి దూరముగా ఉండుట వలన ఇతను తనకు భార్యలేదని" చెప్పుచున్నాడు. వివరము తెలియకపోతే భార్య లేకుండా ఐదు సంవత్సరములలో ముగ్గురు పిల్లలెలా పుట్టగలరని ప్రశ్న రావచ్చును.

ఇక్కడ పాత్రల వ్యాపారి రెండుమార్లూ సత్యమే చెప్పాడు. అయితే ఆ విషయమును మరొకడు అనుమానముతో మరియు తెలివి తక్కువతో నమ్మలేకపోయాడు. అలాగే దేవుని విషయములో కూడా జరిగింది. దేవుడు ఒకమారు సంతతి లేదు అనియు మరొకమారు సంతతి వుంది అనియు దేవుడు చెప్పగా మనము కూడా నమ్మలేకపోయాము. దేవుడు మొదట చెప్పిన మాటయే నిజమని ఆయనకు సంతతిలేదని ముస్లీమ్‌లు అనుచుండగా, లేదు ఆయనకు సంతతి వుంది. మనమంతా ఆయన సంతతే కదా!యని హిందువులు అంటున్నారు. కొందరేమో అటు ఇటు కాకుండా రెండూ సత్యమేయని అంటున్నారు. కొందరేమో రెండూ అసత్యమేయని అంటున్నారు. ఈ విధముగా ఎటూ తేల్చుకోలేని పరిస్థితి నేడు మనుషులలో కలదు. ఈ సమస్యను తేల్చి చెప్పుటకు, ఏది నిజమో ఏది అబద్దమో నిర్ణయము చేసి చెప్పుటకు గీటురాయి అవసరము. గీటురాయి అనునది తాను మొదట ఇచ్చిన తౌరాత్ గ్రంథమేనని దేవుడు

ఖురాన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 53లో చెప్పడమైనది. **దేవుడిచ్చిన గీటురాయిని ఉపయోగించుకొని ఇందులోని సత్యమును మనము తెలియవచ్చును.**

దేవుడు అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో 112వ సూరాలో 3వ ఆయత్‌నందు 'నాకు సంతతి లేదు' అని చెప్పాడు. అంతేకాక 6వ సూరాలో 101వ ఆయత్‌లో ఇలా చెప్పాడు. **(6-101) "ఆకాశమును భూమిని తయారు చేసినవాడు ఆయనే. దేవునికి భార్యయే లేనప్పుడు ఆయనకు సంతానము ఎలా కలుగుతుంది? ఆయన ప్రతి వస్తువును సృష్టించాడు. ప్రతి జీవరాశిని సృష్టించాడు. ఆయనకు ప్రతీదీ బాగా తెలుసు"** అని కలదు. గీటురాయి ప్రకారము దేవుడు సృష్టికి పూర్వము 112వ సూరాలో చెప్పినట్లు సంతతి లేనివాడుగాయున్నాడు. స్థిరాస్థిరునిగా యున్నప్పుడు ఆయన దేనినీ సృష్ఠించలేదు. అందువలన ఆయన దేనికీ తండ్రికాదు, ఆయన తండ్రి కానప్పుడు ఆయనకు సంతతి లేనట్లే కదా! అప్పుడు ప్రకృతియేలేదు. అక్కడికి ఆ మాట సత్యమే ప్రకృతి దేవునికి భార్యగా యుండుట వలన సృష్టికి పూర్వము ప్రకృతి లేని దానివలన ఆయనకు అప్పుడు భార్య లేదు. భార్యయే లేనప్పుడు సంతతి ఎలా కలుగుతుంది? ప్రకృతియున్నప్పుడే జీవరాశుల శరీరములు తయారగు చున్నవి. ప్రకృతి ఉన్నప్పుడు జీవరాశులు పుట్టుటకు అవకాశము కలదు. అందువలన భార్యయే లేనప్పుడు సంతతి ఎలా కలుగుతుందని (6-101) లో చెప్పడమైనది. ఇక్కడికి ఈ మాట సత్యమే! అయితే అదే దేవుడే కొన్ని సందర్భములలో **'తండ్రియైన నేను'** అనీ, **'సకల జీవులకు నేనే తండ్రిని'**యనీ చెప్పడము జరిగినది. సృష్టి జరిగిన తర్వాత ప్రకృతి ఏర్పడి ప్రకృతికి దైవ బీజముతో అనేక జీవరాశులు పుట్టడము జరిగినది. అప్పుడు ఆయన

సమస్త జీవరాశులకు తండ్రియని చెప్పడము సత్యమైనది. ఇక్కడ సృష్టి తర్వాత ఆయనకు భార్య వున్నది. సంతతి కలదు. ఇప్పుడు దేవుడు "పితాహమస్య జగతో" అను భగవద్గీత వాక్యము ప్రకారము 'అందరికీ తండ్రి' అనుమాట సత్యమే. ఒకే సమయములో రెండు మాటలు సత్యము కాలేవు. వేరువేరు సందర్భములలో సంతతి లేదు, సంతతియున్నది అను రెండు రకముల మాటలు పరస్పర విరుద్ధముగాయున్నా సత్యమే అయినవి.

దీనినిబట్టి సృష్టికి పూర్వమున్నవాడే సృష్టి తర్వాత కూడా యున్నా అప్పుడు పెళ్ళికానివాడు, ఇప్పుడు పెళ్ళి అయినవానిగా గుర్తించాలి. సృష్టికి పూర్వము స్థిరాస్థిరునిగాయున్న దేవుడు సృష్టి తర్వాత స్థిరుడయినాడు. సృష్టికి ముందున్న దేవున్ని సృష్టికి తర్వాతయున్న దేవున్ని వివరముగా తెలియగలిగితే గీటురాయి ద్వారా సత్యాసత్యమును తెలిసినట్లగును. దేవుడు ముందే తన మొదటి దైవగ్రంథము భగవద్గీతను ఇచ్చి అందులో జ్ఞానమును గీటురాయిగా చేసి ఇచ్చాడు. పురుషులు ముగ్గురని సృష్టి తర్వాత చెప్పుకున్నా, సృష్టికి పూర్వము ఒకే పురుషుడు ఉండేవాడు. సృష్టికి పూర్వము విభజింపబడని పురుషుడు ఉండేవాడు. సృష్టికి పూర్వము ఉండే వానిని పురుషుడు అనికూడా చెప్పలేము. అందువలన ముందే ఎటూ పోల్చుకోలేని విధముగా ఉండునని ఒకమాటను చెప్పాము. సృష్టికి ముందున్న దేవున్ని దేవుడు అనికూడా చెప్పుటకు ఆధారముగానీ, వీలుగానీ లేదు. అందువలన అప్పుడున్న వానిని **"స్థిరాస్థిరుడు"** అన్నాము. స్థిరుడు అస్థిరుడు అను రెండు మాటలలో నిజాన్ని అబద్ధాన్ని, తప్పును ఒప్పును, మంచిని చెడును రెండిటినీ కలిపి చెప్పినట్లు కలదు. అటువంటి వానిని ఏమని తేల్చి చెప్పుటకు వీలుకాదు.

సృష్టికి పూర్వము ఏమీకానివాడు, సృష్టి తర్వాత పురుషునిగా చెప్ప బడ్డాడు. తనను తాను పురుషునిగా ప్రకటించుకొన్నాడు. అలా ప్రకటించు

కొన్న తర్వాత తాను మూడుగా విభజింపబడి సర్వజీవులయందు ఉన్నట్లు తన మూడు గ్రంథములయందు చెప్పాడు. ముగ్గురు పురుషులకు వివరమిస్తూ మొదటి ఇద్దరి పురుషులను దేవుడు అని చెప్పుటకు వీలున్నదని తెలిపాడు. మూడవ పురుషుడు జీవుడుగా చెప్పబడినాడు. ఈ పురుషుల విషయము మూడు మతములు అనుసరించు మూడు గ్రంథములలోయున్నా మూడు మతములలో ఏ ఒక్క మతమువారికి ముగ్గురు పురుషుల విషయము తెలియలేదు. నేడు మేము ప్రత్యేకించి ముగ్గురు పురుషుల విషయము చెప్పుచుండగా కొందరు ఆశ్చర్యముగా చూచుచుండగా, కొందరు అసూయతో చూస్తున్నారు. మాకు తెలియని జ్ఞానము నీకు తెలియునా? అని ప్రశ్నించుచున్నారు. మీకు తెలియదనేగా నేను చెప్పుచున్నాననగా! వింతగా చూస్తున్నారు.

ముగ్గురు పురుషుల వివరము తెలియకపోయినందున, మూడు మతములవారు ఎవరికి తెలిసిన దానిని వారు అదే గొప్పయని అంటున్నారు. ముగ్గురు మూడు కోణములలో వాదించుచున్నారు. ఒకరు చెప్పినది మరొకరు ఒప్పుకోవడము లేదు. హిందువులు విగ్రహారాధనను ఎక్కువగా అనుసరించగా, ముస్లీమ్‌లు విగ్రహారాధనను పూర్తిగా ఖండించుచున్నారు. క్రైస్తవులు ఎటు కాకుండా మధ్యలోయున్నారు. హిందువుల విగ్రహారాధనను క్రైస్తవులు కూడా ఖండించుదురు. అయితే ముస్లీమ్‌లు చెప్పినట్లు 'దేవుడు పుట్టడు' అను మాటను ప్రక్కనపెట్టి దేవుడు పుట్టుననే చెప్పుదురు. ఇట్లు ప్రతి విషయములోను ఎవరి వాదనను వారు గట్టిగా చెప్పుచుందురు. వీరందరికి గీటురాయి అవసరమని మాకు అర్థమయినా, వారు మేమే గీటురాయిగా ఉన్నామని చెప్పుచుందురు. దేవుడే దిగివచ్చి ఇది సత్యము, ఇది అసత్యమని తేల్చి చెప్పినా దానిలోని వాస్తవమును గ్రహించక మాకు

తెలిసిందే సత్యమని, నీకంటే మాకే బాగా తెలుసునని వాదించుచున్నారు. వారివారి మత ఆచరణల ముందర, వారివారి మతపెద్దలు చెప్పిన మత నియమముల, మత ధర్మముల ముందర దేవుని మాట కూడా తీసివేయబడు చున్నది. ఈ విధముగా ముగ్గురు పురుషుల విషయమును వదలి అన్ని మతముల వారు ప్రక్క దారిలో పోవుచూ దేవునికి దూరమగుచున్నారు. దేవునికి మేమే దగ్గరగా యున్నామనీ, తమ జ్ఞానమే అసలయిన దేవుని జ్ఞానమని, మా మార్గమే అన్ని మతములకంటే మించిన మార్గమని తలచి మేము దేవునివైపు పోతున్నామని అనుకొను వారందరూ వారికి తెలియకనే దేవునికి దూరమగుచున్నారు. దీనికంతటికీ కారణము మూడు దైవగ్రంథము లలోయున్న ముగ్గురు పురుషులను తెలియకపోవడమేనని చెప్పవచ్చును. వినేది అర్థము కాకపోతే దానిని తిరిగి అడిగి తెలుసుకోవచ్చును. అట్లుకాక విన్న దానిని గ్రంథ ఆధారము లేకుండా ఖండించకూడదు. విన్న దానిని యోచించి సత్యమో కాదో తేల్చుకోవచ్చును. సత్యమైతే స్వీకరించవలెను. అసత్యమైతే వదలిపెట్టవచ్చును. అలా కాకుండా మొండిగా దేనినీ కాదనకూడదు. ఇప్పుడు జ్ఞాన జిజ్ఞాసకల్గిన వారు ఈ విధముగా ప్రశ్నించు చున్నారు.

**వారి ప్రశ్న :- మేము కొన్ని సంవత్సరములనుండి మాకు తెలిసిన జ్ఞానమునకు అలవాటు పడినాము, మా సమాజములో మేము గొప్ప బోధకులుగా పేరుగాంచి యున్నాము. మేము చెప్పినదంతా విన్నవారు ఎందరో మమ్ములను అనుసరించుచున్నారు. నేడు ఉన్నట్లుండి మీరు క్రొత్తగా ముగ్గురు పురుషుల సిద్ధాంతమును బయటపెట్టి దానిని దేవుడు చెప్పిన ముఖ్యమైన జ్ఞానమని అంటున్నారు. మాకు ఇంతవరకు ఒక పురుషుని జ్ఞానమే తెలియదు. ముగ్గురు పురుషుల జ్ఞానము ఏమాత్రము తెలియదు. మీరేవెూ ఇదే మూడు**

**దైవగ్రంథములలోనున్న ముఖ్యమైన జ్ఞానము అంటున్నారు. అంతేకాక ముగ్గురు పురుషుల జ్ఞానము తెలియకపోతే వాస్తవముగా దేవుని మార్గములో లేనట్లేయని చెప్పచున్నారు. దేవుడు దిగి వచ్చినా ఇదే నిజమైన జ్ఞానమని చెప్పననుచున్నారు. మీరు చెప్పే దాని ప్రకారమైతే ఇంతవరకు మేము తెలుసుకొన్న దానిని పూర్తిగా వదలివేయవలసివచ్చును. మా సమాజములో ఎంతో పెద్ద పేరున్న మేము మా పేరును గౌరవమును వదలి మీరు చెప్పే జ్ఞానములోనికి రావలెనంటే ఎంతో బాధగాయున్నది. ఇప్పడు మేము మీ జ్ఞానమును సమర్థించితే, ఇంతవరకు మావద్ద జ్ఞానమును నేర్చినవారు ఎటుపోవాలి? మీరు మాకు పెద్ద పరీక్ష పెట్టినట్లున్నది. ఇప్పడు మేము ఏమి చేయాలి?**

**మా ప్రశ్న :-** మీకు మీ మత జ్ఞానము కావాలా? దేవుని జ్ఞానము కావాలా? మీకు మీ మతధర్మము కావాలా? దేవుని ధర్మము కావాలా?

**వారి జవాబు :-** నాకు మతముకంటే దేవుడే ముఖ్యము. నాకు దేవుని జ్ఞానమే కావాలి గానీ ఇంతవరకు నా బోధలు వినినవారు మత సాంప్రదాయములలో పూర్తిగా చిక్కుకొనిపోయారు. వారికి ఎంత చెప్పినా వారు క్రొత్త జ్ఞానమువైపు రారు. వారికి దేవుని జ్ఞానమేదో? మత జ్ఞానమేదో? తెలియదు. అందువలన వారికి తెలిసిన జ్ఞానమే గొప్పదని నమ్మి, మత సాంప్రదాయములతో కూడిన జ్ఞానమును వదలి రారు. ఇప్పుడు నేను వారిని వదలి రావలసిందే! అని చెప్పినా, అట్లువస్తే మా సమాజము వారికందరికీ వ్యతిరేఖముగా కనిపిస్తానేమోనని అనుకుంటున్నాను.

**మా ప్రశ్న :-** మతము మధ్యలో వచ్చినది, దేవుడు మొదటినుండి యున్నవాడు. నిన్ను పుట్టించిన దేవునివైపు పోకుండా నీతో సంబంధము లేనివారివైపు పోవడము మంచిదా?

**వారి జవాబు :-** నాకు బాగా అర్థమయినది. మేము ఇంతవరకు తెలిసిన జ్ఞానముకంటే ఎంతో గొప్ప జ్ఞానమును మీరు చెప్పుచున్నారు. అందువలన నేను దేవుని జ్ఞానమువైపే రావాలనుకొంటున్నాను. ఉన్నట్లుండి నేను ఒక్కమారుగా మా జ్ఞానమును వదలి దేవుని జ్ఞానమువైపు రావడము వలన బయట ప్రపంచములో వచ్చే ఆదాయము పోతుంది. తర్వాత బ్రతుకుటకు కొంత ఇబ్బంది కల్గునేమోనని ఆలోచించుచున్నాను. దీనికి మీ సలహా ఏమి?

**మా మాట :-** దేవుని జ్ఞానమువైపు పోవువారికి ప్రపంచ సంబంధ భయములు కల్గడము సహజమే. ఇక్కడే ఎంతో తెలివిగా మనిషి ప్రవర్తించాలి. నన్ను అడిగావు కాబట్టి నేను ఉన్న సత్యమును చెప్పుచున్నాను. ప్రతి మనిషి ప్రపంచములో బ్రతకవలసిందే. ప్రపంచ బ్రతుకు తెరువుకు జ్ఞానమునకు ఎటువంటి సంబంధములేదు. అయినా ప్రపంచములో సహజముగా కర్మలనుబట్టి బ్రతుకుతెరువు మారుచుండును. మనిషి పుట్టినప్పుడే ఆ మనిషి జీవితములో గడిచే ప్రతి క్షణమును గురించి వ్రాసిపెట్టబడి యుండును. అలా వ్రాసిన దానినే కర్మ అనియూ, ప్రారబ్ధ కర్మ అనియూ అంటున్నాము. ఆ కర్మపత్రములో ప్రతి దినము, ప్రతి క్షణము ఏమి పొందాలో, ఏమి అనుభవించాలో వ్రాసి పెట్టబడియుండును. దానిప్రకారమే ప్రతీదీ జరుగుచున్నది, అనుభవానికి వస్తున్నది. కర్మ నిర్ణయము లేని మనిషిగానీ, జంతువుగానీ ఎవడూ భూమిమీద లేడు. **అందరికీ కర్మపత్రములో వ్రాయబడిన అనుభవముల ప్రకారమే జీవితము గడుచుచుండును.** ఇది మానవుల ఎడల నిర్ణయించబడిన కర్మచట్టము. ఆ చట్టము ప్రకారమే నీకుగానీ, నాకుగానీ జరుగుచుండును. ప్రతీదీ లోపల యున్న వ్రాత ప్రకారమే జరుగుచుండుట వలన బయట జరిగే

విషయములను జ్ఞానముతో జోడించకూడదు. బయట విషయములు అన్నియూ లోపల కర్మనుబట్టి జరుగునుగానీ, బయట విషయములు ఏవి అయినా కర్మలో లేనివి జరుగవు. బయట ఏమో జరుగునని భయపడడము, దానివలన దేవుని జ్ఞానమును వదలుకోవడము అధర్మమగును. దేవుని జ్ఞానము ప్రకారము స్వధర్మమును వదలి పరధర్మములో ప్రవేశించినట్లగును. దీనిని గురించి ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో కర్మయోగమను అధ్యాయమున 35వ శ్లోకమందు ఇలా చెప్పారు చూడండి.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠి తాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

**భావము :- "ఆచరించుటకు ఎంతో అనుకూలమున్న పరధర్మముకంటే స్వధర్మమే ఎంతో శ్రేయస్కరమైనది. ఇతరుల ధర్మములోవుండు భయము కంటే స్వధర్మములోయుండు మరణమైనా మంచిదే"** అని చెప్పారు. ఇక్కడ పరధర్మము అనగా అజ్ఞానమునకు సంబంధించినదని, ప్రపంచ సంబంధమైనదని అర్థము. స్వధర్మము అనగా జ్ఞాన సంబంధమైనది, దైవికమైనదని అర్థము. ప్రపంచ సంబంధ మత జ్ఞానము కల్గించు భయము కంటే దైవికమైన ధర్మమును ఆచరించుటలో మరణమైననూ మంచిదేయని పై శ్లోకము యొక్క భావము. ఇది ప్రథమ దైవ గ్రంథములోయుండే దేవుని ఉద్దేశ్యము. ప్రతీదీ కర్మప్రకారమే జరుగునని ముందే చెప్పియున్నాము. స్వధర్మములో మరణముగానీ, పరధర్మములో భయము గానీ, ఏ సంఘటనగానీ కర్మ నిర్ణయము ప్రకారమే జరిగియుండును. అందువలన ముందే నిర్ణయమైన వాటిని గురించి ఎంత భయపడినా, ఏమి ఆలోచించినా అవి జరుగకమానవు. కర్మలో లేని విషయములు ఏవీ జరుగవు. కర్మలోయున్నవి ఏవీ జరుగకమానవు. అటువంటప్పుడు నీవు ఇప్పుడు

చేయునది ఏమీ లేదు. నీ సంపాదన గురించి ముందే నిర్ణయము జరిగియుండును. కావున దానిని గురించి చింతించవలసిన అవసరము లేదు. ప్రపంచములో అన్నీ కర్మనుబట్టి లభించును. అయితే దైవజ్ఞానము మాత్రము కర్మనుబట్టి లభించునది కాదు. జ్ఞానము శ్రద్ధనుబట్టి లభించును. అందువలన కర్మనుబట్టి జరుగు పనులను వదలి దైవజ్ఞానము మీద శ్రద్ధను పెంచుకో, అప్పుడు దైవజ్ఞానము సులభముగా తెలియబడుతుంది.

**వారి ప్రశ్న :- మా సమాజములో దేవుడు ఒక్కడేయని కలదు. ఒక్క దేవుని మినహా ఇంకొక దేవుడు లేడని, అతనితో సమానమైన వాడు కూడా లేడని చెప్పకొన్నాము. దేవుడు ఒక్కడేయను నిర్ణయము మా నరములలో జీర్ణించిపోయినది. ఇప్పడు మీరు దేవుడు అను పదము ఒకటే అయినా ఆ పదము ద్వారా ఇద్దరు పిలువబడుచున్నారని క్రొత్తగా చెప్పారు. ఇప్పుడు ఇద్దరు దేవుళ్ళను మా మనస్సు ఒప్పకోదు. ఒకే దేవుడను నిర్ణయమే మాలో ఉన్నది. దీనికి మీరేమంటారు?**

**మా జవాబు :-** దేవుడు ఒక్కడేయని నేను కూడా అంటున్నాను. ఒక్క దేవున్నే రెండు వేరువేరు సమయములలో వేరువేరుగా చెప్పుచున్నాము. ఒకే మనిషినే పెళ్ళి చేసుకోకముందు బ్రహ్మచారి అంటున్నాము, పెళ్ళి అయిన తర్వాత సంసారి అంటున్నాము. ఇక్కడ బ్రహ్మచారి అనువాడు, సంసారి అనువాడు ఇద్దరూ ఒక్క మనిషే. అయితే ఆయా సందర్భములను బట్టి ఆయా పేర్లతో పిలుస్తున్నాము. సృష్ఠికంటే ముందు దేవుడు అను పేరు కూడా లేని స్థిరాస్థిరున్ని సృష్ఠి తర్వాత దేవుడు అని చెప్పాము. సృష్ఠి తర్వాత వున్న దేవున్ని సృష్ఠికంటే ముందు పిలిచేవారే లేనిదానివలన దేవుడు అని కూడా చెప్పలేదు, స్థిరాస్థిరుడు అని చెప్పాము. స్థిరాస్థిరుడు సృష్ఠి తర్వాత దేవుడు అని అర్థము ప్రకారము చెప్పించుకొన్నా, ఆయన ముగ్గురు

పురుషులుగా విభజింపబడినాడు. మీ మాట ప్రకారమైనా దేవుడు పని చేయనివాడు అని ఒకచోట చెప్పుచున్నాము. మరొకచోట అన్నీ దేవుడే చేస్తున్నాడు అని అంటున్నాము. అలాంటప్పుడు చేయని దేవుడు ఒకడు, చేసే దేవుడు ఒకడు ఇద్దరుగా కనిపిస్తున్నారు కదా! ఇంకా వివరముగా తెలియుటకు ఖురాన్ గ్రంథములో **(2-117) "భూమి ఆకాశములను ప్రప్రథముగా సృష్ఠించినవాడు దేవుడే. ఆయన ఏ పని చేయ సంకల్పించు కొన్నా దానిని "అయిపో" అంటే చాలు అది అయిపోతుంది"** అని గలదు. ఇక్కడ ఈ విధముగా చెప్పి అదే ఖురాన్ గ్రంథములో మరొకచోట మరొక విధముగా చెప్పుచున్నాడు చూడండి. **(50-37) "హృదయాన్ని కలిగియుండి లేదా శ్రద్ధను కలిగియుండి ఆలకించండి. సావధానముగా మసలుకొనే ప్రతి వ్యక్తికి ఇందులో హితబోధ కలదు." (50-38) "నిశ్చయముగా మేము భూమి ఆకాశములను వాటి మధ్యయున్న అన్నిటినీ ఆరు దినాలలో సృష్ఠించాము. మరి మాకు అలసట ఏమాత్రము రాలేదు"** అని కూడా కలదు. పైన చెప్పిన 2-117 వాక్యమునకు, క్రింద చెప్పిన 50-37,38 వాక్యములకు పూర్తి వ్యతిరిక్త భావమున్నది. ముందు చెప్పిన 2వ సూరా 117వ వాక్యములో **'దేవుడు పని చేయడు, ఆయన సంకల్ప మాత్రమున అన్నీ అయిపోవుచున్నవి'** అని కలదు. క్రింద చెప్పిన 50వ సూరా 38వ వాక్యములో **'ఆయన ఆరు రోజులు పని చేశాడు అయినా అలసట రాలేదు'** అని కలదు. అక్కడ 2వ సూరాలో చెప్పిన వాక్యములో **'భూమిని ఆకాశమును ప్రప్రథమముగా దేవుడే సృష్ఠించాడు'** అని వున్నది. తర్వాత చెప్పిన 50వ సూరాలో కూడా 'భూమిని ఆకాశమును దేవుడే సృష్ఠించాడు' అని వుంది. ఇక్కడ బుద్ధితో గ్రహించు వారికి ఎవరికయినా **'పని చేయని దేవుడు, పని చేసే దేవుడు'** రెండు రకముల కనిపించుచున్నాడు. అయితే ఆయన ఒకడే అనుటకు ఆధారముగా 'భూమిని ఆకాశములను

సృష్ఠించిన దేవుడు' అని చెప్పారు. సృష్ఠించినది ప్రపంచము. సృష్ఠించిన వాడు దేవుడు. ప్రపంచమును సృష్ఠించిన దేవుడు ఒక్కడే అయినా ఆయన పని చేయని వాడుగా, పనిచేసేవాడుగా రెండుగా తెలియుచున్నాడు.

**దేవుడు ఒక్కడే అయినా రెండుగా యున్నాడను విషయము యావత్ ప్రపంచమునకే తెలియకుండా పోయినది.** దైవగ్రంథము లలో వ్రాసియున్న దానిని మనిషి అర్థము చేసుకోలేని స్థితిలోయున్నాడు. ముఖ్యముగా అంతిమ దైవగ్రంథములో మనిషి తెలియుటకు ప్రత్యేకించి ఒక ఆయత్‌నే చెప్పాడు. 50-37వ ఆయత్‌యందు హెచ్చరించుచూ 50-38వ వాక్యమును చెప్పి యున్నా ఇది మా గ్రంథము అను చెప్పువారు 50-37లో యున్న వాక్యము ప్రకారము శ్రద్ధగానీ, సావధానము (జాగ్రత్త) గానీ, రెండూ లేనివాడై యుండుట వలన ఆ వాక్యములో గల హితబోధ తెలియకుండా పోయినది. దేవుడు ఒక్కడేయని చెప్పుచున్నారుగానీ, ఒక్కడుగా ఎలా ఉన్నాడని తెలియదు. ముస్లీమ్‌లకు ప్రపంచములో ఎవరికీ లేని విశ్వాసము వారికి గలదు. అందుకే వారిని ముస్లీమ్‌లని అంటున్నాము. విశ్వాసము వలన దేవుడున్నాడని, దేవుడు గొప్పవాడని చెప్పవచ్చునుగానీ, దేవుడు అనుభవరీత్యా ఎలా ఉన్నాడను జ్ఞానము తెలియదు. ముస్లీమ్‌లకు ఖురాన్ గ్రంథములో చెప్పిన పై రెండు ఆయత్‌లకు అర్థము తెలియదు. పై రెండు ఆయత్‌లలో ఒకే దేవుడు రెండు రకములని పరస్పర విరుద్ధముగా యున్నాడను విషయమును గ్రహించలేదు. కొందరికి ఈ విషయము ఆయత్‌లలో ఉన్నట్లు కనిపించినా, దానిని పట్టించుకోకుండా తమ పెద్దలు చెప్పిన దానినే ప్రచారము చేయుచున్నారు. ఈ ఆయత్‌లను చూచిన వారికి ఎవరికయినా అర్థముకాక దేవుని విషయములో రెండు రకములుగా ఉన్నదేమి అని అడిగితే, దేవుని విషయములో ప్రశ్నించకూడదు, చెప్పినది

మాత్రము వినవలెనని జవాబు చెప్పుచున్నారు. ఎందుకు ప్రశ్నించకూడదు అని అంటే పక్షి, పర్వతముల కథ చెప్పి నోరు మూపిస్తున్నారు.

ఖుర్ఆన్ గ్రంథములో ముహమ్మద్ ప్రవక్తగారు ఉన్నతమైన స్వభావము కలవాడని, అప్పటి కాలములో ఆయనను మించిన ఉత్తముడు లేని దానివలన మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ తనబోధను చెప్పుటకు ముహమ్మద్ ప్రవక్తగారిని ఎన్నుకొన్నాడు. ప్రవక్త ద్వారా తన జ్ఞానమును ప్రజలకు తెలియజేయుటకు జిబ్రయేల్ నిర్ణయించుకొన్నాడు. అట్లు ప్రవక్తగా మారిన తర్వాత ముహమ్మద్ ప్రవక్తగారు తనకు తెలిసిన జ్ఞానమును విడమరచి తనతోటి వారికి చెప్పేవాడు. తనయొద్దయున్న దైవ సందేశమును తెచ్చి ఏమాత్రము దాచుకోకుండా ఉన్నదంతా అయిపోవువరకు చెప్పెడివాడు. ప్రవక్తగారు ఏమాత్రము దాపరికములేని మనిషి అయినందున తన సందేశమును మిగుల్చుకోకుండా చెప్పెడివాడు. తనయొద్ద చెప్పవలసిన సందేశమును పూర్తి లేకుండా చెప్పెడివాడు కనుక ప్రవక్తగారిని సందేశ హరుడు అన్నారు. సందేశము అనగా చెప్పవలసిన సమాచారము. హరుడు అనగా లేకుండా చేయువాడు, హరించువాడు అని అర్థము. తనవద్ద సమాచారము మిగలకుండా చెప్పెడివాడు అయినందున ముహమ్మద్ ప్రవక్త గారిని సందేశహరుడు అని అన్నారు. ఖుర్ఆన్ గ్రంథములో చాలాచోట్ల ప్రవక్త అని చెప్పుచోట 'సందేశహరుడు' అని వ్రాసియున్నారు.

ఒక విషయమును సంశయరహితముగా తెలియవలెనంటే ఎదుటి మనిషి తన సందేశమును పూర్తిగా చెప్పాలి. ముహమ్మద్ ప్రవక్తగారు సంశయరహితముగా జ్ఞానము చెప్పువాడయిన దానివలన, ఏమాత్రము దాచిపెట్టుకోకుండా మిగలపెట్టుకోకుండా చెప్పుట వలన, ఆయనను సందేశ హరుడు అని అనడము జరిగినది. అటువంటప్పుడు ఆయన ప్రశ్నించ

వద్దండని చెప్పియుండునా? ప్రవక్తగారు సంశయరహితముగా జ్ఞానమును విడదీసి చెప్పియుండును. అయితే మధ్యలో వచ్చినవారు ప్రవక్త జ్ఞానమును తెలియనివారైయుండి, చెప్పుటకు చేతకాక, ప్రశ్నించకూడదని నియమము నుంచి ఎదుటివారి నోరును తెరువకుండా చేయుచున్నారు. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో 2-117లో 'చెప్పిన పని చేయని దేవుడు', 50-38లో 'చెప్పిన పనిచేసే దేవుడు' అని రెండు రకములుగా యున్న దేవున్ని విడదీసి చెప్పే బాధ్యత ముఖ్యముగా ముస్లీమ్‌లకేయున్నా, వారు దీనికి సమాధానము చెప్పకుండా, ప్రశ్నించకూడదని చెప్పి తప్పించు కుంటున్నారు. ఇతరులకు చెప్పకపోయినా కనీసము వారికయినా తెలిసిందా! అని చూస్తే వారు ఖురాన్ గ్రంథమును తెలుసుకోవాలనుకోలేదు. ఇటువంటి కష్టతరమైన సమాచారము వచ్చినప్పుడు అవి ముతషాబిహాత్ వాక్యములని వాటిని దేవుడే వదలివేయమని చెప్పాడని చెప్పి వాటిని గురించి తెలియుటకు కూడా ప్రయత్నించలేదు.

దైవగ్రంథములో యున్నదంతా దైవజ్ఞానమే అయినప్పుడు గ్రంథములో సూక్ష్మజ్ఞానముతో కూడుకొన్న అరవైశాతము (60%) దైవవాక్యములను ఎందుకు వదలి వేయుచున్నారు? అని ప్రశ్న రాక తప్పదు. అలా వచ్చిన ప్రశ్నను కూడా అడుగరాదని నియమమును ఉంచుకొన్న వారిని వదలివేయాలి తప్ప ప్రశ్నించుట వ్యర్థము. దేవుడు సర్వమును సృష్టించిన సృష్టికర్తయని ముస్లీమ్‌లు ఒప్పుకుంటారు. అట్లే మిగతా మతములవారు ఒప్పుకుంటున్నారు. అందరికీ దేవుడు ఒక్కడేయని అన్ని మతములవారు పైకి చెప్పినా, లోపల వారి భావములో మా దేవుడువేరను భావముతోనే యున్నారు. తమ మతమువారు ఇతర మతముల వారితో స్నేహముగా యుంటే, మతసామరస్యముగా కలిసిమెలసియుంటే, అటువంటి

వానిని వారి మతపెద్దలు దండించి, మత విషయములలో దూరంగా ఉండమని వారి దేవుడువేరు, మన దేవుడు వేరని చెప్పుచుందురు. మనుషుల భావములు వేరయినా మనుషులను పుట్టించిన వాడు ఒక్కడేయను భావమును మనుషులందరూ మరచిపోయారు.

మూడు దైవగ్రంథములకు గ్రంథకర్త దేవుడు ఒక్కడే. మూడు దైవ గ్రంథములను వేరువేరు మనుషులు తయారు చేశారు. గ్రంథములను మనుషులు చేసినా గ్రంథములలోని జ్ఞానమును దేవుడు చెప్పాడు. దేవుడు తన జ్ఞానమును మూడు విధములుగా అనగా మూడు పద్ధతుల ద్వారా బోధించాడు. అందువలన గ్రంథములోని జ్ఞానమునకు దేవుడేకర్తగా యున్నాడు. దీనినిబట్టి గ్రంథములకు నిజమైన గ్రంథకర్తగా దేవున్నే చెప్పాలి. మనుషులు ఒకే దేవుడు చెప్పిన జ్ఞానమును మూడు మతములుగా చీల్చుకొన్నారు. చీల్చుకొన్న జ్ఞానమును నాది నీదియని చెప్పుచూ, మూడు మతములుగా ప్రకటించుకొన్నాడు. ఒకే తండ్రికి పుట్టినవారు వారు పుట్టిన జాగానుబట్టి వేరు కులములుగా చెప్పుకొన్నట్లు, ఒకే దేవుని బిడ్డలయిన మనుషులు వేరువేరు మతములుగా చెప్పుకొంటున్నారు. ఖురాన్ గ్రంథములో సూరా 6, ఆయత్ 91లో **(6-91) "తౌరాత్ గ్రంథమును దేవుడు అవతరింపజేశాడు. ఆ గ్రంథము ఒక జ్యోతి. మానవుల కొరకు మార్గదర్శకత్వము. మీరు దానిని వేరువేరు కాగితములుగా (వేరువేరు గ్రంథములుగా) విభజించి చూపుతున్నారు"** అని చెప్పారు. నేడు మనుషులు దేవుడు చెప్పిన గ్రంథమును అనగా భగవద్గీతా జ్ఞానమును, విభజించుకొని మూడు మతములుగా చెప్పుచున్నారు. మనుషులు ఎలా చెప్పుకొనినా ఫరవాలేదు. అయితే అందులోని జ్ఞానమును దాచి పెట్టుచున్నారు.

మనుషులు దేవుని జ్ఞానమును మూసిపెట్టినా, దాచిపెట్టినా చివరికది బయటికి రాగలదు. దైవ గ్రంథములలో మొదటి జ్ఞానము అనగా మాతృ జ్ఞానము మూడు ఆత్మలను గురించి చెప్పినదే. అది ఇతర దేశములలో తౌరాత్ అని పిలువబడగా, భారతదేశములో భగవద్గీతయని చెప్పబడుచున్నది. భగవద్గీతా జ్ఞానమే మిగతా రెండు గ్రంథములయందు గలదు. మొత్తము మీద మూడు గ్రంథములలో దేవుడు 'అవ్యయుడు' అని కలదు. అవ్యయుడు అనగా నాశనము లేనివాడని అర్థము. దేవుడు నాశనము లేనివాడని, అక్షరుడని, అవినాశుడని ఎన్నో సందర్భములలో ఆయా గ్రంథముల నుండి చెప్పడము జరిగినది. ఏ గ్రంథములో చెప్పినా దేవుని స్థానము ఒక్కటే. భగవద్గీతలో దేవున్ని 'అవ్యయుడని' చెప్పారు అంతేకాదు 'అజోపి' అని పుట్టుకలేనివాడని చెప్పడమైనది. పుట్టుక నాశనము లేనివాడు ఒకేఒకడు గలడు, అతడే దేవుడు. నాశనముగానీ, పుట్టుకగానీ లేని దేవున్ని పరమాత్మయని, పురుషోత్తముడని చెప్పడమైనది. మూడు గ్రంథములలోనూ ఒకే విధానమును చెప్పినా దానిని చాలామంది గుర్తించ లేకపోయారు. భగవద్గీతలో జ్ఞానయోగములో దేవుడు **'అవ్యయుడు'** అని చెప్పాడు. అదే గ్రంథమునందు పురుషోత్తమ ప్రాప్తియోగమను అధ్యాయమున 16వ శ్లోకమందు మరియు 17వ శ్లోకమందు ముగ్గురు పురుషులుగా ఒకే దేవున్ని వివరించి చెప్పవలసి వచ్చినది. మొదట పురుషుడు దేవుడు అని అందరూ చెప్పుచున్నారు. రెండవ పురుషుడు అక్షరుడైనప్పుడు 'నాశనము లేని వాడు దేవుడు' అను సూత్రము ప్రకారము రెండవ ఆత్మను కూడా దేవుడే అనాలి. మనకు ఈ విషయము తెలిసినా, తెలియకపోయినా మనమందరము రెండవ పురుషున్ని దేవునిగానే పిలుస్తున్నాము. రెండవ పురుషుడు చేసిన పనినంతా దేవుడు చేసినట్లుగానే చెప్పుచున్నాము. దేవుడు

ఒక్కడేయని అందరూ అంటున్నా, తెలిసినవారు చెప్పే దానినిబట్టి తెలియని వారు కూడా దేవుడు ఒక్కడేయని అనుచున్నా, అందరికీ తెలియకుండా శాస్త్రము ప్రకారము, దైవగ్రంథముల ప్రకారము ఇద్దరు దేవుళ్ళున్నారు. అట్లు కాకపోయినా దేవుడే ఇద్దరిగా ఉన్నాడు. ఇది ఎవరికీ తెలియని సత్యము. అందువలన మనుషులలో కొందరు వివరము తెలిసి ఒకే దేవుడు ఇద్దరుగా ఉన్నాడని ఒప్పుకోవచ్చును. కొందరు దైవగ్రంథము ప్రకారము జ్ఞానమును గ్రహించనివారై అదెలా సాధ్యము, దీనిని మేము ఒప్పుకొనము. మా లెక్కలో దేవుడు ఒక్కడేయని అనుచుందురు. దేవుడు చెప్పిన జ్ఞానమును విశదీకరించి తెలుసుకొనుటకు చేతకాని వారు తాము గురువులని నమ్మిన వ్యక్తులు చెప్పిన మాటనే నమ్ముచుందురు. భూమిమీద ఎందరో వినేవారుండగా, కొందరే చెప్పేవారుగా గురువులుగా చెలామణి అగుచున్నారు.

గురువులుగా పేరుపెట్టుకొని కొందరు కొన్ని మతములలో జ్ఞానమును చెప్పుచుండగా, కొన్ని మతములలో మతపెద్దలే జ్ఞానమును నిర్ణయించి చెప్పు బోధకులుగా యున్నారు. కొన్ని మతములందు సాంప్రదాయ గురువులుకాక, మతపెద్దలుకాక, మతములో బోధకునిగా తర్ఫీదుపొంది యోగ్యతాపత్రమును పొందిన బోధకులు గురువులుగా యున్నారు. మూడు మతములలోనూ దేవుని జ్ఞానమును బోధించువారు పది శాతముండగా, వారు చెప్పిన దానిని విని దానినే నిజమని నమ్మి నడుచుకొనువారు దాదాపు ఎనభై శాతముగలరు. మిగతా ఐదు లేక పది శాతము మంది ఏ జ్ఞానము తెలియనివారై, దేవుడు అను వారిని తెలివి తక్కువవారిగా లెక్కించి చూస్తున్నారు. ఎక్కువ శాతము మనుషులు చెప్పిన దానిని విని సత్యమును అసత్యముగా, అసత్యమును సత్యముగా లెక్కించు

చున్నారు. అందువలన బోధకుల వలన చాలామంది నేడు అజ్ఞానములో వుండి నిజమైన జ్ఞానములో ఉన్నామని కల కంటున్నారు. అటువంటి వారు స్వయముగా దైవగ్రంథములలోని విషయమును గ్రహించలేరు. ఒకవేళ మాలాంటివారు సత్యమును చెప్పినా, వారు ముందు వినిన దానినే సమర్థించు చుందురు. క్రొత్తగా తెలిసినది సత్యమైన జ్ఞానమయినా వారు దానిని విశ్వసించక, తాము తమ బోధకుల లేక తమ మతపెద్దలు చెప్పిన మాటలనే గొప్పగా చెప్పుకొనుచుందురు.

అటువంటి వారు తాము తమ జ్ఞానమునే గొప్పగా చెప్పుకొనుచూ, తమకు ముందు తెలిసినదే సత్యమని మొండిగా వాదించుచుందురు. 'దేవుడు ఒక్కడే సృష్టికర్త'యని వారు సత్యమునే చెప్పుచుందురుగానీ, ఆయన ఎలా సృష్టికర్త అయినాడను జ్ఞాన వివరమును మాత్రము తెలియకుందురు. జ్ఞానములో సూక్ష్మ జ్ఞానమును తెలియుటకు కావలసిన శ్రద్ధ వారిలో లేకపోవడము వలన వారికి జ్ఞానము సంపూర్ణముగా తెలియదు. వారు అసంపూర్ణ జ్ఞానులుగానే యుందురు. అందువలన వారికి దేవుడు 'స్థిరుడు' మరియు **'అస్థిరుడని'** తెలియదు. అలాగే దేవుడు **'ఏకస్వరూపుడే'** అయినా అనేకముగా ఉన్నాడని తెలియదు. అట్లే దేవుడు **'నిరాకారుడు'** మరియు **'సాకారుడు'** అని తెలియదు. దేవుడు కొన్నిచోట్ల స్థిరుడు మరికొన్నిచోట్ల అస్థిరుడు అనియూ, అలాగే దేవుడు కొన్నిచోట్ల ఏకస్వరూపుడు, కొన్నిచోట్ల అనేక స్వరూపుడు అనియూ, అట్లే దేవుడు కొన్నిచోట్ల నిరాకారుడు మరికొన్నిచోట్ల సాకారుడు అను సత్యమును గ్రహించలేకయున్నారు. దేవుడు ఏదీకానివాడు అనినప్పుడు అలాగే ఏదీ కాకుండావుండును. దేవుడు స్థిరుడు అని అంటే దేవున్ని ఇది అని నిర్ణయము చేసినట్లగును. అందువలన స్థిరుడు కాదు అని చెప్పవలసి వచ్చినది. స్థిరుడు కానప్పుడు దానికి

వ్యతిరేఖమయిన అస్థిరుడు అని చెప్పవచ్చును. అలా అస్థిరుడే అని చెప్పినా దేవుడు ఫలానావాడని తేల్చి చెప్పినట్లగును. అట్లు కూడా చెప్పకూడదు. అందువలన స్థిరుడు, అస్థిరుడు అని రెండూ చెప్పితే ఎటూ తేల్చుకోలేక దేవుడు ఏదీకాదను వాదనలోనికి వస్తారు. అందువలన **"స్థిరాస్థిరుడు"** అనియూ, **"ఏకానేక"** అనీ, **'సాకార నిరాకార'** యనీ ప్రతిచోట రెండు రకముల చెప్పవలసివచ్చినది.

మనము దేవున్ని రెండు రకముల చెప్పడమేకాక ఆయన నిజముగా అలాగే యున్నాడు. సర్వమును సృష్ఠించిన సృష్ఠికర్త దేవుడు నాశనము కానివాడు అని ఎవరయినా అంటే ఆ మాట కూడా సత్యముకాదు అన్నట్లు రెండవ పురుషున్ని అక్షర పురుషుడు అని అన్నాడు. మొదటి పురుషుడయిన దేవుడు అక్షరుడు అని చెప్పితే, అట్లుకాదని రెండవ పురుషుడు కూడా అక్షరుడేయని భగవద్గీతలో చెప్పడమైనది. ఈ విధముగా దేవుడు **'సత్యా సత్యుడు', 'నిత్యానిత్యుడు', 'క్షరాక్షరుడు', 'ఆకారనిర్వికారుడు', 'స్థిరాస్థిరుడు', 'వ్యక్తావ్యక్తుడు', 'వ్యయావ్యయుడు'** అని ద్వంద్వముగా చెప్పబడుచున్నాడు. ద్వంద్వముగా చెప్పుట వలన దేవుడు ఫలానావాడేనని మనిషి నిర్ణయించు టకు వీలులేదు. మనిషి దేవున్ని ఎలా భావించుకొనినా, ఆ భావమునకు దేవుడు అన్యముగా ఉన్నాడు. అందువలన దేవున్ని 'భావోన్య' అని చెప్పుచున్నాము. భావమునకు అన్యముగా ఉన్నవాడని **'భావోన్య'** అని అన్నారు.

**వారి ప్రశ్న :- ముస్లీమ్ సమాజములో దేవుడు ఒక్కడేయని చెప్పబడుచున్నది. దేవునికి సమానముగా ఎవరినీ చూడకూడదని, దేవుని మినహా ఎవరినీ ఆరాధించకూడదనీ, దేవునికి భాగస్వామ్యులుగా ఎవరినీ చూడకూడదని, ఒకే దేవున్ని తప్ప రెండవ వానిని ఊహలో కూడా పోల్చుకోకూడదని, దేవున్ని కాదని**

**ఇతరులను పూజించువారిని కాఫీర్లని, దేవునికి వ్యతిరేఖులని, అజ్ఞానులని చెప్పడము జరుగుచున్నది. వారి నమ్మకము ప్రకారము వారి వాదన సత్యమే కదా!**

**మా జవాబు :–** వారి వాదన సత్యమే! దేవుడు ఒక్కడే ఆరాధ్యుడు ఇతరులను పూజించకూడదు, ఆరాధించకూడదు అనుమాట కూడా వాస్తవ జ్ఞానమునకు సంబంధించినదే. దేవుడు ఎక్కడ చెప్పినా తన జ్ఞానమునే ప్రజలకు బోధించును. భగవద్గీతలో చెప్పిన జ్ఞానమే మిగతా గ్రంథములలో గలదు. అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో **'దేవున్ని ఒక్కన్నే ఆరాధించమని'** అనేక వాక్యములు కలవు. అలాగే భగవద్గీతలో "**మన్మనా భవ మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు**" అని కూడా చెప్పియున్నాడు. దాని భావము **"నీవు నాకే భక్తునిగా ఉండుము, నీవు నన్నే నమస్కరించుము"** అని కలదు. భగవద్గీతలో చెప్పినదే ఖురాన్‌లో చెప్పారు. ఖురాన్‌లో ఉన్నదే భగవద్గీతలో కలదు. అయితే ఆ ఒక్క విషయమే అయితే దేవుడు అంతపెద్ద గ్రంథములను చెప్పవలసిన పనిలేదు. రెండుమాటలలో దేవుడు ఒక్కడే, ఆయననే ఆరాధించుము అని చెప్పవచ్చును. ఈ రెండు మాటలేకాక ఎన్నో మాటలతో, ఎంతో జ్ఞానముతో గ్రంథములను చెప్పడమైనది. అవన్నీ తెలిస్తే దేవుడు ఒక్కడే ఎలా ఉన్నాడని తెలియగలదు.

ఇక్కడ విషయము బాగా అర్థమగుటకు చిన్న ఉదాహరణను చెప్పు కొందాము. ఒక యజమాని తనదగ్గర పనిచేయు నలుగురు గుమస్తాలకు ఒక్కొక్కనికి వేయిరూపాయలు డబ్బులిచ్చి నలుగురు బజారుకుపోయి సరుకులను తెమ్మని చెప్పాడు. అందరికీ ఒకే సరుకుల పట్టీ ఇచ్చి పంపాడు. నలుగురు గుమస్తాలు బజారుకుపోయి యజమాని ఇచ్చిన పట్టీ ప్రకారము సరుకులను తెచ్చారు. యజమాని వేయిరూపాయలు డబ్బు ఇచ్చినప్పుడే

చీటిలోవున్న సరుకులకు వేయిరూపాయలు ఖర్చవుతాయి. మీరు పోయి సరుకులను తెమ్మని నలుగురుని విడివిడిగా చెప్పి పంపాడు. యజమాని చెప్పినట్లే నలుగురు బజారుకు పోయి విడివిడిగానే సరుకులను తెచ్చారు. వెయ్యి రూపాయల సరుకులు తెమ్మని వెయ్యి రూపాయలకు సరిపడు సరుకుల పట్టీని యజమాని ఇచ్చి పంపాడు. నలుగురు సరుకులు తెచ్చారు. అయితే ఒకనికి పట్టీలోని సరుకుల ఖర్చు 900 రూపాయలు అయినది. రెండవ వానికి 800 రూపాయలయినది. మూడవ వానికి 750 రూపాయలు కాగా, నాల్గవ వానికి 700 రూపాయలే అయినది. వారు తెచ్చిన సరుకులకు ఎవరికి ఎంత ఖర్చయినది వారికి తెలుసు. అయినా వారు యజమాని పట్టీలో సరుకులకు వెయ్యిరూపాయలు ఖర్చయితాయని, ముందే చెప్పి పంపుట వలన నా సరుకులకు వెయ్యి రూపాలయలయినవని మొదటివాడు చెప్పగా, మిగతా వారు కూడా అలాగే చెప్పారు.

మొదటి గుమస్తా 900 రూ॥ సరుకులనే కొన్నాడు. వానిదగ్గర వంద రూపాయలు మిగిలినవి. అయినా తను నిజాయితీతో పని చేసినట్లు తాను వెయ్యిరూపాయల సరుకు తెచ్చానని చెప్పాడు. తనదగ్గర డబ్బులు అన్నీ ఖర్చు కాలేదని వందరూపాయలు మిగిలినాయని అతనికి తెలుసు. అయితే తాను నిజాయితీ గలవాడినని ఇతరులు తెలియునట్లు, వారిని నమ్మించుటకు తాను సక్రమముగా లేనని తెలిసి కూడా నేను సక్రమముగా ఉన్నానని, తనవద్దయున్న వెయ్యిరూపాయల డబ్బుకు సరుకులు తెచ్చానని అబద్ధము చెప్పాడు. మొదటివాడు ఏ ఉద్దేశ్యముతో ఎలా చెప్పాడో, అలాగే రెండవ వాడు చెప్పాడు. తాము సరియైన గుమస్తాలమని నమ్మించుటకు మేము చెప్పిన పనిని సక్రమముగా చేశామని నలుగురు చెప్పారు. ఎవరివద్ద ఎంత డబ్బులు మిగిలాయి అను విషయము వారికి తెలుసు. అయినా

నేనే కొంత సక్రమముగా ఉన్నాను, నాకంటే మిగతా ముగ్గురు నావలె కూడా లేరు, వారు ఇంకా అక్రమాలకు పాల్పడియుందురని ఒకడు అనుకోగా, మిగతావారు కూడా అలాగే అనుకోవడము జరిగినది. నలుగురు యజమాని వద్దకు పోయి నీవు చెప్పిన పనిని సక్రమముగా చేశామని చెప్పారు.

నలుగురు గుమస్తాలు చెప్పిన మాటలను వినిన యజమాని వారు చెప్పినదంతా విన్నాడు. మీరంతా సక్రమముగా పని చేశారని వారిని నలుగురిని పొగిడి పంపాడు. యజమానిని నమ్మించినందుకు ఆ నలుగురు గుమస్తాలు సంతోషపడిపోయారు. వారు చేసిన పని సక్రమమయినదా, అక్రమమయినదాయని యజమానికి తెలుసు. అయినా వారు చెప్పిన దంతా విని తనకు ఏమీ తెలియనట్లు అందరినీ పొగిడి పంపాడు. యజమానికి తన నలుగురు గుమస్తాలు ఎవరెవరు ఎంతెంత మోసము చేసినది బాగా తెలుసు. అయినా తెలియనట్లే ఉండి యజమాని ఎవరినీ దండించ లేదు. దానితో నలుగురు గుమస్తాలు తాము సక్రమమైనవారమే అన్నట్లు ధీమాగాయుండిరి. బజారులోయున్న అంగళ్ళన్నీ యజమానివేయని నలుగురు గుమస్తాలకు తెలియదు. నలుగురు ఎంతెంత సరుకులు కొన్నది, ఎంతెంత మిగిలించుకొన్నది అన్నీ యజమానికి గుమస్తాలు ఇంటికి రాకముందే తెలుసు. అయినా ఆయన మౌనముగా ఉండుట వలన యజమాని తమను సక్రమమైనవారిగా నమ్మాడని వారు నలుగురు అనుకోవడము జరిగినది.

ఆరు నెలలు గడచిన తర్వాత 'నెలకు 50 వేల రూపాయల ఆదాయము' అను ఒక పేపరు ప్రకటన వచ్చినది. ఆ ప్రకటనను చూచిన నలుగురు గుమస్తాలు నెలకు ఐదువేలు జీతమిచ్చు యజమానిని వదలి

50 వేలు లాభమొచ్చు పనిలో చేరిపోయారు. వారు చేరినది చిట్‌ఫండ్ కంపెనీ అయినందున ఒక ఆరు నెలలు అందులో పని చేసిన తర్వాత ఆ కంపెనీ బోర్డు తిప్పేసి పారిపోయింది. అప్పుడు నలుగురు బజారున పడ్డారు. చివరికి చూచుకొంటే గతములో తాము మోసము చేసిన యజమాని ఏమీ అనకపోయినా, ప్రస్తుతము తాము పని చేయుచున్న కంపెనీనే తమకు ఆశచూపి మోసము చేసింది. చివరికి జరిగినది చూస్తే పేపరు ప్రకటనతో వారు మొదటి యజమానిని వదలునట్లు దేవుడే చేశాడు. మొదటి యజమాని అప్పుడప్పుడు ఒకమాట చెప్పుచుండెడివాడు. **"నన్ను మోసము చేయువాడు ఎవడయినా వానికి వాడు మోసపోవును"** అని చెప్పెడి వాడు. అలాగే యజమానికి అన్నీ తెలిసినా, యజమాని వారి మోసమును గురించి బయటికి చెప్పలేదు. మోసము చేయువాడు కన్నకొడుకైనా తనకు దూరముగా పోవుట జరుగునని ఆయనకు ముందే తెలుసు. ఇంతవరకు గుమస్తాలకు జరిగిన విషయమును విశ్లేషించి చూచితే, దేవుని మార్గములో అటువంటివారు కలరని తెలియుచున్నది.

యజమానిని దేవునిగా, యజమాని క్రింద పనిచేయు నలుగురు గుమస్తాలను నాలుగు మతముల వారిగా పోల్చుకొని చూస్తే, మనుషులకు దేవుడు సమానముగా జ్ఞానమును ఇచ్చినట్లు యజమాని నలుగురు గుమస్తాలకు సమానముగా డబ్బులిచ్చాడనుకొనుము. దేవుడిచ్చిన జ్ఞానమును మనుషులు పూర్తిగా తమ తలలోనికి ఎక్కించుకోలేదు. అలాగే యజమాని ఇచ్చిన డబ్బును గుమస్తాలు మిగలకుండా పూర్తిగా ఖర్చు పెట్టలేదు. దేవుని జ్ఞానము తలకు ఎక్కకుండా కొంత బయట మిగిలిపోయినట్లు, యజమాని ఇచ్చిన ధనము పూర్తి వినియోగించబడక బయట కొంత మిగిలిపోయినది. మతముల వారికి దేవుని జ్ఞానము పూర్తి

అర్థము కాకుండా మిగిలి పోయినా, ఆ విషయము ఎవరికీ తెలియనట్లు దేవుడు చెప్పిన జ్ఞానమంతా మాకు బాగా అర్థమయి, మా తలకెక్కినది అని అన్నట్లు, బయటి గుమస్తాలు కూడా యజమాని ఇచ్చిన డబ్బంతా పూర్తి సరుకులకు అయిపోయినది నా వద్ద మిగలలేదు అని బొంకుచుందురు. దేవుడిచ్చిన జ్ఞానము ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క విధముగా అర్థమయినట్లు, నలుగురు గుమస్తాలు యజమాని డబ్బును ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా ఖర్చు చేశారు. ఎవరూ పూర్తి ఖర్చు చేయనట్లు అన్ని మతములవారు దేవుని జ్ఞానమును ఎవరూ పూర్తిగా అర్థము చేసుకోలేదు. దేవునికి మనుషులు చేయు అజ్ఞానము అర్థమయినా, దేవుడు ఏ మతము వారిని ప్రత్యక్షముగా ఏమీ అననట్లు తన గుమస్తాల అవినీతి అర్థమయినా, యజమాని వారిని ఏమీ దండించ లేదు. అజ్ఞానమును అనుసరించు వారికి దేవుడు అదే దారిలో పోవునట్లు, వారి పనులు ఆటంకము లేకుండా సాగిపోవునట్లు చేయుచున్నాడు. అదే విధముగా అవినీతికి పాల్పడిన తన గుమస్తాలు అదే మార్గములో పోవునట్లు, యజమాని వారిని పొగిడి చాలా బాగా పని చేశారని చెప్పాడు. ప్రతి మతము వారు తామే నిజమైన జ్ఞానులము అనుకొన్నట్లు, గుమస్తాలందరూ ఎవరికి వారు తామే నిజమైన నిజాయితీగలవారమని అనుకొన్నారు. **దేవుడు తనకిష్టములేని వారిని అపమార్గములోనికి పంపును, తనకిష్టమైనవారిని దైవమార్గములోనికి పంపును.** అదే విధముగా యజమానికి మోసగాళ్ళు అని తెలిసిన తర్వాత వారు ఇష్టము లేనివారైనందున తనను వదలి వారే పోవునట్లు యజమానిని వదలి గుమస్తాలే తమకు తాముగా పోయారు. **"దేవుడు అన్నిటికీ అధిపతి, సమస్తము ఆయన ఆధీనములో ఉన్నాయి"** అన్నట్లు యజమాని బజారులోని షాపులకు కూడ యజమానిగా ఉన్నాడు. అజ్ఞానులకు దేవుడు ఎంత గొప్పవాడు అని తెలియనట్లు, గుమస్తాలకు యజమాని బజారులోని

షాపులకు కూడా యజమానే అను విషయము తెలియదు. గుమస్తాలు తాము అవినీతిగలవారైనా మేమే అందరికంటే నీతిగలవారమని ఎవరికి వారు అనుకొన్నట్లు, నేడు ప్రతి మతము వారు తమకు తాము అందరికంటే జ్ఞానములో అధికులము అని అనుకొంటున్నారు. నూరు రూపాయల అవినీతివరుడు, రెండు వందల అవినీతి వరుడు, మూడు వందల అవినీతిగలవాడు అందరూ మేము ఇతరులకంటే సక్రమమైన వారమే అని అనుకొన్నట్లు, తమయందు కొంత జ్ఞాన లోపమున్న వారు, ఎక్కువ జ్ఞాన లోపమున్నవారు, ఇంకా ఎక్కువ అజ్ఞానమున్నవారు తామే స్వచ్ఛమయిన జ్ఞానులమను భ్రమలోయున్నారు. నేడు మూడు మతములలో అజ్ఞానము చోటు చేసుకొన్నదని దేవునికి బాగా తెలుసు.

మనుషులలో, మతములలో ఎవరివద్ద ఎంత జ్ఞానమున్నదీ దేవునికి తెలిసియుండుట వలన, ఆయన మౌనముగాయుండి అటువంటి వారిని దేవుని జ్ఞానమునకు దూరము చేయును. దేవుని ఇచ్ఛతో పనిచేయు మాయ మనుషులను ఆవహించి, ఏదో ఒక సాకుతో ఆ మనుషులను దేవుని నుండి, దేవుని జ్ఞానమునుండి దూరము చేయును. గుమస్తాలు డబ్బు ఆశతో తమ యజమానిని వారే వదలిపోవునట్లు, అజ్ఞానులయిన వారు విషయాపేక్షతో దేవుని జ్ఞానమునకు దూరముగా పోవుచుందురు. ఒక నీతివంతుడు మరియొక అవినీతివంతుని మీద వేలుఎత్తి చూపవచ్చును. ఒక అవినీతివంతుడు మరియొక అవినీతివంతుని వేలుఎత్తి చూపలేడు కదా! అట్లు చూపినా అది అసూయతో తప్ప వేరు కాదని మిగతావారికి అర్థమగును. మంచివాడు దొంగవానిని దొంగ అనినా అందులో పద్ధతి యుంది. అలా కాకుండా తాను గజదొంగయై ఇతరులను దొంగలని అనడము పద్ధతి కాదు కదా! దానిని వినిన వారు ఎవరయినా అసూయతో

మాట్లాడు మాటయని అందురుగానీ, అది సరియైన ఆరోపణ కాదు అని అనగలము. అదే విధముగా ఒక జ్ఞాని అజ్ఞానిని చూచి నీవు అజ్ఞానివి అనినా సరిపోతుంది, అతడు అన్నది సత్యమే. అలా కాకుండా ఒక అజ్ఞాని మరొకనిని అజ్ఞాని అనడము హాస్యాస్పదముగా ఉంటుంది. నేడు దేవుడు ఒక్కడేయని చెప్పువారు విగ్రహారాధకులను అజ్ఞానులని విమర్శించుచున్నారు. విగ్రహారాధకులు అజ్ఞానులనుమాట భగవద్గీతలో కూడా వుంది. దైవజ్ఞానము తెలిసినవారు ఎవరైనా ఇతర దేవతలను పూజించువారిని అజ్ఞానులని అనవచ్చును. అయితే మొదటికి తాను జ్ఞాని కాకుండా ఇతరులను అజ్ఞానులనడము పద్ధతికాదు. దానిని దేవుడు కూడా ఒప్పుకోడు. ధనమున్నవాడు ధనము లేనివానిని పేదవాడు అని అనవచ్చును. ధనము లేనివాడు ఇతరులను పేదవారు అంటే మధ్యలోయున్నవారు నీవద్ద ధనమెంతయుంది? నీవు ధనికునివా? అని ప్రశ్నించగలరు. అందువలన ఏ మాట మాట్లాడినా అది అర్థసహితముగా ఉండవలెనుగానీ, అర్థ రహితముగా ఉండకూడదు.

ధనికుడు అని పేరున్నప్పుడు వానివద్ద ధనముండాలి. ధనము లేకుండా నేను ధనికున్ని అని అంటే వానిని ఎవరూ ఒప్పుకోరు. ధనము విలువ తెలిసినవాడు ధనికుడు అనుటకు వీలులేదు. ధనమున్నప్పుడే వానిని ధనికుడు అని అనవచ్చును. సినిమా టికెట్ విలువ తెలిసినంత మాత్రమున సినిమాను చూచుటకు కుదరదు. సినిమా టికెట్ యున్నప్పుడే సినిమాహాలులోనికి పోయి సినిమా చూడవచ్చును. అలాగే M.L.A టికెట్ విలువ తెలిసినంతమాత్రమున అతడు M.L.A గా పోటీ చేయుటకు కుదరదు. M.L.A గా పోటీచేయుటకు పార్టీ నాయకుని వద్దనుండి టికెట్ పొందియుండాలి. అలాగే దేవుడు గొప్పవాడు అని, దేవుడు

ఒక్కడేయని తెలిసినంతమాత్రమున జ్ఞాని కాలేడు, మోక్షము పొందలేడు. సినిమా టికెట్ లేనిది సినిమాహాలు గేటులో ప్రవేశము లేనట్లు, జ్ఞానము అను టికెట్ లేనప్పుడు మోక్షము అను గేటులోనికి ఎవరూ ప్రవేశించలేరు.

సర్వప్రపంచమునకు దేవుడు ఒక్కడే. అయితే ఆ విషయమును చెప్పుటకు పెద్ద జ్ఞానము అసవరములేదు. ఒక మతములో పుట్టిన చిన్న పిల్లవాడు కూడా వారి మతస్థులందరూ చెప్పు మాటనే చెప్పును. ముస్లీమ్ మతములో పుట్టిన ఎనిమిది సంవత్సరముల చిన్నపిల్లవాడు కూడా దేవుడు ఒక్కడేయని, మేము వేరే దేవతలను మ్రొక్కము అని చెప్పగలడు. అది వారి మతముతో వచ్చినమాటగానీ, వాస్తవముగా ఆ పిల్లవానికి దేవునికి సంబంధించిన జ్ఞానముగానీ, విగ్రహములయిన ఇతర దేవతలకు సంబంధించిన అజ్ఞానము గానీ తెలియదు. దేవుడు ఒక్కడేయని చెప్పుమాట చాలా సులభము. ఆ మాట ఎవరయినా, ఎప్పుడయినా చెప్పగలరు. అయితే దేవుని జ్ఞానము సముద్రములాంటిది, అపారమైనది. అందువలన దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలియుట చాలా కష్టము. ఎవరయినా కష్టపడి దేవుని జ్ఞానము తెలిసినప్పుడు, దేవుడు ఎలా గొప్పవాడో, దేవుడు ఎలా ఒక్కనిగా ఉన్నాడో, దేవుడు ఎలా విగ్రహముకాదో తెలియును. అప్పుడు దేవతారాధకులను, విగ్రహారాధకులనూ అజ్ఞానులు అని అనవచ్చును. తనవద్ద జ్ఞానమున్నదని నిరూపించుకొని మోక్షమును పొందవచ్చును.

అట్లు కాకుండా ఒక మనిషి విగ్రహారాధనకు దూరముగాయున్న ఒక మతములో పుట్టినంతమాత్రమున వానికి దేవుని జ్ఞానము తెలియనిదే వాడు జ్ఞాని కాలేడు, దేవునికి దగ్గర కాలేడు. అందువలన విగ్రహారాధనకు దూరముగాయున్న మతములో పుట్టిన వారందరూ జ్ఞానులూ కారు. విగ్రహారాధన చేయు మతములో పుట్టిన వారందరూ అజ్ఞానులూ కారు.

హిందువులు ఎక్కువగా విగ్రహారాధన చేయువారు గలరు. అంతమాత్రమున ఆ మతములోని అందరినీ అజ్ఞానులు అని చెప్పలేము. భగవద్గీతయందు అన్యదేవతారాధనను ఖండించు జ్ఞానము గలదు. భగవద్గీతను అనుసరించు వారు ఎవరూ విగ్రహారాధన చేయరు. అందువలన ఒక మతమును అజ్ఞానమని మరియొక మతమును జ్ఞానమని చెప్పలేము. ఎందుకనగా! మూడు మతములలో ఒకే జ్ఞానము గలదు. భగవద్గీతలో చెప్పిన శ్లోకముల సారాంశమే మిగతా రెండు గ్రంథములందు గలదు. భగవద్గీత మొదట తయారయిన ప్రథమ దైవగ్రంథము. తర్వాత రెండు గ్రంథములు వచ్చాయి. అందులో చివరి దైవ గ్రంథము ఖురాన్ అని గలదు. అందువలన దైవ గ్రంథములు మూడేయని తెలిసిపోయినది. అంతిమ దైవగ్రంథము ఖురాన్ ప్రథమ దైవగ్రంథమును, దానిలోని జ్ఞానమును ధృవీకరించుచున్నదని చెప్పడము జరిగినది. **భగవద్గీత**ను ఖురాన్‌లో **తౌరాత్** అను పేరుతో పిలువబడినది. తౌరాత్ గ్రంథములో **జ్యోతి, మార్గదర్శకత్వము** ఉన్నదని ఖురాన్ ఐదవ సూరాలో చెప్పడమైనది. దీనినిబట్టి అన్ని దైవగ్రంథములలో జ్ఞానమే యున్నది. అన్ని మతబోధలలో జ్ఞానమే ఉన్నదని తెలియుచున్నది.

**వారి ప్రశ్న :- మీరు అనేకమార్లు ప్రతిమవేరు, విగ్రహ వేరని చెప్పారు. ప్రతిమ అనినా ఒక బొమ్మే. అది రాతితో చేసియుండవచ్చు, మట్టితో చేసియుండవచ్చు లేక లోహముతో చేసియుండవచ్చును. ఒక ఆకారముగల ఏ బొమ్మ అయినా అది మనుషులచేత తయారు చేయబడినదే కదా! మనిషి తయారు చేసిన వాటికి మనిషే మ్రొక్కడము విచిత్రముగా యున్నది. మనుషులు తయారు చేసిన బొమ్మలో మనిషికంటే మించిన శక్తియుండునా?**

**మా జవాబు :-** మనిషి తయారు చేసినవి అన్నీ మనిషికంటే తక్కువవని ఎందుకనుకోవాలి. మనిషి తయారు చేసిన ఎన్నో యంత్రములు మనిషికంటే

శక్తివంతముగా యున్నవి కదా! అందువలన మనిషిచేత తయారు చేయబడిన వన్నీ మనిషికంటే తక్కువయినవని అనుకోకూడదు. మనిషి తయారు చేసిన క్యాలికులేటర్ మనిషికంటే తెలివిగా, ఖచ్చితమైన లెక్కలు చెప్పు చున్నది కదా! అట్లే మనిషి తయారు చేసిన విమానము మనిషికంటే వేగముగా ప్రయాణము చేయుచున్నది కదా! అందువలన మనిషి తయారు చేసినవి ఎన్నో మనిషికంటే గొప్పవని చెప్పవచ్చును.

**వారి ప్రశ్న:- మేము మనిషి చేసిన యంత్రములను గురించి అడుగలేదు. మనిషి చేసిన రూపమున్న బొమ్మలను గురించి అడుగుచున్నాము. మనిషి చేసిన బొమ్మలు దేవతలైతాయా?**

**మా జవాబు :-** మనిషి బొమ్మను మాత్రము చేయుచున్నాడుగానీ, అందులోని దేవతను తయారు చేయలేదు. మనిషి తయారు చేసిన బొమ్మ వేరు, ఆ బొమ్మలోయుండు దేవత వేరు. మనిషి స్థూలమైన ఆకారమును తయారు చేయగలడు కానీ, సూక్ష్మమైన దేవతను తయారు చేయలేడు. మనిషి చేసిన బొమ్మలో ఏ దేవత అయినా ఉండవచ్చును. కార్మికుడు కష్టపడి ఒక ఇంటిని తయారు చేయగలడు. అయితే ఆ ఇంటిలో నివసించువారిని తయారు చేయలేడు కదా! అలాగే ఒక ఆకారముగల బొమ్మను మనిషి తయారు చేయగలడు. అయితే ఆ బొమ్మలో నివాసముండు దేవతను తయారు చేయలేడు. మనిషి చేత బొమ్మ తయారయిన తర్వాత దానిలో ఏ దేవతయినా నివాసముండవచ్చును. అయితే బొమ్మను తయారు చేసిన వానికీ, అందులో నివసించు దేవతకు ఎలాంటి సంబంధము ఉండదు. బొమ్మను తయారు చేసిన వానిమీద ఆ బొమ్మలో నివసించు దేవత పెత్తనమును చెలాయించగలదు. అతనికి మంచయినా, చెడు అయినా చేయగలవు. అందువలన బొమ్మలను చేసిన వాడుగానీ, బొమ్మగానీ

దేవతలకంటే వేరయినవి. దేవతలు మనిషి తయారు చేసిన బొమ్మను తమ నివాస శరీరముగా వాడుకొంటున్నాయి. అంతేగానీ బొమ్మలోని దేవతను మనిషి తయారు చేయలేదు.

**వారి ప్రశ్న :- మాకు తెలిసినంత వరకు భూమిమీద మనుషులు, సమస్త జీవరాసులు ఉండగా, అన్నిటికీ అధిపతిగా దేవుడు ఒక్కడే గలడు. మధ్యలో మీరు చెప్పే దేవతలెవరు? వీరిని ఎవరు సృష్ఠించారు?**

**మా జవాబు :-** నీకు తెలిసిన వరకు దేవుడు ఆయన ఆధీనములో మనుషులు ఉన్నారు. అయితే నీకు తెలియని జ్ఞానము ఎంతో గలదు. అది అంతా దేవుని పరిధిలోనిదే. దేవుడు మనుషులనే కాక మనుషులకంటే వేరుగాయున్న దేవతలను కూడా సృష్ఠించాడు. నీకు కనిపించునదే దేవుని సృష్ఠి అని అనుకుంటున్నావు. అయితే నీకు తెలియనిది, నీకు కనిపించని సృష్ఠి ఎంతో గలదు. అందులో భాగముగా దేవతలను దేవుడు సృష్ఠించాడు. కనిపించే మానవ జాతియున్నట్లు, కనిపించని దేవతల జాతి ఎంతో గలదు. మనిషికున్న స్థూలదృష్ఠికి దేవతలు కనిపించరు. జాతి వేరయినా దేవతల శరీరములో యుండేవారు జీవులే. మానవ శరీరములోనున్న జీవులే కర్మనుబట్టి అప్పుడప్పుడు దేవతలుగా జన్మించుచుందురు. దేవతలు కనిపించని ఒక జాతి మాత్రమే. దేవతలకు చావుపుట్టుకలున్నాయి. మనుషులుగా చచ్చినవారు దేవతల జాతిలో పుట్టవచ్చును. దేవతల జాతిలో పుట్టినవారు మనుష జాతిలో పుట్టవచ్చును. మనుషుల జీవితమునకుగానీ, దేవతల జీవితమునకుగానీ కర్మే కారణము. కర్మప్రకారమే వారి జీవితములు జరుగుచుండును. మానవుల తర్వాత మానవులవలె దేవతల జాతి మరొకటియున్నదని చాలామందికి తెలియదు. కనిపించని దేవతలు కూడా

సాధారణ జీవులేయని, దేవతలని పేరు పెట్టబడినంతమాత్రమున వారు గొప్పవారు కాదని తెలియక, మనుషులు కొందరు దేవతలను దేవునివలె పూజించను మొదలుపెట్టారు. మనుషులకంటే నీచమైన గుణములుగలవారు దేవతలలో కూడా ఉన్నారను విషయము మనుషులకు తెలియదు. దేవతలలో ఎంతో ఉన్నతమైన భావములుగల మంచివారు గలరు. అలాగే ఎంతో నీచమైన భావములుగల చెడువారు కూడా గలరు. దేవతలు, మనుషులు ఇరువురు దేవుని సృష్టిలోని వారే, అయినా కొందరు మనుషులు దేవతలను దేవునివలె తలచి గొప్ప భావముతో ఆరాధించుటకు మొదలు పెట్టారు. మనుషుల చేత గౌరవింపబడుచూ, మనుషులచేత ఆరాధింపబడు దేవతలు అజ్ఞానము చేత మేము గొప్పవారమను అహమును పొందియున్నారు. దేవతలలో కూడా జ్ఞానజిజ్ఞాసులు కలరు, అజ్ఞానులు కలరు. దేవతలలో గొప్ప జ్ఞానులు కూడా కలరు. అట్లే గొప్ప అజ్ఞానులు కూడా కలరు. దేవతలలో మంచి గుణములతో ప్రవర్తించువారు కొందరుండగా, చెడు గుణములతో ప్రవర్తించు వారు చాలామందియున్నారు. ప్రథమ దైవ గ్రంథములో భారతదేశ భాషలో దేవతలు అని పిలువబడినవారే, అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో జిన్నులు లేక జిన్నాతులు అని చెప్పబడినారు.

అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 72 ఆయత్ 6 లో ఇలా కలదు చూడండి. **(72-6) "మానవులలో నుండి కొందరు జిన్నాతులలోని కొందరిని శరణు వేడేవారు. ఈ కారణముగా జిన్నాతుల పొగరు మరింత పెరిగిపోయింది." (72-5) "మనుషులైనా, జిన్నాతులైనా అల్లాహ్‌కు (దేవునికి) అబద్ధాలు అంటగట్టడము అనేది అసంభవమని మనము అనుకొన్నాము"** అని కూడా కలదు. **(6-100) "ప్రజలు**

**జిన్నాతులను అల్లాహ్‌కు భాగస్వాములుగా ఖరారు చేసుకొన్నారు. మరి చూడబోతే వారిని సృష్టించినది కూడా ఆయనే"** ఈ విధముగా జిన్నాతులను గురించి ఖురాన్ గ్రంథములో ఇంకా కొన్నిచోట్ల చెప్పడము జరిగినది. అక్కడ 'జిన్నాతులని' చెప్పినవారినే మనము 'దేవతలు' అంటున్నాము. దేవతలను దేవునికి సమానము చేసి పూజించుచున్నారని (72-6) లోను, (6-100) లోనూ చెప్పడము జరిగినది. కనిపించని దేవతల విషయము మనుషులకు తెలియక కనిపించకుండా మాట్లాడు దేవతలను పూజ్యులుగా భావించుకొన్నారు. ఒకవేళ దేవతలను పూజించని వారిని కొన్ని కష్టాలపాలు చేసి, కొన్ని రకముల అనారోగ్యములపాలు చేసి, మనుషులను భయపెట్టి తమను పూజించునట్లుగా కొందరు దేవతలు చేసుకొంటున్నారు. తమకు ముడుపులు కట్టనివారిని, కానుకలు ఇవ్వని వారిని ఇబ్బందుల పాలుచేసి తమకు ముడుపులు చెల్లించునట్లు చేసు కొంటున్నారు. ఈ విధముగా జిన్నాతులు అని ఖురాన్ గ్రంథములో పిలువబడేవారే మన దేశములో హిందువుల మధ్య దేవతలుగా పిలువబడు చున్నారు. భూమిమీద మనుషులు లేనిచోట కూడా వీరు కలరు. దేవతలజాతి మానవులజాతికంటే గొప్పదని కొందరనినా అట్లేమికాదు పక్షులలో కాకులు, గద్దలులాంటి వారు మనుషులు, దేవతలు. రంగులోనూ, పరిమాణములోనూ గద్ద కాకి కొంత వేరుగాయున్నా రెండూ మాంసము తినేవే అయినట్లు, మనుషులు దేవతలు వేరువేరు జాతులయినా ప్రవర్తనల లోనూ, కర్మలలోనూ, గుణములలోనూ దాదాపు సమానముగానే యున్నారని చెప్పవచ్చును.

**వారి ప్రశ్న:- దేవతలు మానవులకంటే కొంత వేరయినా వారిలో చెప్పకో తగిన గొప్పతనము లేదని మీరంటున్నారు. వారి విషయము చాలామందికి**

**తెలియదు కదా! నేడు పెద్ద స్వామీజీలుగాయున్న వారు సహితము మీరు చెప్పినట్లు దేవతలను గురించి చెప్పలేదు. పైగా వారు కూడా దేవతలను పూజించుచున్నారు. ఒకవైపు భగవద్గీతను చెప్పుచున్నా, మరొకవైపు దేవతల భ్రమలోపడి వారిని పూజించుచున్నారు. ఈ విధముగా దాదాపు కొంత జ్ఞానము తెలిసిన వారందరూ దేవతలనే ఆరాధించుచుండగా, మీరు మాత్రము దేవతలంటే గొప్పేమీ కాదు, వారు కూడా మానవజాతిలాగే యున్న జాతి అని అంటున్నారు. మా అనుమానముతో అడుగు చున్నాము, వారి విషయము మీకు ఎలా తెలుసు?**

**మా జవాబు :-** దేవతలు మనుషుల మీద తమ పెత్తనము చెలాయించుటకు, మనుషులను భయభ్రాంతులను చేసి తమను పూజించునట్లు చేసుకొనుటకు కొన్నిచోట్ల తమను గౌరవించని ప్రజలను కనిపించకుండా పీడించుచూ, మనుషులను అనారోగ్యములపాలు చేసినప్పుడు, మనుషుల మీద దేవతల దౌర్జన్యము జరుగునప్పుడు వారు చేయు పనులు మంచివి కాదని, ప్రజలను రౌడీలవలె పీడించడము మంచిదికాదని, కొన్ని సందర్భములలో మేము వారిని దండించడము జరిగినది. అలా వారు చేయు కొన్ని చెడుపనులను మేము ఖండించడము జరిగినది. అటువంటి సమయములో కొందరు దేవతలు మేము చెప్పు నీతిని, జ్ఞానమును గ్రహించినవారై మా మాటకు గౌరవమిచ్చిన వారు కలరు. అరుదుగా కొందరు దేవతలు మాకు ఎదురు తిరిగి మాట్లాడిన సందర్భములు కూడా కలవు. అట్లు అరుదుగా జరిగిన సంఘటనలలో మేము వారిని కఠినముగా శిక్షించడము కూడా జరిగినది. మా శిక్షకు భయపడి మారిపోయిన వారూ గలరు. కొందరు అప్పటికి భయపడినా తర్వాత వారి పద్ధతి ప్రకారము వారు చెడుగానే నడుచుకొను వారు కూడా కలరు. ఈ విధముగా దేవతలతోనూ నాకు కొంత పరిచయము

ఉండుట వలన వారి విషయములు దాదాపు పూర్తిగా తెలియుననియే చెప్పుచున్నాను.

**వారి ప్రశ్న :- దేవుడు మనుషజాతిని పుట్టించినట్లు దేవతా జాతిని కూడా పుట్టించాడు అని అంటున్నారు. మనుషులు పిండజులుగాయున్నారు. కంటికి కనిపించని దేవతలు పిండజులేనా? వారి సృష్ఠి ఎలా జరుగుచున్నది?**

**మా జవాబు :-** మనుషులవలె అన్ని రకముల దేవతలున్నారని చెప్పాము. మనుషులకు దేవతలకు ఒకే ఒక తేడా కలదు. మనుషులు కనపడుచున్నారు. దేవతలు కనిపించడములేదు. మనుషులకంటే కొన్ని విషయములందు మాత్రము దేవతలలో ప్రత్యేకత కలదు. అందువలన కొంత విశేషత దేవతలలో యున్నదని చెప్పవచ్చును. వారి విశేషత వలన మనుషులను దేవతలు పీడించు, బాధించు బలము కల్గియున్నారు. అంత తప్ప మిగతా అన్ని విషయములందు మనుషులతో సమానముగానేయున్నారు. దేవుని సృష్ఠి అయిన అండజ, పిండజ, ఉద్భిజ అను మూడు రకములలో మానవుల సృష్ఠి పిండజముగా యున్నది. అదే విధముగా దేవతల సృష్ఠికూడా పిండజముగానే యున్నది. మనుషులకు దేవతల విధానమంతయు కనిపించకయుండుట వలన వారి విషయము ఎవరికీ సరిగా తెలియకుండా పోయినది. మనుషులకున్నట్లే దేవతలకు కూడా బాల్యము, యవ్వనము, కౌమారము, వృద్ధాప్యము, మరణము అను స్థితులు వరుసగా గలవు. అంతేకాక మనుషుల మరణములు మూడు రకములుగా యున్నట్లు, దేవతల మరణములు కూడా కాలమరణము, అకాలమరణము, తాత్కాలిక మరణమను మూడు రకముల మరణములు గలవు.

**వారి ప్రశ్న :- దేవతలు మానవుల కోర్కెలను నెరవేర్చుతారని, అందువలన**

**మనుషులు దేవతల వెంటపడి మ్రొక్కుచున్నారని విన్నాము. కొందరు దేవతలు మనుషుల కోర్కెలను తొందరగా నెరవేర్చుట వలన ఆ దేవతలను ఎక్కువమంది పూజింతురని కూడా విన్నాము. తిరుపతి వెంకటేశ్వరుడు ఆపద మ్రొక్కుల వాడని కొందరు చెప్పుచుందురు. మ్రొక్కుకొన్నవారి ఆపదలను తప్పక తీర్చునని అలాగ అన్నారు. భక్తుల కోర్కెలను నెరవేర్చడములో కొందరు ముందుండుట వలన ఆ దేవతలనే ఎక్కువమంది ఆరాధించుచున్నారని తెలియుచున్నది. కొందరు వారు నమ్మిన దేవుని దయవలన పెద్ద ధనికుడిని అయ్యానని చెప్ప చుందురు. పేదవారినుండి ధనికులుగా మారిన కొందరు వారు పూజించు దేవతయొద్దకు నెలకొకమారు పోయి పూజలు చేయించి వచ్చే వారున్నారు. కొందరు తాము సంపాదించిన సొమ్మును లక్షలలోనూ, కోట్లలోనూ ముడుపులుగా చెల్లించేవారున్నారు. కొందరయితే తాము విపరీతముగా సంపాదించి అదంతా తాము నమ్మిన దేవుడే ఇచ్చాడని కొన్ని కేజీల బంగారమును హుండీలోనికి వేసి వచ్చిన వారు కూడా కలరు. కొందరయితే కొన్ని కోట్లను ఒక మూటగా వేసినవారు పేరు తెలియకుండా అజ్ఞాత భక్తులు ఇచ్చారన్నట్లు చేయుచుందురు. ఇంత భక్తి మనుషులందుడుటకు దేవతల ద్వారా వారికి మంచి జరిగి లాభము వచ్చియుండును కదా! దీనినిబట్టి దేవతలు తమను మ్రొక్కిన వారి కోర్కెలను తీర్చుచున్నారని, లాభము చేకూర్చుచున్నారని అర్థమగుచున్నది. దీని విషయములో మీరేమంటారు?**

**మా జవాబు :-** మీరు చెప్పినదంతా నిజమే! అయితే ఇక్కడ కనపడునదంతా సత్యమే అనుకొంటే మీరు తప్పులో కాలు వేసినట్లేయగును. ఇక్కడ కనిపించు దానికంటే కనపరానిదే ఎక్కువగాయున్నది. బయటికి కనిపించునది మీరు చెప్పినట్లుయున్నా, ఏ దేవతా ఏ మనిషికీ ఏ సహాయము చేయలేదు. ఈ మాటను ఒక్కమారుగా వింటే మేము చెప్పునది అసత్యముగాయుండును.

అందువలన ఇక్కడ కొంత సవివరముగా తెలియవలసియున్నది. భూమిమీద మనుషులుగానీ, దేవతలుగానీ ఇరువురు కర్మప్రకారము పుట్టి, కర్మ ప్రకారము బ్రతుకవలసినవారే. ఎవరి కర్మను వారు అనుభవించక మానదు. అటువంటప్పుడు మనిషికి ఏమి జరిగినా, ఏమి వచ్చినా అన్నీ కర్మప్రకారమే జరుగవలసియున్నది. దేవతలుగానీ, మనుషులుగానీ కర్మకు అతీతులు కారు. మనుషులలోని బలహీనతను దేవతలు ఆసరాగా చేసుకొని, మనిషికి మేము మేలు చేయుచున్నామని భ్రమింపచేసి, మనిషిని మోసము చేయు చున్నారు. కొన్ని విషయములలో దేవతలు మంచి చేసినట్లు కనిపించినా అది వారు చేసిన మంచికాదు. మనిషి దేవతలను తన కోర్కెల నిమిత్తము పూజించుచున్నాడు. అటువంటి సమయములో తాను ఒక కోర్కెను కోరి ఈ గండము తప్పిపోవునట్లు చేస్తే, నీకు ఫలానా కానుక చెల్లించుకొంటానని మనిషి మంచి పేరున్న దేవతను మ్రొక్కాడనుకొనుము. అప్పుడు ఆ మనిషి కోర్కె ప్రకారము వాడు కోరిన కోర్కె నెరవేరి వాని గండము గడచిపోయినది. తర్వాత మనిషి తాను మ్రొక్కిన దేవతకు కానుక చెల్లించవలసియున్నది. ఎందుకనగా మనిషి ముందే తన కోర్కె నెరవేరితే ఫలానా కానుక ఇచ్చు కుంటానని చెప్పియున్నాడు. ఆ విషయము ఆ దేవత ముందరే జరిగి యుండుట వలన అదంతా ఆ దేవతకు కూడా తెలిసియున్నది.

మనిషి దేవతను కోరిన కోర్కె నెరవేరినది కూడా ఆ దేవతకు తెలుసు. అయితే తాను ఏమీ చేయలేదను విషయము కూడా ఆ దేవతకు తెలుసు. అయితే అతను కోరుకున్న కోర్కె నన్ను మ్రొక్కిన తర్వాతే నెరవేరింది కదా!యనీ, అలా నెరవేరుటకు నేనే కారణమైయుండవచ్చును కదా!యనీ తలచి, కోర్కె నెరవేరిన తర్వాత కూడా కొంతకాలము వరకు కానుక ఇవ్వని మనిషిని తనకు కానుకను చెల్లించమని ఏదో ఒక రకముగా ఆ దేవత

అతని మీద ఒత్తిడి తెచ్చును. వేరే మనిషిలోనికి పూనకమువచ్చి, నీ కోర్కెను నేను నెరవేర్చాను నాకు నీవు చెప్పిన కానుక ఇవ్వలేదని ఆ దేవత అడిగిందనుకో, అప్పుడు ఆ మనిషి భయపడి వెంటనే తాను చెప్పిన కానుకను ఆ దేవతకు ఇచ్చును. దేవత పూనకమువచ్చి కానుకను గురించి అడిగిన దానివలన కోర్కెను కోరిన మనిషి తన కోర్కెను ఆ దేవతయే నెరవేర్చినదని అనుకొనును. ఆ విషయమంతా తెలిసినవారు కూడా దేవత వలననే ఆ మనిషి కోర్కె నెరవేరినదని అనుకొందురు. ఈ విధముగా మనుషులు దేవతలను నమ్ముచున్నారు. తాము చేయని పనులకు కానుకలను అడిగి ఇప్పించుకొనుచున్నారు దేవతలు. అట్లు అడుగుటవలన దేవతలే కోర్కెలను నెరవేర్చారని ప్రజలు దేవతల విషయములో మోసపోవుచున్నారు.

వాస్తవముగా జరిగింది చూస్తే దేవతలు ఎంత మోసము చేయు చున్నారో తెలియగలదు. దీనిని గురించి భగవద్గీతలో విజ్ఞాన యోగమను అధ్యాయమున 20, 21, 22, 23 శ్లోకముల సారాంశము ఈ విధముగా కలదు చూడండి. శ్లోకముల భావము **"ప్రకృతి సంబంధములగు పాపముల చేత అజ్ఞానులైన మనుషులు కోర్కెలయందు మునిగి, తమ కోర్కెలు నెరవేరు నిమిత్తము అసలయిన దేవున్ని ప్రక్కనపెట్టి, దేవుడుకాని అన్యదేవతలను, ఆ దేవతల నియమముల ప్రకారము ఆరాధించుచున్నారు. ఎవ్వనికి ఏ దేవతను పూజింప శ్రద్ధయుందో, ఆ శ్రద్ధ ప్రకారమే ఆ దేవతనే వదలకుండా ఆరాధించునట్లు నేనే చేయుచున్నాను. అలా శ్రద్ధ ప్రకారము ఆ దేవతనే పూజ చేసే దానివలన కోర్కె నెరవేరినదని వానికి తెలియునట్లు నేనే వాని కోర్కెను నెరవేర్చుచున్నాను. దేవతాభక్తిలో యున్నా వాని మంచి కోరిన నేను వాని కోర్కెలను నెరవేరునట్లు చేయుచుండగా, తెలివి తక్కువ మనుజులు దేవతా పూజల వలన కోర్కెలు నెరవేరునని వాటినే ఆచరించుచుందురు.**

**అల్పబుద్ధిగలవారు పొందు ఫలితములు ఎంతవైనా అవి అల్పమే యగును. దేవతా భక్తులందరూ దేవతలనే పొందగా, నా భక్తులు మాత్రము నన్ను పొందగలరు"** అని దేవుడు భగవంతుని రూపములో చెప్పడము జరిగినది. భగవంతుడుగా చెప్పిన విషయమంతా చూస్తే దేవుడు వేరు, దేవతలు వేరని తెలిసిపోవుచున్నది. మనిషి తమ కోర్కెల నిమిత్తము దేవున్ని వదలి దేవతలను ఆశ్రయించడము జరుగుచున్నది. మనుషులు దేవుని జ్ఞానము తెలియనందువలన అజ్ఞానములో పూర్తి లోతుగా చిక్కుకొన్నవారై తమకు అన్నీ ఇచ్చువాడు దేవుడు ఒక్కడే అని తెలియక, దేవుని చేత సృష్ఠింప బడినవారు, మానవులవలె మాయలో చికుకొన్న వారు అయిన దేవతలను తమకంటే గొప్పవారుగా తలచి, వారు కనపడని దానివలన దేవునితో సమానముగా తలచి, తాము కోరుకొన్న కోర్కెలను నెరవేర్చుదురని పొరపడిన వారై, దేవతలను పూజ్యులుగా భావించి పూజించను మొదలు పెట్టారు. దేవతలను పూజించిన వారి కోర్కెలు తీర్చుదురను అపోహతో ఆశవలన అందరినీ మ్రొక్కను మొదలుపెట్టారు.

భూమిమీద ప్రతి ఊరిలోను కొందరు మనుషులున్నట్లు ప్రతి ఊరిలోను కొందరు దేవతలు గలరు. ఒక ఊరిలో వేయిమంది జనాభా యుందనుకొందాము. ఆ ఊరిలో దాదాపు రెండువందల యాభై (250) మంది నుండి 300 వరకు దేవతలుందురు. అలాగే రెండు వందలయాభై (250) నుండి 300 వరకు దైయ్యాలు ఉండును. అదే విధముగా రెండు వందల యాభై (250) నుండి 300 వరకు జంతువులు, పక్షులు, పాములు, క్రిమికీటకాదులు ఉండును. ఊరిలోని మనుషులు వేయిమంది కనిపించు చుండగా, మిగతా మూడు రకములవారు కనపించకయున్నారు. దేవతలు కనిపించరు వారి పుట్టుకయే అట్లుండును. దేవతలకంటే భిన్నమైనవారు

దైయ్యములు. దైయ్యములనగా చనిపోయి బ్రతికియున్న మనుషులేయని అర్థము. అలాగే మనుషులవలె చనిపోయి బ్రతికియున్న జంతువులు, పక్షులు, పాములు, క్రిమికీటకాదులు మొదలగునవన్నియూ దైయ్యముల క్రిందకే వచ్చును. ఈ విధముగా భూమిమీద కనిపించకయున్న వారు మూడు రకములుగా యున్నా వారిలో దైయ్యములుగా యున్నవారు చనిపోయినా, ఆయుష్షు అయిపోని వారని అర్థము. దేవతల పుట్టుకయే సూక్ష్మమైనందున దైయ్యములవలె కనిపించక దేవతలు తిరుగుచుందురు. వేయిమంది గల ఒక ఊరిలో దాదాపు ఎంత సంఖ్యలో దేవతలుందురో తెలిసినది. దేవతలకు, దైయ్యములకు స్థూల శరీరము లేనందున దైయ్యములు దేవతలు రెండూ సూక్ష్మశరీరముతోనే కాలము గడుపుచున్నవి. దేవతలు సూక్ష్మశరీరముతో దైయ్యములవలె ఉండుట వలన దేవతలను పెద్ద దైయ్యములని, దైయ్యములను చిన్న దైయ్యములని చెప్పవచ్చును. బ్రతికియున్న మనకు తెలియదుగానీ, దేవతలకు దైయ్యములకు అప్పుడప్పుడు అక్కడక్కడ చిన్నచిన్న ఘర్షణలు కూడా జరుగుచుండును.

బ్రతికియున్న మనుషులను కనిపించని దేవతలు అనేక విధముల మోసములు చేయుచున్నవి. తాము మనుషుల కోర్కెలను నెరవేర్చు శక్తి గల వారమని ప్రచారము సాగించుకొన్నవి. ప్రజలలో ముఖ్యమైన వారయిన స్వామీజీలు కూడా దేవతలను మ్రొక్కడము వలన మిగతా ప్రజలందరూ దేవతల విషయములో మోసపోవడము జరిగినది. ప్రత్యేకమయిన శక్తులు లేని దేవతలు, మనుషుల కోర్కెలను తీర్చువారుగా ప్రచారమైనారు. ప్రజలు తమ అజ్ఞానము వలన దేవతలు తమ కోర్కెలను నెరవేర్చుదురను భ్రమతో, దేవతలకున్న నియమాల ప్రకారము ఆ నియమములను ఆచరించుచూ, శుక్రవారము మ్రొక్కేవారిని శుక్రవారము, మంగళవారము మ్రొక్కే వారిని

మంగళవారము, శనివారము మ్రొక్కే వారిని శనివారము మ్రొక్కుచున్నారు. మాంసముతో తృప్తి చెందే దేవతలకు జంతుబలులు చేసి మాంసమును అర్పించుచున్నారు. కొంతమంది దేవతలకు శబ్దసందడి ఇష్టమైనందున వారికి అదే విధముగా డోలు, తప్పెట్లతో ఊరేగింపు ఉత్సవము చేయు చున్నారు. ఇట్లు ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క ఆరాధనతో వారి నియమముల ప్రకారము పూజలు చేయుచున్నారు. అలా పూజలు చేయడము వలన తమ కోర్కెలు నెరవేరునని ప్రజలు తలచుచున్నారు.

మనుషులు ఆశతో తమ కోర్కెల నిమిత్తము దేవతలను పూజించగా, దానిని గమనించిన దేవుడు, మనిషి ఏ దేవతను శ్రద్ధతో పూజించుచున్నాడో ఆ దేవత మీదే శ్రద్ధయుండునట్లు చేయుచున్నాడు. దేవునికి ప్రతీదీ తెలుసు, ప్రతి దానిని చూస్తున్నాడు. దేవునికి తెలియకుండా జరుగునది ఏదీలేదు. అందువలన మనిషికి ఏ దేవతమీద ఎక్కువ శ్రద్ధయుండునో, ఆ శ్రద్ధను అలాగే యుండునట్లు దేవుడే చేసి, ఆ దేవతనే మనిషి పూజించునట్లు చేయును. దేవుడు ఇచ్చిన శ్రద్ధతో మనిషి తాను నమ్మిన దేవతనే కోర్కెల నిమిత్తము పూజించుచుండగా, ఆ కోర్కెలను దేవుడే నెరవేర్చుచున్నాడు. అది తెలియని మనిషి తన కోర్కెలను తాను పూజించిన దేవతయే నెరవేర్చినదని అనుకొనుచున్నాడు. ఈ విధముగా నెరవేరు కోర్కెలను చూచి, ఇంకా కావలసిన కోర్కెలను కోరుచూ, చిరకాలము దేవతా భక్తిలో మనిషి కూరుకుపోవుచున్నాడు. మనిషికి దేవుని జ్ఞానము తెలియని దానివలన, తెలివి తక్కువవాడై నెరవేరు ప్రపంచ కోర్కెలవైపు పోవుచున్నాడు. ఇన్ని విధములుగా దేవతా భక్తులు దేవతలవైపు పోగా, దేవుని భక్తులు జ్ఞానము తెలిసినవారై దేవుని వైపు పోవుచున్నారు.

**వారి ప్రశ్న :- మీరు చెప్పు విషయమునుబట్టి దేవతలు వేరని, దేవుడు వేరని ఈ**

**తారతమ్యమును మనుషులు తెలియక, దేవతలను దేవునితో సమానముగా లెక్కించుకొన్నారని తెలియుచున్నది. అయితే మనుషులు కోరిన కోర్కెలను దేవుడు ఎందుకు నెరవేర్చాలి? దేవుడు నెరవేర్చినా మనుషులు ఆ విషయమును తెలియనివారై దేవతలే నెరవేర్చారని అనుకొనుచున్నారు కదా! దానివలన దేవుడు మనుషుల కోర్కెలు నెరవేర్చినా, ఆ కోర్కెలను ఎవరు తీర్చారను సత్యము తెలియనప్పుడు, దేవుడు వారి కోర్కెలను తీర్చి ప్రయోజనము లేదు కదా! దేవుడు మనుషుల కోర్కెలను నెరవేర్చుట వలన మనుషులు దేవునికి వ్యతిరేఖముగా, దేవతా భక్తులుగా మారిపోవుచున్నారు కదా! అలాంటప్పుడు దేవుడు ఎందుకు మనుషుల కోర్కెలను నెరవేర్చుచున్నాడు?**

**మా జవాబు :-** దేవుడు తన ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో, అలాగే తన చివరి దైవగ్రంథము ఖురాన్‌లో ఈ విషయమును గురించి చెప్పియున్నాడు. తనకు ఇష్టమైన వారిని మాత్రమే తనవైపు వచ్చునట్లు చేయుటకు, తనకు ఇష్టము లేనివారిని తన మార్గమునుండి దూరముగా పోవుటకు, తనవైపు రాకుండా చేయుటకు, దేవుడు చేయు కార్యములలో ఇదొక కార్యము. ఈ కార్యములో మనుషుల కోర్కెలను నెరవేర్చి, నెరవేర్చినది దేవతలేనని భ్రమింపజేసి, మనుషులను తననుండి దూరముగా పంపుచున్నాడు. దేవుడు అదే పనిగా చేయుచున్న కార్యములలో ఇదొకటి. దేవుని కార్యములను మనిషి ఏమాత్రము గుర్తించలేడు. ఎందుకనగా! ఇది దేవుని కార్యమే అయినా దానిని ప్రకృతియే చేయుచున్నది. అందువలన దేవుడు మనిషికి మంచి చేసినా, చెడు చేసినా మనిషి ఏమాత్రము గుర్తించలేడు.

**వారి ప్రశ్న :- దేవుడు మనిషిని తనవైపునుండి దారి మళ్ళించి ప్రక్కదారిలో పోవునట్లు చేయుటలో ఇదొక కార్యమని చెప్పారు. దేవుడు మనుషులు మ్రొక్కిన కోర్కెలను నెరవేర్చడమేకాక మనిషిని అజ్ఞానమార్గములోనికి పంపి,**

**జ్ఞాన మార్గములోనికి రాకుండా చేయు విధానములలో మరొక విధానము ఎలావుందో తెలియజేయండి?**

**మా జవాబు :-** సాధారణ ప్రజానీకమును తన దారిలోనికి రాకుండా చేయుటకు దేవుడు అదేపనిగా కనిపించని దేవతలను సృష్ఠించాడు. సామాన్య ప్రజలందరూ తమలోని కోర్కెల ఆధారముతో దేవతలవైపు పోయి, దేవుడు ఒకడున్నాడను విషయమును కూడా మరచిపోయారు. ఇదంతా సామాన్య ప్రజల విషయముకాగా, 'దేవుడు' అను నమ్మకము కల్గిన కొందరు ప్రజలు దేవతలను నమ్మకపోయినా, వేషధారణలో స్వాములుగాయున్న కొందరు స్వామీజీలను నమ్మి వారినే దేవునిగా భావించి, వారినే అనుసరించుచూ దేవున్ని మరచిపోవుచున్నారు. వారు ఆశ్రయించిన స్వామీజీ, ఎన్నో మహత్యములు చేయువాడైయుండి, తమ కోర్కెలను నెరవేర్చుదునని చెప్పు వారైయుండుట వలన, వారు కొన్ని కార్యములను నమ్మశక్యముగాని విధముగా చేయుట వలన, భక్తులైనవారు వారిని పూర్తిగా నమ్మి ఈయనే ప్రత్యక్ష దైవమనీ, కనిపించే దేవుడని చెప్పుచుందురు. అటువంటి వారికి దేవుని జ్ఞానము ఏమాత్రము రుచించదు. దేవుని జ్ఞానముతో మాకు పనే లేదు, దాని అవసరమే లేదు అని చెప్పుచుందురు. ఈ విధముగా కొందరు భక్తి కల్గియున్నా ఆ భక్తిని కనిపించే బాబాల మీద, స్వామీజీల మీద చూపుచూ, దేవుని జ్ఞానమును, దేవున్ని పూర్తిగా ప్రక్కన పెట్టినవారు గలరు. కొందరు దేవతల మీద భక్తితో దేవున్ని విస్మరించగా, కొందరు బాబాల మీద భక్తితో వారినే దేవుడని నమ్మి, దేవుని జ్ఞానమునకు దూరముగా పోవుచున్నారు. ఆ విధముగా దేవుని జ్ఞానమునకు దూరముగా పోయిన అనేక సంఘటనలు గలవు. అయితే ఈ రెండు విధానములలోనే ఎక్కువ మంది ప్రజలు కొట్టుకు పోవుచున్నారు. అటువంటి వారికి దేవున్ని గురించి

చెప్పినా వారు ఏమాత్రము వినే స్థితిలో ఉండరు. కనపడని దేవతలను నమ్మి, దేవుని విషయమును మరచిపోయిన వారిని, అలాగే కనిపించే బాబాలను, స్వామీజీలను నమ్మి దేవుని జ్ఞానమునకు దూరముగా యున్నవారిని బాగు పరచాలనీ, వారికి కూడా దేవుని జ్ఞానమును తెలుపాలని ఎవరయినా ప్రయత్నించినా, అటువంటి వారిని తెలివి తక్కువవారిగా లెక్కించి హేళన చేయువారు గలరు. అజ్ఞానములో కూరుకుపోయిన వారు, దేవుని చేత అజ్ఞానులని ముద్ర వేయబడినవారు, దేవుని చేత అపమార్గములో (అజ్ఞాన మార్గములో) పోవాలని తీర్పు తీర్చబడినవారు ఎప్పటికీ జ్ఞానులుగా మారలేరు, వారికి జ్ఞానము రుచించదు. దేవుడే స్వయముగా వారిని తప్పు దారిలో పంపి తనవైపు రాకుండా చేసుకోవాలను కొన్నాడు. కావున వారిని ఎవరూ మార్చలేరు. అటువంటి స్థితిలోయున్న వారు కూడా తాము జ్ఞానులమే అని చెప్పుకొనుచూ, తమకు తెలిసిన జ్ఞానమునే దేవుని జ్ఞానముగా లెక్కించుచుందురు. వారివద్దయున్న జ్ఞానము, వారికి తెలిసిన జ్ఞానము పూర్తి అసత్యమైనదని వారికి తెలియదు.

**వారి ప్రశ్న :- కొందరు దేవుడున్నాడని, దేవుడు ఒక్కడేనని, ఇతర దేవతలను పూజించుట అజ్ఞానమనీ క్రైస్తవ, ఇస్లామ్ సమాజములలో చెప్పుచుందురు. వీరు విగ్రహారాధన చేయరు. విగ్రహారాధనను పూర్తిగా ఖండించుదురు. అయినా దేవుడు చెప్పిన జ్ఞానమునకు పూర్తి వ్యతిరేఖ భావములో ఉంటూ, తాము సరియైన భావములో ఉన్నామని, తమకు తెలిసినదే నిజమైన జ్ఞానమని చెప్పుచుందురు. విగ్రహారాధకులను, బాబాలను పూర్తిగా నమ్మినవారిని పూర్తిగా అజ్ఞానులనీ, వారిని దేవుడు అదేపనిగా తప్పదారిలో పంపుచున్నాడనీ, వారికి అలా తీర్పు తీర్చబడిందని మీరు చెప్పారు. విగ్రహారాధన చేయకుండా దేవుడు ఒక్కడేయని నమ్మిన వారు చాలామంది ఉన్నా వారికి దేవుని జ్ఞానము**

**లోని నిజమైన భావము తెలియదు. దైవగ్రంథములలోని దేవుని వాక్యములను సరిగా అర్థము చేసుకోని స్థితిలోయుండువారు ఎందరో గలరు. అటువంటి వారు తమ గురువులు, మతపెద్దలు చెప్పినట్లు విని వారు చెప్పినదే నిజమైన జ్ఞానమని నమ్మియుందురు. తమ మతపెద్దలు మత జ్ఞానమునే చెప్పితే దానినే దైవజ్ఞానముగా నమ్మిన వారు గలరు. అటువంటి వారు దైవగ్రంథములలోని దైవజ్ఞానమును తెలియనివారై యుందురు. విగ్రహారాధకులను, దేవతారాధకులను, బాబాలను, స్వామీజీలను అనుసరించువారిని మార్గము తప్పిన వారిగా లెక్కించినప్పుడు, దైవజ్ఞానమును తెలియకనే తెలిసినామని అనుకొనువారిని ఏమనాలి?**

**మా జవాబు :-** "దేవుడు తనకు ఇష్టము లేనివారికి తన జ్ఞానము యొక్క గట్టు దొరకకుండా చేస్తానని" ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో చెప్పాడు. అట్లే చివరి దైవగ్రంథము ఖురాన్‌లో కూడా చెప్పాడు. కనపడని దేవతలను విగ్రహములుగా పూజించువారినే కాకుండా, కనిపించు స్వామీజీలు, బాబాలను నమ్మి దేవున్ని లెక్కచేయని వారిని తనవైపుకు రాకుండా చేయడము అను రెండు విధానములేకాకుండా ఇంకా ఎన్నో విధానముల ద్వారా దేవుడు తననుండి దూరము చేయుచున్నాడు. దేవుడు ఎలా చేయునో ముందే ఎవరూ ఊహించుకోలేరు. మనకు తెలిసిన విధానములు కొన్నే అయితే తెలియని విధానములు ఎన్నో గలవు. సంపూర్ణ జ్ఞాని అయిన వానికి మాత్రము కొన్ని విధానములు తెలియును. జ్ఞానము లేనివానికి ఏమీ తెలియదు. జ్ఞానము లేనివాడు దేవునికి దూరమయినా నేను దగ్గరగానే ఉన్నానని అనుకొనుచుండును. కనపడని దేవతలనూ, కనిపించే మనుషులనూ నమ్మినవారిని జ్ఞానమార్గములో పంపక దేవుడు అపమార్గములో పంపునని అనుకొన్నాము కదా! అదేకాక తన జ్ఞానము

మీద శ్రద్ధలేని వానిని కూడా దేవుడు తనవైపు రాకుండా చేయగలడు. ***దేవుని మీద విశ్వాసముండి, దేవుని జ్ఞానముమీద శ్రద్ధ లేనివానిని కూడా దేవుడు తన దారినుండి తప్పించి దూరముగా పంపును. దేవునిమీద విశ్వాసము నూటికి నూరు శాతమున్నా, దేవుని జ్ఞానము మీద శ్రద్ధ లేకపోతే అటువంటి వారి విశ్వాసమును దేవుడు లెక్కచేయడు. మనిషియొక్క విశ్వాసము దేవునికి అవసరము లేదు. దేవుని జ్ఞానము మీదగల శ్రద్ధమాత్రమే దేవునికి అవసరము.***

ఇక్కడ ఒక చిన్న ఉదాహరణను గమనిద్దాము. ఒక జిల్లా ప్రజలందరూ ఒక వంశము పేరు చెప్పుచూ మేము అందరము ఆ వంశమునకు సంబంధించిన భక్తులమని చెప్పెడివారు. ఇంకా కొందరిని వివరమడుగగా ప్రక్క దేశములో గోటూరి గుడారం రాజు గారి భక్తులమని చెప్పెడివారు. గోటూరి గుడారం రాజు భక్తులు ఎవరయినా 'అప్పు చేయరు, అప్పు ఇవ్వరు' అది మా భక్తుల నియమమనీ, అప్పు అడిగెడివాడు గానీ, అప్పు ఇచ్చెడివాడుగానీ గుడారంరాజు భక్తులకు సంబంధించిన వారు కాదని చెప్పెడివారు. అట్లు ఒక జిల్లా మొత్తము ప్రజలలో 80 శాతము మంది గుడారంరాజు భక్తులమని చెప్పుకొనెడి వారు. మిగత దాదాపు 20 శాతము మంది గుడారంరాజు భక్తులు కాదని తెలిసిపోయినది. ఎందుకనగా గుడారంరాజు భక్తులు తలమీద గుడారంలాంటి ఒక టోపీని ధరించెడివారు. మిగతా ప్రజలు టోపీ ధరించెడివారు కాదు. అందువలన గుడారంరాజు భక్తులను సులభముగా గుర్తించవచ్చును. గుడారంరాజు భక్తుల కుటుంబములో పుట్టినవారందరూ పెద్దయ్యాక గుడారంరాజు భక్తులమని చెప్పుకొనెడివారు. ఈ విధముగా గుడారంరాజు భక్తుల సంఖ్య పెరిగిపోవుచుండెను. గుడారంరాజు భక్తులలో కొన్ని మంచి లక్షణములు

ఉండెడివి. వారు ఎవరివద్ద అప్పు తీసుకోరు, కావున వారు అప్పులపాలయ్యే అవకాశమే లేదు. అట్లే వారు అప్పు ఇవ్వరు, కావున వారు వడ్డీలాగి పాపము సంపాదించుకొను అవకాశము కూడా లేదు. ఇటువంటి మంచిపనే కాకుండా తమకు గోటూరు గుడారం రాజు ఏమీ ఇవ్వకున్నా ఆయన భక్తులమని నిస్వార్థముగా చెప్పుకొనెడి వారు. ఈ విధముగా మిగతా ప్రజలకంటే కొంత ప్రత్యేకముగా కనిపించెడివారు.

గోటూరి గుడారం రాజు భక్తులమని చెప్పుకొనువారంతా గుడారం రాజును గురించి ఎక్కువగా పొగిడి చెప్పెడివారు. గుడారంలాంటి టోపీలు ధరించువారందరూ గుడారము రాజుకంటే మించిన రాజు భూమండలము లో లేడనీ, ఆయనకు సమానమైన రాజు కూడా లేడని చెప్పుచుండిరి. అలా చెప్పడమేకాక ప్రతి దినము ఏడుమార్లు గోటూరి గుడారంరాజును ప్రత్యేకముగా పొగడుచుండిరి. ప్రార్థనా మందిరములను పోలిన పొగడ్త మందిరములను నిర్మించుకొని గుడారంరాజును అందరూ కలిసి పొగడెడి వారు. వారి హృదయములలో గుడారం రాజును గొప్పగా ముద్రించు కొన్నారు. తమ కుటుంబములో పుట్టిన పిల్లలు కూడా గుడారంరాజు పాటనే పాడెడివారు. ఆయన భక్తులమనియే చెప్పెడివారు. గుడారం ఆకారముగల టోపీనే ధరించెడివారు. ఈ విధముగా గుడారం రాజు భక్తులుగా యున్నవారు మిగతా ప్రజలకంటే జీవన విధానములోగానీ, భక్తి విధానములోగానీ ప్రత్యేకత కల్గి బ్రతికెడివారు. ప్రత్యేక సమాజముగా తయారయిన గుడారంరాజు భక్తులు రాబోయే తరము వారు కూడా అదే భక్తి విధానము, అదే జీవన విధానము కల్గియుండాలని రెండు గ్రంథములను వ్రాసిపెట్టుకొన్నారు. భక్తి విధానము కల్గిన విషయములన్నీ ఒక గ్రంథముగా, జీవన విధానములు కల్గిన విషయములన్నీ ఒక గ్రంథముగా తయారు చేసుకొన్నారు.

కొన్ని వందల సంవత్సరములు గడచినా ప్రక్క దేశములోనున్న గోటూరి గుడారంరాజు సజీవముగానే ఉండెను. ఆయుష్షును పెంచు ఒక మూలిక ఆయనవద్ద ఉండుట వలన గుడారంరాజు ఆయుష్షు అయిపోయే ప్రసక్తే లేకుండా దినదినమునకు ఆయువు పెరుగుచుండెను. అందువలన అప్పటి కాలములో గుడారంరాజు ప్రత్యేకత కల్గియుండెను. గుడారంరాజు అందరివలెనుండు మనిషికాదనీ, ఆయన గొప్ప వ్యక్తి అనీ చెప్పెడి గుడారం టోపీ సమాజం మనుషులు ఎవరుగానీ, గుడారంరాజును చూచియుండలేదు. ఎన్ని సంవత్సరములు మారినా గుడారంరాజు ఒకే విధముగా ఉండెడివాడు. ఆయన భక్తులమని చెప్పుకొనువారు ఎందరో కాలక్రమములో పోగా క్రొత్తవారు చాలామంది వచ్చారు. కాలము గడువగా జీవన విధానము మీద గుడారంరాజు భక్తులు ఎక్కువగా శ్రద్ధచూపారు. అయితే భక్తి విధానము మీద ఎక్కువ శ్రద్ధ చూపలేకపోయారు. ఉన్న భక్తిని కోల్పోకుండా గుడారంరాజును గురించి గొప్పగా చెప్పుకొనెడివారు. ఇలా కాలము గడచుచుండగా ఒక దినము ఉన్నట్లుండి గుడారంరాజు ప్రక్క దేశములో తన భక్తులుగా చెప్పుకొనెడి వారి వద్దకు వచ్చాడు. గోటూరి గుడారంరాజు భక్తులమని చెప్పుకొను సమాజము యొక్క ప్రజల మధ్యలోనికి రాజుగారు వచ్చినా, ఆయన ముందరే ఆయనను పొగడు మనుషులు ఆయనను ఏమాత్రము గుర్తించలేదు, కనీసము పలకరించనూ లేదు. గోటూరు గుడారంరాజు ఎలా ఉండేది ఎవరికీ తెలియదు, కావున ఆయన ప్రత్యక్షముగా వచ్చినా ఎవరూ పలకరించలేదు.

గోటూరి గుడారంరాజు పేరును అందరూ చెప్పుచున్నా, ఆయనను అందరూ పొగడుచున్నా, ఆయన పేరుగల టోపీని ధరించి తమ భక్తిని చాటుకొనిచుండినా, గుడారంరాజు ప్రత్యక్షముగా ఇలా ఉంటాడు అను విషయము తెలియని దానివలన, ఆయన వారి మధ్యలో భక్తియున్నా,

గౌరవము లేకుండా పోయినది. ప్రతి దినము తన భర్తను పొగడే భార్యకు భర్తమీద భక్తి యున్నప్పటికీ భార్యకు చూపులేనందున, పూర్తి గ్రుడ్డిదియై నందున భర్త ఇంటికి వస్తే దొంగవచ్చాడని అనుకొని కట్టె విసిరిందట. అదే విధముగా గోటూరి గుడారంరాజు మీద ఎంతో భక్తి కల్గిన ప్రజలు ఆయనను ఎప్పుడూ చూడలేదు. ఆయన ఎట్లుంటాడు అను విషయము కూడా వారికి తెలియదు. కావున గుడారం రాజు తన సమాజ ప్రజల మధ్యలోనికి వచ్చినా, ఒక్కడు కూడా ఆయనను గౌరవించలేదు, పలకరించ లేదు. ఒక పూట భోజనమునకు కూడా తమ ఇంటికి పిలువలేదు. అప్పుడు ఆ రాజు గుడారం టోపీ ధరించిన ప్రజలను పిలిచి, తనను స్వయముగా పరిచయము చేసుకొని, నేనే మీరు పొగడుచున్న గుడారంరాజునని చెప్పాడట. అప్పుడు వారు "మా రాజును పోలిన రాజు భూమండలములో ఎవడూ లేడు. మా రాజును మించిన వాడుగానీ, మా రాజుతో సమానమైనవాడు గానీ లేనేలేడు." అని పొగడుచూ "నీవు ఎవడివో వచ్చి మా రాజువని చెప్పినంతమాత్రమున నీ మాటను నమ్మడానికి మేము తెలివి తక్కువ వారమా!" అని అన్నారు. అప్పుడు గుడారం రాజు వారి భక్తిని స్వయముగా చూచినా, తనను ఏమాత్రము గౌరవించని వారితో నాకేమి పని, వారి భక్తితో నాకేమి అవసరము అని అనుకొని, వీరు నావద్దకు వచ్చినా మీరు ఎవరో నాకు తెలియదు అని అంటానని అనుకొన్నాడట.

ఈ విధముగా గుడారం టోపీ సమాజము భక్తులందరూ గుడారం రాజు మీద భక్తియున్నా ఆయనను గుర్తించకపోవడము వలన, ఆయన మీద శ్రద్ధ, గౌరవము ఉన్నా ప్రత్యక్షముగా ఆయన వచ్చినా చూపకపోవడము వలన, గుడారంరాజు యొక్క కరుణను గుడారం సమాజము వారందరూ కోల్పోవలసి వచ్చినది. గుడారంరాజు తన పేరుతో వెలసిన సమాజమును

చూచి నన్ను గుర్తుపట్టని, నన్ను గౌరవించని వీరి భక్తి (విశ్వాసము)తో నాకేమి పని అనుకొని వారిమీద అశ్రద్ధ కల్గియుండెను. గుడారంరాజుకు గుడారం టోపీ సమాజము వారిమీద అయిష్టత ఏర్పడినది. గుడారంరాజు ఆయన పేరుమీదగల సమాజము వారితో నాకేమి పని? అని అనుకొన్నాడు. వారు నాకు ఉపయోగపడకపోతే నేనెందుకు వారికి ఉపయోగపడాలి? అని అనుకొన్నాడు. కొంతకాలమునకు ప్రక్క దేశములోని గుడారంరాజు వద్దకు గుడారం సమాజమువారు రాగా, రాజుగారు వారిని చూచి మీరెవరో నాకు తెలియదని చెప్పాడట! అంతేకాక గుడారం టోపీ ధరించిన వారు ఎవరుగానీ తనయొద్దకు రాకుండునట్లు తన అడ్రస్ ఇక్కడ లేదనీ, తన దగ్గరకు వచ్చే దారి ఇది కాదనీ, ఆ సమాజము ప్రజలకు తెలియజేసి వారు ఎవరూ తనవద్దకు రాకుండా పూర్తిగా దారి మళ్ళించాడు. ప్రక్క దేశములోని ప్రజలు గుడారం సమాజమును స్థాపించి గుడారంరాజును నిత్యము పొగడినా, ఆయన భక్తులుగాయున్నా, ఆయన ఎట్లుండునో తెలియక పోవడము వలన వారి విశ్వాసము, వారి భక్తి, వారి పొగడ్త, వారి ప్రార్థన అన్నీ గుడారంరాజు ఇష్టతను సంపాదించుకోలేకపోయాయి. నేనెవరో తెలియని వారి భక్తితో నాకేమి పని, నాకేమి అవసరము? అని ఆ రాజుగారు అనుకోవడము జరిగినది. గుడారంరాజు మీద విశ్వాసమున్నా ఆయన గుర్తింపు లేకపోవడము వలన గుడారం సమాజం వారు ఆయన కారుణ్యమును కోల్పోవడము జరిగినది.

ఖచ్చితముగా ఇదే పద్ధతే, ఇదే విశ్వాసమే, ఇదే భక్తియే కొందరిలో ఉండుట వలన దేవుడు కూడా నన్ను గుర్తించని వారి విశ్వాసముతో నాకేమి పని? అనుకొన్నాడు. దానివలన కొందరు ప్రజలు దేవునికి అయిష్టులుగా మారిపోయారు. అయిష్టులుగా మారిపోవడము వలన దేవుని

జ్ఞానము వారికి ఏమాత్రము తెలియకుండా పోయినది. దేవుడు దైవ గ్రంథమును ఇచ్చి అందులో తన నిజ భావమెట్లుండునో తెలిపినా, దాని ప్రకారము దేవుడున్నాడని తెలియక, ఆయనకు ఇష్టములేని అవసరములేని పొగడ్తలతో ముంచివేయుచున్నారు. అటువంటి వారిని గమనించిన దేవుడు వారికి తన జ్ఞానమును అర్థము కాకుండా చేసి, వేరు విధముగా అర్థమగు నట్లు చేసి తననుండి దూరముగా పంపుచున్నాడు. అట్లు దేవుని అయిష్టతకు లోనైనవారు దైవగ్రంథములోని జ్ఞానము యొక్క నిజ భావమును తెలియలేక దేవునికి దూరముగా పోవుచున్నారు. అట్లు అపమార్గము పట్టిపోవువారు, తమకు దేవుని జ్ఞానము సంపూర్ణముగా తెలియునని, తామే నిజముగా దేవునికి దగ్గరగా యున్నామని చెప్పుకొనుచున్నారు. దైవ గ్రంథములోని జ్ఞానము అర్థము కాలేదని వారికి తెలియదు. ఎవరయినా దైవగ్రంథము లోని వాక్యములకు నిజ భావమును తెల్పినా, వారిమీద దేవుని శాపముండుట వలన వారికి అది గ్రహింపునకు రాదు. వారి దృష్ఠిలో నిజమైన జ్ఞానము కూడా అజ్ఞానముగా కనిపించును. వారివద్దయున్న అజ్ఞానమే నిజమైన జ్ఞానముగా కనిపించును. అందువలన ఎంతో పెద్ద జ్ఞానులను సహితము వారు ఎదిరించి మాట్లాడుచుందురు. తమదే జ్ఞానమనీ, ఇతరులది అజ్ఞానమనీ, తామే దేవునికి దగ్గరగా యున్నవారమని అనుకొనుచుందురు.

**వారి ప్రశ్న :- మీరు చెప్పినట్లు ఇటువంటి అజ్ఞానము అన్ని మతములలో ప్రాకినది. అన్ని సమాజములు తమ జ్ఞానమే గొప్పయని ఒకరికొకరు వాదించుకోవడము ప్రత్యక్షముగా కనిపించుచున్నది. మూడు సమాజముల వారు అజ్ఞానములో కూరుకపోయి ఉన్నారు. ఒకరిని తక్కువ ఇంకొకరిని ఎక్కువ అని చెప్పటకు వీలులేదు. దైవజ్ఞానములో ఏమాత్రము విచక్షణ లేని మనుషులు తమవద్దగలది అజ్ఞానమని ఏమాత్రము గుర్తించక, ఇతర**

**మతముల వారిమీద అసూయతో, ఆక్రోశముతో చూస్తున్నారు. ఒకరికొకరు వ్యతిరేఖ భావములతో చూచుకొంటూ శత్రువులుగా మారిపోవుచున్నారు. ఎక్కడలేని శత్రుత్వము దేవుని విషయములందే ఎక్కువగా యున్నదని అర్థమగుచున్నది. ఇటువంటి పరిస్థితినుండి మనుషులు బయట పడుటకు ఏదయినా ఉపాయము గలదేమో చెప్పండి?**

**మా మాట :- జ్ఞాన విషయములన్నిటినీ తౌరాత్ గ్రంథము (భగవద్గీత) నుండి పరిష్కారము చేసుకొనెడివారని** అంతిమ దైవగ్రంథములో సూరా 5, ఆయత్ 44లో చెప్పడము జరిగినది. జ్ఞానవాక్యముల ద్వారా తృప్తి చెందేవారికయితే దైవగ్రంథమునుండి పరిష్కారము చేయవచ్చును. నాకు తెలిసిందే జ్ఞానము మీకు తెలిసినదంతా అజ్ఞానమనువారికి ఎవరూ ఏమీ చెప్పలేరు. వారికి దైవగ్రంథములు కూడా ఏ పరిష్కారము చేయలేవు. దేవుడు కూడా వారిని మార్చలేడు. దేవుడు అనుకొంటే ఏదయినా సాధ్యమే అయినా దేవుడు వారిని మార్చడు. ఎందుకనగా! దేవుడే వారిని అజ్ఞాన మార్గములో పోవునట్లు నిర్ణయము చేసియుండును. ఒకమారు దేవుని నిర్ణయమైన తర్వాత అది ప్రకృతి చేతిలోనికి వెళ్ళిపోవును. అప్పుడు **ప్రకృతి దేవుని ఆజ్ఞను అనుసరించి దేవునికి ఇష్టము లేనివారిని దేవుని వైపు పోకుండా చేసి తనవైపు వచ్చునట్లు చేయును.**

ఒక్కమారు దేవునికి అయిష్టుడయినవాడు ప్రకృతినుండి పుట్టి మానవ శరీరములో గుణరూపముగాయున్న మాయ చేతిలో పడిపోవును. ఒక్కమారు మాయచేతిలో పడినవాడు తిరిగి బయటపడుట దుస్సాధ్యము. అందువలన దేవుడు తన మాయను గురించి చెప్పుచూ, ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో విజ్ఞానయోగమునందు 14వ శ్లోకమున **"దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" 'నా మాయ దుస్సాధ్యమయినది, దానిని ఎవరూ**

**జయించలేరు'** అని అన్నాడు. అటువంటి దుస్సాధ్యమయిన మాయ చేతిలో పడినవానిని మాయ తన గుణములలో ముంచి గుణముల ధ్యాసలోనే మాట్లాడునట్లు చేయును. గుణమయమయిన వానికి దేవుని జ్ఞానము వంటబట్టదు. అతని మెదడులో అంతా ప్రకృతి జ్ఞానమే నిండిపోయి వుండును. ప్రకృతి స్థూలమైనది, పరమాత్మ అనబడు దేవుడు సూక్ష్మమైనవాడు. మాయచేతిలో పడినవానికి దేవుని సూక్ష్మమైన జ్ఞానము అర్థముకాదు. స్థూలమైన జ్ఞానమే అర్థమగును. స్థూలమైన జ్ఞానమే నిజమైన జ్ఞానమని, సూక్ష్మమైన జ్ఞానము అసత్యజ్ఞానమని అనుచుందురు. దేవుడు సూక్ష్మమైన వాడు, దేవుని జ్ఞానము సూక్ష్మముగానే ఉండుననే సూత్రమును మాయ ఆధీనములో వుండువారు మరచిపోయి వుందురు. అందువలన వారు స్థూల జ్ఞానమును గురించే మాట్లాడుచుందురు. వారికి దైవగ్రంథముల లోని సూక్ష్మవాక్యముల జ్ఞానము అర్థము కాదు. దానివలన వారు దేవుని జ్ఞానమును వదలి ప్రక్కదారిలో పోవువారిగా మారిపోవుదురు. అటువంటి స్థితినుండి వారిని ఎవరూ మార్చలేరు. మాయ ఆధీనములో పడినవారు తిరిగి బయటపడుట దుస్సాధ్యమైన పనియగును. దేవునికి అయిష్టునిగా మారినవానిని మాయ తన ఆధీనములో యుంచుకొని తన ప్రభావము వలన జ్ఞానమును అర్థము కాకుండా చేయును. అందువలన దేవుడు అనుకున్నట్లు వారు దేవునికి దూరముగా పోవుచుందురు. అటువంటి వారిని భూమిమీద ఎవరూ మార్చలేరు.

**వారి ప్రశ్న :- మాయ ప్రభావములో చిక్కుకొని దేవునికి వ్యతిరిక్త దిశలో యుండి కూడా మేము సక్రమముగా ఉన్నామనుకొనువారు మూడు సమాజములలో యున్నారని మీరు చెప్పచున్నారు. హిందూ సమాజములో యున్నవారు సూక్ష్మముగా కనిపించకయున్న దేవున్ని వదలి స్థూలమైన విగ్రహారాధనలో**

**పడిపోవుచున్నారు. వారికి సూక్ష్మమైన కనిపించని దేవుడు ఒకడు ప్రత్యేకముగా యున్నాడను విషయమే తెలియదు. మిగతావారు సూక్ష్మమైన దేవుడున్నాడని చెప్పచున్నా వారు స్థూలమైన జ్ఞానమును ఆశ్రయించి సూక్ష్మమైన జ్ఞానమును వదలివేశారు. వీరి ఇరువురిలో ఎవరు ఉత్తములు?**

**మా జవాబు :–** ఇద్దరు మనుషులలో ఒకడు ముఖము మీద గుడ్డను కప్పుకొన్నాడు, మరొకడు కాగితమును మూసుకొన్నాడు. వారి ఇరువురిలో ఎవరి ముఖము కనిపించును అని అడిగితే గుడ్డతో మూసుకొన్నా, కాగితముతో కప్పుకొన్నా రెండూ ముఖమును కనిపించకుండా చేయుచున్నవి. అందువలన ఇద్దరి ముఖములు కనిపించవనియే చెప్పాలి. వారు ఇరువురు వేరువేరు విధముల ముఖమును చాటేసుకొన్నవారేయగుదురు. అదే విధముగా మూడు సమాజములలోని మనుజులు హిందువులు స్థూల ఆకారము మీద ఆధారపడి సూక్ష్మమును మరచిపోయారు. అలాగే మిగతా సమాజముల వారు స్థూల జ్ఞానము మీద ఆధారపడి సూక్ష్మ జ్ఞానమును వదలివేశారు. ఇరువురు స్థూలమునే ఆశ్రయించి సూక్ష్మమును వదలి వేయడము వలన ఇరువురు ఒకటే కోవకు చెందినవారగుదురు, కావున వారి ఇరువురిది తప్పుదారే యగును. ఇరువురి మార్గము స్థూలము వైపు పోవుట వలన, సూక్ష్మము తెలియకపోవుట వలన ఇరువురు అసలు దారి తప్పినవారేయగుదురు.

హిందూ సమాజము వారిని స్థూలమైన విగ్రహారాధన చేస్తున్నారనీ వారికి దేవుని జ్ఞానము తెలియదనీ మిగతా సమాజముల వారు అనుచుండగా, మేము మిగతా సమాజము వారిని ఈ విధముగా ప్రశ్నించు చున్నాము. మీరు వారికంటే దేనిలో గొప్ప?యని అడుగుచున్నాము. వారు స్థూలమైన విగ్రహమును ఆరాధించి సూక్ష్మమైన జ్ఞానమును

తెలియనట్లు, మీరు కూడా స్థూలమైన జ్ఞానమును ఆశ్రయించి సూక్ష్మమైన జ్ఞానమును వదలివేసినారు కదా! హిందువులు కనిపించే స్థూలమైన ఆకారమును ఆరాధిస్తే, మిగతా వారు కూడా ఇంకొక విధముగా కనిపించే స్థూలమైన జ్ఞానమును ఆరాధించి పరోక్షముగా తప్పుదారి పట్టినట్లే కదా! ముఖము మీద గుడ్డవేసుకొన్నా, కాగితము వేసుకొన్నా ఇరువురు ప్రత్యక్షముగా ముఖమును మూసుకొన్నట్లేయగును. అలాగే దేవుని విషయములో విగ్రహారాధన లేక దేవతారాధన అను స్థూల ఆరాధన చేసినా, స్థూలమైన జ్ఞానమును ఆశ్రయించినా, ఇరువురు సూక్ష్మమైన జ్ఞానమును వదలివేసి స్థూలమైన జ్ఞానమును ఆశ్రయించినట్లే కదా! కనిపించే స్థూల జ్ఞానమును ఆశ్రయించినా, కనిపించే స్థూల ఆకారమును ఆశ్రయించినా ఇరువురు వేరువేరు విధముల సూక్ష్మజ్ఞానమును వదలినవారే యగుచున్నారు. వీరు ఇరువురు ఒకేస్థాయి తప్పు చేసినవారగుదురు, అంతేగానీ ఒకరు ఉత్తములని మరొకరు ఉత్తములు కాదని చెప్పలేము. గుహలో దూరియుండు వాడుగానీ, బయలు ప్రాంతములో నీడయందు ఉన్నవాడుగానీ ఇరువురు సూర్యరశ్మి అంటకయుండువారేననీ, ఇద్దరూ నీడలో యుండువారేనని ఎట్లు చెప్పవచ్చునో, అలాగే స్థూల ఆకారమును ఆశ్రయించిన వాడుగానీ, స్థూల జ్ఞానమును ఆశ్రయించినవాడు గానీ, ఇద్దరూ సూక్ష్మమునకు దూరముగా యున్నవారేనని, సూక్ష్మమును తెలియనివారేనని చెప్పవచ్చును. ఒక రకముగా ఇరువురు విగ్రహారాధకులనే చెప్పవచ్చును.

**వారి ప్రశ్న :- ఇక్కడ మీరు మమ్ములను సంశయానికి గురిచేయుచున్నారు. ప్రత్యక్షముగా కనిపించు రూపమున్న దానిని విగ్రహము అంటున్నాము. జ్ఞానము అలాంటిది కాదు కదా! జ్ఞానమునకు కనిపించే ఆకారము లేదు. జ్ఞానము మాటల రూపమైనది. జ్ఞానము శబ్దరూపమైనది, శబ్దమునకు**

**ఆకారములేదు. అటువంటప్పుడు మాటల రూపమైన జ్ఞానమును కూడా కనిపించే విగ్రహము క్రిందికే జమకట్టడము సరియైనదేనని మీరు చెప్పగలరా?**

**మా జవాబు :-** జ్ఞానము అనునది మాటల రూపములో శబ్దముగాయున్నా, వినిపించే ఆ శబ్దములోని సారాంశము స్థూలమైనదిగా ఒకరకము, సూక్ష్మ మైనది మరొక రకము గలదు. అందువలన శబ్దరూపమైన జ్ఞానమును రెండు రకములుగా పెద్దలు విభజించి ఒకదానిని స్థూలజ్ఞానమనీ, రెండవ దానిని సూక్ష్మ జ్ఞానమనీ అన్నారు. జ్ఞానములో రెండు రకముల జ్ఞానములున్నవని వాటిలో ఒక దానిని స్థూల జ్ఞానమని, మరొక దానిని సూక్ష్మజ్ఞానమని అంటారని అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లోనూ ప్రథమ దైవగ్రంథమైన భగవద్గీతలోనూ చెప్పడమయినది. భగవద్గీతయందు రాజవిద్యా రాజగుహ్యాయోగమను అధ్యాయమున మొదటి ఒకటి, రెండు శ్లోకములలో ఈ విషయము చెప్పగా, పూర్తి అర్థమగునట్లు ఖురాన్ గ్రంథములో 'అలీ ఇమ్రాన్' అను మూడవ సూరాయందు ఏడవ ఆయత్‌లో కూడా చెప్పారు. **(3-7) "ఓ ప్రవక్తా! నీపై ఈ గ్రంథమును అవతరింపజేసిన వాడు దేవుడే. ఇందులో సుస్పష్టముగా అర్థము తెలియు స్థూలమైన (ముహ్కమాత్) వాక్యములు గలవు. అవి గ్రంథానికి పునాదిలాంటివి. మరికొన్ని అస్పష్టముగా అర్థమునిచ్చు సూక్ష్మమైన (ముతషాబిహాత్) వాక్యములు గలవు."** అని చెప్పడము వలన బ్రహ్మవిద్యా శాస్త్రబద్ధముగా జ్ఞానము రెండురకములనీ, ఒకటి స్థూలజ్ఞానము, రెండు సూక్ష్మజ్ఞానమనీ తెలిసిపోయినది.

ఇక్కడ ముఖ్యముగా మన బుద్ధిని ఉపయోగించి తెలియవలసిన విషయమేమనగా! మాటల రూపమైన జ్ఞానము ఏ విధముగా స్థూల, సూక్ష్మములుగాయున్నదో అలాగే! దృశ్యరూపములోయున్న బొమ్మలలో కూడా స్థూలము యున్నది, సూక్ష్మము యున్నది. ఏ విధముగా శబ్దరూప

జ్ఞానములలో స్థూలజ్ఞానము ప్రపంచ సంబంధమైనది (ప్రకృతి సంబంధ మైనది) సూక్ష్మజ్ఞానము దైవసంబంధమైనదని చెప్పుచున్నామో, అలాగే దృశ్యరూప ఆరాధన జ్ఞానములలో స్థూలజ్ఞానము, సూక్ష్మజ్ఞానము అని రెండు రకముల జ్ఞానములు గలవు. దృశ్యరూప ఆరాధన జ్ఞానములలో స్థూల రూపమైనది ప్రకృతి (ప్రపంచ) సంబంధమైన జ్ఞానముతో కూడుకొన్నదై ఉండగా, సూక్ష్మ రూపమైనది దైవసంబంధ జ్ఞానముతో కూడుకొనియున్నది.

మనిషి శబ్ద, రూప, స్పర్శ, రుచి, వాసన అను జ్ఞానములను తన పంచేంద్రియములయిన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మముల ద్వారా గ్రహించుచున్నాడు. మనిషి గ్రహించు ఐదు జ్ఞానములను ప్రపంచ జ్ఞానములు అంటాము. ఐదు ప్రపంచ జ్ఞానములు స్థూలమైనవేయగును. స్థూలమైన ఐదు ప్రపంచ జ్ఞానములను గ్రహించు ఐదు అవయవములు శరీరమునకు తగులుకొనియుండి జ్ఞానేంద్రియములని పేరుగాంచినవి. మనిషి శరీరములో ఐదు జ్ఞానేంద్రియములు కలవని అజ్ఞానికి కూడా తెలుసు. మనిషికి ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా తెలియబడేది ప్రపంచ జ్ఞానమే అయినా, స్థూలజ్ఞానమే అయినా అందులో దైవజ్ఞానము కూడా ఇమిడి యున్నది. వివరముగా తెలియగలిగితే జ్ఞానము రెండు రకములు గలదు. ఒకటి ప్రపంచ జ్ఞానము, రెండు పరమాత్మ జ్ఞానము అనగా దైవ జ్ఞానము. ప్రపంచ జ్ఞానమునుండే పరమాత్మ జ్ఞానమును కూడా తెలియ వలెను. శబ్ద, దృశ్యములు రెండూ ప్రపంచ జ్ఞానములే. చెవి, కన్ను ద్వారా తెలియబడు జ్ఞానములే. అయినప్పటికీ ఈ రెండింటిలో పరమాత్మ జ్ఞానము ఇమిడియున్నది. దృశ్యరూపములో ఆకృతి (ఆకారము) వుండగా, ఆకృతిలో నిరాకారమైన దైవము గలదు. అలాగే సాకారమైన విగ్రహము గలదు. కంటితో చూస్తే దృశ్యరూపములో ఒక బొమ్మ కనిపించిందనుకొనుము.

బొమ్మ ప్రాణమున్నది కావచ్చును, ప్రాణములేనిది కావచ్చును. ఉదాహరణకు నాకు మనిషి ఆకారము కనిపించినదనుకొనుము. నా స్నేహితుడు 'నారాయణ' అను వ్యక్తి కనిపించాడనుకొనుము. అప్పుడు అది నాకు దృశ్యమేయగును. ఆ దృశ్యము ఒక మనిషి ఆకారములో యున్నా, అందులో మనము సులభముగా ఫలానా వ్యక్తి అని తెలియు చున్నాము. ఆ వ్యక్తి ఏ విషయమునైనా గ్రహించుశక్తి కల్గియున్నాడు. కావున గ్రహించు శక్తిగలవానిని **'గ్రహము'** అని అనవచ్చును. కనిపించే వ్యక్తి నాకు స్నేహితుడే అయివుండవచ్చును. అతని పేరు కూడా నాకు తెలిసియుండవచ్చును. అయినా అతను నేను చెప్పు మాటను, చూపు దృశ్యమును గ్రహించు స్థోమతకలవాడు అయినందున అతనిని 'గ్రహము' అనవచ్చును. గ్రహించునది ఏదయినా, ఎవరయినా 'గ్రహము' అని చెప్ప వచ్చును.

ప్రాణమున్న ఆకారములో గ్రహించుశక్తి కలదు, కావున దానిని 'గ్రహము' అని అంటున్నాము. అలాగే ప్రాణములేని ఆకారములో గ్రహించుకొను శక్తియుండదు. అందువలన దానిని గ్రహము అనుటకు వీలులేదు. అయితే నేడు చాలామంది హిందువులు ఏదో ఒక బొమ్మను పెట్టుకొని, ఆ బొమ్మకు ఒక పేరుపెట్టి, అది తమ ఆరాధ్యదైవమని నమ్మి పూజలు చేయుచున్నాడు. ఈ విధముగా ఎందరో ఎన్నో ఆకారములను పెట్టుకొని పూజించుచున్నారు. అటువంటి పూజలను ఆకారపూజ అని అంటున్నాము. ఇటువంటి పూజలను ముస్లీమ్‌లు పూర్తి వ్యతిరేఖిస్తున్నారు. దేవుని స్థానములో ఇతర దేవతలను పెట్టి పూజిస్తున్నారని ఆరోపణ చేయు చున్నారు. ఎక్కడ ఏ బొమ్మను పూజించినా దానిని విగ్రహ పూజ అంటున్నారు. వారు తెలిసి చెప్పినా, తెలియక చెప్పినా దానిని విగ్రహ పూజ అని మేము ఒప్పుకొంటున్నాము. మేము మొదటినుండి విగ్రహారాధ

నను ఖండించుచున్నాము. అయినప్పటికీ ఎంతో వివరము జ్ఞానము తెలిసిన మమ్ములను కూడా విగ్రహారాధన చేయువారిలోనికి కలిపి కొందరు మమ్ములను విగ్రహారాధకులు అని అంటున్నారు.

**వారి ప్రశ్న:- మీరు శ్రీకృష్ణుని ఆకారమును 'ప్రతిమ' అంటున్నారు. మీరు ఎక్కడ ఏ పూజ చేయకున్నా మీ అనుచరులందరూ కృష్ణున్ని దేవుడని పూజించుచున్నారు. కృష్ణాష్టమి సమయములో కృష్ణ పూజలు చేసి కృష్ణ ప్రతిమను భారీగా ఊరేగింపు చేయుచున్నారు. మీరు దానిని సమర్థించు చున్నారు. అంతేకాక మీ సలహామీదనే అందరూ కృష్ణాష్టమి చేయుచున్నట్లు మేము వింటున్నాము. కృష్ణున్ని 'ప్రతిమ' అని విగ్రహము కాదని మీరు అంటున్నారు. కృష్ణుని ఆకారమును భగవంతుని ప్రతిరూపము అంటున్నారు. భగవంతుడు దేవుని మారువేషము అంటున్నారు. దానినే భగవంతుని ఆకారము అనికూడా అంటున్నారు. 'దేవుడు భగవంతునిగా కనిపించే మనిషిగా వచ్చి తన జ్ఞానమును చెప్పిపోవును' అని చెప్పుచున్నారు. మీరు కృష్ణుని ఆకారమును పూజించుటను సమర్థించుచున్నారు కదా! దానివలన మీరు విగ్రహారాధనను ప్రోత్సహించినట్లే కదా!యని ఇతరులు మిమ్ములను అడిగితే మేము విగ్రహారాధన చేయలేదు, ప్రతిమారాధన మాత్రము చేయుచున్నాము అని అంటున్నారు. ప్రతిమ అయినా విగ్రహమయినా మనుషులు చేసిన ఆకారమే కదా! మనుషులు తయారు చేసిన దానిని దేవునిగా చెప్పవచ్చునా? దేవుని స్థానములో వుంచి పూజించవచ్చునా?యని ముస్లీమ్‌లుగా యున్నవారు ప్రశ్నించుచున్నారు. దీనికి మీరు ఏమి సమాధానమును చెప్పగలరు? ప్రతిమారాధన విగ్రహారాధన కాదా!యని అడుగు ప్రశ్నకు ఏమి జవాబు చెప్పగలరు?**

**మా జవాబు :-** శాస్త్రాధారము లేనిది, ప్రత్యక్ష నిరూపణకు రాని దానిని

మేము ఎప్పుడూ చెప్పము. **మేము ఏది చెప్పినా అది శాస్త్రాధారమై, సత్య నిరూపణమై ఉండును.** ప్రతిమ ఆరాధన వేరు, విగ్రహ ఆరాధన వేరని చెప్పుచున్నాము. ఈ మాట కొందరికి విచిత్రముగా, ఆశ్చర్యముగా కనిపించినా ఎటు చూచినా ప్రతిమ వేరు, విగ్రహము వేరుగా ఉన్నవి. మీకు అర్థమగుటకు కావలసిన వివరమును మేము అందివ్వగలము. ఇంతకుముందు ఒక ఆకారము గ్రహించునదిగా ఉంటే గ్రహము అంటామని చెప్పాము. ఆకారమునకు ప్రాణమున్నప్పుడు గ్రహించుకొను శక్తియుండును కనుక ఆకారమును గ్రహము అని చెప్పుచున్నాము. ఒకవేళ ఆకారము ప్రాణము లేనిదైతే అందులో గ్రహించుకొను శక్తియుండదు. అప్పుడు దానిని గ్రహము అనుటకు వీలులేదు. ప్రాణములేని ఆ బొమ్మ ఎవరి ఆకారమును పోలియుంటే వారియొక్క ప్రతిమ అని చెప్పవచ్చును. ప్రతిమ అనగా ప్రతిరూపము అని చెప్పవచ్చును. ప్రాణములేని ఆకారము వాస్తవముగా ప్రతిమయే అగును. ప్రాణమున్నదంతా సత్యముగా గ్రహమే అగును. గ్రహములలో కొంత ప్రత్యేక శక్తియున్న వాటిని విగ్రహము అంటున్నాము. విగ్రహ అనగా గ్రహమువలెకాక కొంత ప్రత్యేకతను కల్గియున్న దానిని విగ్రహము అని చెప్పవచ్చును.

**వారి ప్రశ్న :- ప్రాణము లేని బొమ్మలను అందరూ విగ్రహ అని అంటున్నారు కదా! మీరేమో ప్రాణమున్న వాటినే గ్రహలనిగానీ, విగ్రహలనిగానీ అనవచ్చునన్నారు. ప్రాణము లేని వాటిని 'ప్రతిమ' అని అది విగ్రహము కాదని అంటున్నారు. అలాంటప్పుడు ప్రాణములేని ప్రతిమలను విగ్రహములని చాలామంది ఎందుకంటున్నారు?**

**మా జవాబు :-** నేను ఆ విషయమునే చెప్పుచున్నాను. అంతలోనే మీరు ప్రశ్న అడిగారు. మీ ప్రశ్నకు జవాబును చెప్పెదను వినండి. మనుషులకు స్థూలదృష్టి మాత్రమే గలదు. స్థూలదృష్టితో స్థూలదృశ్యము కనిపించినా,

దృశ్యరూపములో తెలిసిన జ్ఞానములో స్థూల జ్ఞానము, సూక్ష్మ జ్ఞానము రెండు రకముల జ్ఞానము కలదని ముందే చెప్పాను. ఒక వ్యక్తి ఆకారమును చూచినప్పుడు ఆకారములోని కదలికలనుబట్టి అతను ప్రాణమున్న వ్యక్తి యని స్థూల జ్ఞానము ద్వారా నిర్ధారించి, అతని శరీరములో గ్రహము కలదని చెప్పుచున్నాము. అతని శరీరములో అతనే గ్రహముగా ఉన్నాడు. గ్రహించుశక్తి గలవానిని 'గ్రహము' అని అంటున్నామని ముందే చెప్పాము. ఆ లెక్కప్రకారము మనము అందరము ప్రతిదానిని గ్రహించువారమే. వినేదానిని గ్రహించుచున్నాము. చూచేదానిని గ్రహించుచున్నాము అందువలన ప్రాణమున్న, జీవమున్న ప్రతి వ్యక్తి గ్రహమేయగును. అయితే ఇక్కడ వచ్చిన సమస్య ప్రాణములేని ఒక రాతి ప్రతిమను విగ్రహ అని ఎందుకంటున్నారన్నదే ప్రశ్న, దానికి జవాబును గ్రహించిన ఇలా కలదు. గ్రహముకంటే విగ్రహము కొంత ప్రత్యేకత కల్గియుండునని కూడా చెప్పు కొన్నాము. మొదటికి ప్రాణములేని రాతిబొమ్మలో విగ్రహ ఎలా ఉండునని, ప్రాణమున్న దానిలో గ్రహమో లేక విగ్రహమో ఉందంటే దానికి అర్థము గలదు. ప్రాణమే లేని దానిలో విగ్రహ ఉందంటే ఎలా నమ్మాలి? అది పూర్తి అసత్యము కాదా? అని కొందరు ప్రశ్నించవచ్చును. ఇది సహజముగా అందరికీ వచ్చు సంశయమే! ఈ సంశయమును పరిష్కరించుకొనుటకు స్థూల, సూక్ష్మ జ్ఞానముల వద్దకు పోయి చూస్తాము.

మనిషికున్న ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా బయటి జ్ఞానమును తెలియవచ్చును. జ్ఞానేంద్రియములయిన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అను ఐదు ఇంద్రియములు స్థూల అవయవములే అగుట వలన వాటి వలన స్థూల జ్ఞానమే తెలియును. అయినా కన్ను, చెవి ద్వారా తెలియు రెండు జ్ఞానములలో సూక్ష్మజ్ఞానము కూడా ఇమిడియున్నది. కన్నుతో

చూచు దృశ్యములో మనిషి గ్రహమని స్థూలదృష్ఠి ద్వారా తెలియవచ్చును. అయితే కన్ను చూచిన దృష్ఠిలో సూక్ష్మజ్ఞానము కూడా ఉండుట వలన, ఒక ఆకారములో ప్రాణమున్నది, ప్రాణము లేనిది గ్రహించవచ్చును. దీనినిబట్టి కన్ను, చెవుకు బాహ్య ప్రపంచ దృష్ఠే కాకుండా, అంతరంగ దైవ దృష్ఠి కూడా కలదని చెప్పవచ్చును. చెవుకు వినే మాటలోని బాహ్య అర్థమునే కాకుండా అంతరంగ ఆత్మజ్ఞానమును తెలియుశక్తి (గ్రహించు శక్తి) కలదని చెప్పవచ్చును. ప్రాణమున్న ఆకారమును చూచినప్పుడు అందులో గ్రహమున్నదని చెప్పుట స్థూలదృష్ఠికాగా, రాతిబొమ్మను చూచినప్పుడు అంతరంగ జ్ఞానము ప్రకారము అనగా సూక్ష్మ దృష్ఠి ప్రకారము రాతిబొమ్మలో ప్రాణమున్నదో లేదో చెప్పవచ్చును. అలా తెలియు సూక్ష్మ జ్ఞానమునే ఆధ్యాత్మిక జ్ఞానము అని కూడా అనవచ్చును. ఆధ్యాత్మిక జ్ఞానము తెలిసినవారు ఏ బొమ్మలో ఏ శక్తిగలదో, ఎంత గ్రహించు శక్తికలదో తెలియ గలరు. రాతిబొమ్మలలో కూడా జీవుడున్నాడని తెలిసినప్పుడు అలా ఉన్న వానిని విగ్రహ అంటాము. తోలుబొమ్మలో జీవుడుంటే వానిని గ్రహ అంటాము. అలాగే రాతిబొమ్మలో జీవుడుంటే వానిని విగ్రహ అంటాము. ఎక్కడయినా బొమ్మయుండి అందులో జీవుడు లేకపోతే ఆ బొమ్మను ప్రత్యేకించి 'ప్రతిమ' అంటాము. **ప్రతిరూపము కల్గినది ప్రతిమ** అని చెప్పవచ్చును. కృష్ణుని బొమ్మలో ఎక్కడయినాగానీ జీవుడు ఉండడు. అందువలన కృష్ణుని బొమ్మను ప్రతిమ అనవలెను. విగ్రహ అని పేరుపెట్టి చెప్పకూడదు. అలాగే జీవుడున్న ఏ ఆకారమునయినా విగ్రహమే అని అనాలిగానీ 'ప్రతిమ' అని అనకూడదు.

ఈశ్వర లింగమును చాలామంది చూచియుందుము. ఈశ్వర లింగములో ఎక్కడగానీ జీవుడు వుండడు. అందువలన ఈశ్వర లింగమును

కూడా 'ఈశ్వర ప్రతిమ' అని అనవచ్చును. సృష్ఠికర్త అయిన దేవునికి ప్రతి రూపముగాయున్న ఏ బొమ్మలో కూడా జీవుడుండడు. అందువలన ఆ బొమ్మలు ప్రతిమలేగానీ విగ్రహములు కాదు. అట్లని మన ఇష్టమొచ్చిన బొమ్మను దేవుని ప్రతిరూపముగా చెప్పుకొనుటకు వీలులేదు. గతచరిత్రలో ఎప్పుడయినా దేవుడు ఆ రూపములో ఉండివుంటే, ఆ ఆకారము మాత్రము ప్రతిమ అగుటకు అవకాశము గలదు. మిగతా ఏ ఆకారమందైనా జీవుడుండును. కావున ఆకార బొమ్మలన్నీ విగ్రహములే అగుచున్నవి. ప్రత్యేకించి ఒక కృష్ణుని ఆకారములో మాత్రము ఏ జీవుడు చేరుటకు అవకాశము లేదు. అందువలన కృష్ణుని ఆకారమును మాత్రమే ప్రతిమ అంటున్నాము. కృష్ణుని ఆకారమును ఒక్కదానిని మేము గౌరవించు చున్నాము. అంతతప్ప భూమిమీద ఏ ఆకారమును మేము ఆశ్రయించలేదు. దేవుడు భగవంతునిగా వచ్చిన ఆకారమయినందున కృష్ణుని బొమ్మ మాత్రము ప్రతిమగా గలదు. ఆ విషయమును తెలిసినందున మేము కృష్ణప్రతిమను గౌరవించడము జరుగుచున్నది. మేము గ్రుడ్డిగా ఏదీ చేయలేదు. భూమిమీద ఎన్నో బొమ్మలను విగ్రహములనుటకు, కృష్ణుని బొమ్మను ప్రతిమ అనుటకు మా దగ్గర పూర్తి శాస్త్రబద్ధమైన ఆధారమున్నది. ఈ వివరమంతయూ వారికి తెలియదు కావున ముస్లీమ్‌లు మమ్ములను కూడా విగ్రహారాధకుల లోనికి కలిపి చెప్పియుండవచ్చును. వారికి తెలిసినది వారన్నారు, అంతమాత్రమున దానిని ఎందుకు పట్టించుకోవాలి? మేము ఎవరయినదీ, మేము ఎవరిని ఆరాధించునదీ మాకు తెలుసు కదా! మేము అసలయిన దేవున్నే ఆశ్రయించినప్పుడు, చిల్లర దేవుళ్ళను ఆశ్రయించనప్పుడు, విగ్రహారాధన చేయనప్పుడు మేమెందుకు ఉలిక్కిపడాలి?

ప్రతిమనయినా, విగ్రహమునయినా మనుషులు తయారు చేసివుంటే తయారయిన ఆకారములే కదా! అటువంటప్పుడు అవి దేవునితో సమాన

మగునాయని కొందరడుగడమును మేము కూడా వినియున్నాము. మనుషులు తయారు చేసినంతమాత్రమున వాటిని తక్కువగా చూడకూడదు. ఒక బొమ్మలో యున్న శక్తిని తీసివేయనూలేము, అట్లే లేనిశక్తిని నింపనూ లేము. ఆ మాటకు వస్తే నేడు మనముందరున్న మూడు దైవ గ్రంథములను మనుషులు అచ్చువేసి గ్రంథములుగా తయారు చేశారు. వాటిని మనుషులు చేసిన గ్రంథములని, వాటిలో శక్తిలేదని చెప్పగలమా! ఆ గ్రంథములలో దైవశక్తి నిండియున్నది. అయితే ఆ శక్తిని గ్రంథమును తయారు చేసిన మనుషులు నింపలేదు కదా! మనిషి ద్వారా దేవుడే అన్నిటినీ సృష్ఠించు చున్నాడు. దేవుడు దేనియందు ఏ శక్తిని నింపియున్నాడో మనకు తెలియదు. అందువలన మనిషి చేత తయారయిన ప్రతిమయందు దైవశక్తి కలదనియే చెప్పవచ్చును.

**'దేవుడు భూమిమీద అవతరిస్తాడని'** ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో జ్ఞానయోగమందు ఆరవ శ్లోకమున, రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయమందు పదకొండవ శ్లోకములోనూ చెప్పడమైనది. అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో సూరా 89లో, ఆయత్ 22యందు కూడా దేవుడు అవతరిస్తాడని చెప్పియున్నాడు. అంతేకాక సూరా 15లో ఆయత్ 29లో **(15-29) "నేను మట్టితో బొమ్మను చేసి అందులోనికి నా ఆత్మనే ఊది భూమిమీదికి పంపుచున్నాను. నేను నా ఆత్మను ఊది పంపిన వ్యక్తిని చూచి దేవదూతలందరూ సాష్టాంగ నమస్కారము చేయుదురు. మీరు కూడా సాష్టాంగ నమస్కారము చేయండి"** అని దేవుడే చెప్పియుండగా, ఆ మాటను గ్రహించని మనుషులు, దేవుడు తన ఆత్మగా పంపిన వాడు ఎవడో తెలియని మనుషులు, వచ్చిన వానికి నమస్కరించడము లేదు. దేవుడు తన ఆత్మను ఊది పంపునని చెప్పినప్పుడు,

తన ప్రతినిధిని పంపుననేగా అర్థము. అయినా కొందరు మేము మనిషిగా వచ్చిన ఎవరికీ మ్రొక్కము అని ఖురాన్ వాక్యమునే ఎదిరించి మాట్లాడు చున్నారు. దేవుడు తన ప్రతినిధిగా పంపిన వానినే మేము **భగవంతుడు** అని అంటున్నాము. అటువంటి అవతారముగా వచ్చినవాడే **కృష్ణుడు.** అందువలన కృష్ణుని ఆకారమును ప్రతిమ అని అంటున్నాము. దేవుని ప్రతినిధిగా వచ్చి, దేవుని జ్ఞానమును చెప్పిపోయిన వ్యక్తి విగ్రహము కాదు. ఆయన దేవుని ప్రతి రూపముగా వచ్చినవాడు అయినందున దేవుని ప్రతిరూపమును 'ప్రతిమ' అంటున్నాము. దేవుడు అంతిమ దైవగ్రంథములో 42వ సూరా 51వ ఆయత్‌నందు **"నేను మూడు విధముల నా జ్ఞానమును భూమిమీద ప్రజలకు తెలియచేస్తానని"** చెప్పియున్నాడు. ఆ మూడు విధానములలో ఒక విధానముగా **భగవంతుడు** అను మారువేషములో **దేవుడు** వచ్చి తన జ్ఞానమును చెప్పిపోవును.

అలా వచ్చిన రూపమునే దేవుని ప్రతిరూపమని అంటున్నాము. అలా దైవశక్తితో కూడివచ్చిన వానిని దేవదూతలు గుర్తించి, ఆయన మానవాకారములో యున్నా దేవదూతలందరూ మ్రొక్కుచున్నారు. అటువంటి దేవుని ప్రతిరూపమునకు, దేవుని ఆత్మ నిండియున్న వానిని భగవంతునిగా గుర్తించి, దేవుని మారువేషముగా గుర్తించి అతనికి సాష్టాంగ నమస్కారము చేయమని స్వయముగా అల్లాహ్‌యే ఖురాన్‌యందు 15-29వ వాక్యములో చెప్పియున్నాడు. దేవుడే తాను పంపిన మనిషికి నమస్కారము చేయమని చెప్పియున్నాడంటే ఆ వచ్చిన వ్యక్తి సామాన్యుడు కాదని అర్థమయిపోవుచున్నది. ఈ మాట స్వయానా అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో ఉండగా, ఆ మాటను గ్రహించుకోని ముస్లీమ్‌లు దేవుడు చెప్పిన ధర్మమును (మాటను) వదలి, తమ మత ధర్మము ప్రకారము

మనిషిగాయున్న ఎవరికీ మ్రొక్కకూడదు, మేము మ్రొక్కము అని తెగేసి చెప్పుచున్నారు. మా షరియత్ ప్రకారము ఎవరికీ నమస్కరించము అని అదే ఆయత్ క్రింద వివరములో వ్రాసుకొన్నారు. దీనినిబట్టి అల్లాహ్ చెప్పిన వాక్యముకంటే, దేవుడు చెప్పిన నియమముకంటే, మతము చెప్పిన నియమమే పెద్దగా యున్నట్లు తెలియుచున్నది. మత షరియత్ ముందర, మనుషులు తయారు చేసుకొన్న మత ధర్మము ముందర, ఖురాన్‌లో దేవుడు చెప్పిన అల్లాహ్ వాక్యము నిలబడలేదని అర్థమయినది. బయట మనుషులందరికీ తెలిసే రకముగా అల్లాహ్ గొప్పవాడు, ఆయన చెప్పిన ఖురాన్ జ్ఞానము గొప్పదని చెప్పు ముస్లీమ్ సమాజము వారు, దేవుడు నేను పంపిన మనిషికి నమస్కరించమని చెప్పినా మేము నమస్కరించము అని చెప్పడము విడ్డూరముగా ఉన్నది.

దేవుడే తన గ్రంథములో ఒక వ్యక్తిని ప్రత్యేకముగా చెప్పి దేవదూతలు సహితము నమస్కరించుచున్నారు, మీరు కూడా సాష్టాంగ నమస్కారము చేయమని చెప్పాడంటే ఆ వ్యక్తి సామాన్యమైన మనిషి కాదని అర్థమగుచున్నది. అలా వచ్చిన వాడు దేవుని ప్రతినిధియని, ఆయన ప్రతి రూపమని తెలియుచున్నది. అతనినే భగవంతుడని అనవచ్చును. దేవుని ఆత్మతో పుట్టినవాడు దేవుడే అయినా, పుట్టిన వానిని 'దేవుడు' అని అనకూడదు. అందువలన గర్భమునుండి వచ్చినవాడని చెప్పుచూ **భగవంతుడు** అని అన్నారు. భగము అనగా తల్లిగర్భము అని అర్థము. భగవంతుడు అనగా తల్లి గర్భమునుండి వచ్చినవాడని తెలియుచున్నది. అలా తల్లి గర్భమునుండి పుట్టిన ప్రత్యేకమయిన మనిషి **శ్రీకృష్ణుడు.** అందువలన కృష్ణుని రూపమును గ్రహ అనిగానీ, విగ్రహ అనిగానీ అనడము లేదు. కృష్ణుని రూపమును 'ప్రతిమ' అని అంటున్నాము. భూమిమీద

ఆకారము కల్గి, విగ్రహము కాకుండా ప్రతిమగాయున్నది ఒకే ఒక కృష్ణుని ఆకారమేనని అందరూ గుర్తుంచుకోవలెను. భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున గల ఆరవ శ్లోకము ప్రకారము, అలాగే రాజవిద్యా రాజగుహ్యాయోగమను అధ్యాయమునగల పదకొండవ శ్లోకము ప్రకారము, అట్లే అంతిమ దైవ గ్రంథమయిన ఖుర్ఆన్‌లో సూరా 89, ఆయత్ 22 ప్రకారము, సూరా 15, ఆయత్ 29 ప్రకారము కృష్ణున్ని దేవుని అవతారము గానూ, ఆయన రూపమును ప్రతిమగాను చెప్పుచున్నాము.

దేవుడు భూమిమీద పుట్టడని కొందరు అంటున్నా, దైవ గ్రంథము లయిన మూడు గ్రంథములలో దేవుడు పుట్టుననే కలదు. అయితే దేవుని ప్రాథమిక ధర్మమునకు ముప్పు కలుగకుండా దేవుడు దేవునిగా పుట్టడు. దేవుడు మరొకనిగా పుట్టుచున్నాడు. దేవుడు దేవునిగా వచ్చినా, లేక మారు వేషములో వచ్చినా ఆయన వచ్చినట్లే కదా! దైవగ్రంథములో నా జ్ఞానము నాకు తప్ప ఏ మానవునకు తెలియదు అన్నాడు. ఆ మాట నూటికి నూరు పాళ్ళు సత్యమే. అదే దైవగ్రంథములో మరియొకచోట **"నేను ప్రత్యక్షముగా నేరుగా ఎవరితోనూ మాట్లాడను అని చెప్పుచూ, నా జ్ఞానమును మూడు విధములుగా మనుషులకు తెలియజేయుదును"** అన్నాడు. అప్పుడు ఆయన మాటను ఎలా అర్థము చేసుకోవాలో కొందరికి అర్థముకాకపోయి వుండ వచ్చును. మాకు మాత్రము సులభముగా ఆ మాట అర్థమయినది.

ఇక్కడ చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. ఒక పెద్దమనిషికి చతుషష్ఠీ విద్యలు వచ్చును. అంటే అరవైనాలుగు విద్యలు వచ్చునని అర్థము. అయితే ఆ పెద్దమనిషి పదిమంది తన అనుచరులతో కలిసి విదేశీ పర్యటనకు పోయాడు. విదేశీ పర్యటనలో మూడు నెలల కాలము ఉండాలని దానికి తగిన డబ్బును తీసుకొని బయలుదేరిపోయాడు. అక్కడ ఒక నెల కాలము

గడచిపోయినది. తన పదిమంది అనుచరుల ఖర్చంతయూ ఆ పెద్దమనిషే చూచుకొనెడివాడు. అప్పుడు ఆ పెద్దమనిషివద్ద గల డబ్బును ఆ దేశము దొంగలు దొంగిలించారు. పెద్దమనిషి వద్ద గల డబ్బు మొత్తము పోయింది. ప్రక్కన పెట్టుకొన్న కొంత డబ్బు మాత్రము మిగిలింది. ఆ మిగిలిన డబ్బు మూడు లేక నాలుగు రోజులకు సరిపోగలదు. తర్వాత డబ్బులేక విదేశములో ఇబ్బంది పడవలసివచ్చును. ఆ సమయములో అందరికీ నాయకుడుగా యున్న పెద్దమనిషి బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ నిర్ణయమును ఎవరికీ చెప్పకూడదనుకొన్నాడు. ఎందుకనగా ఆ నిర్ణయము తన స్థాయికి తగినది కాదు. అందువలన ఆయన నిర్ణయమును బయటికి చెప్పకుండా, ఆ నిర్ణయమును మరుసటి రోజే కార్యరూపమునకు తెచ్చాడు. తన కార్యము ఎవరికీ తెలియకూడదు, కావున అంతవరకు పెద్దమనిషిగా యున్న అతను తనను ఎవరూ గుర్తించనట్లు తన వేషము మార్చుకొన్నాడు. శరీరమంతా ముసుగు ధరించాడు. అప్పుడు అతనిని పెద్దమనిషి అని ఎవరూ గుర్తు పట్టలేరు. ఆ విధముగా తనను ఎవరూ గుర్తుపట్టలేని విధముగా తయారయిన పెద్దమనిషి, తాను ముందే నేర్చిన 64 విద్యలలో ఒకటయిన చోరకళ (దొంగతనము చేయుట) ఉపయోగించి డబ్బును పొందాలనుకొన్నాడు. పోయిన డబ్బు తిరిగి వచ్చుటకు ఆ దారి తప్ప వేరు దారి కనిపించలేదు. ఎవరూ గుర్తించనట్లు మారువేషములో యున్న పెద్దమనిషి, తాను నేర్చిన విద్యలలో ఒకటయిన దానిని ప్రదర్శించి రెండవ రోజే డబ్బును సంపాదించగలిగాడు. ఆ డబ్బుతో తమ విదేశీ పర్యటనను నెరవేర్చుకొని వచ్చారు. ముసుగులోయున్న పెద్దమనిషి బ్యాంకు దగ్గర ఇతరుల సొమ్మును అపహరించినది తమ గుంపులోని వారు చూచినా, ఆ దొంగతనము చేసినది తమ పెద్దమనిషే అని వారికి తెలియదు. దొంగతనము జరిగినప్పుడు విదేశీ పర్యటనకు పోయిన పెద్దమనిషి గుంపు

మనుషులు అందరూ దానిని చూచారు, దొంగతనము చేసిన మనిషినీ చూచారు. అయితే ఆ మనిషి ముసుగు ధరించి యుండడము వలన అతను ఎవరయినది గుర్తుపట్టుటకు వీలు లేకుండా పోయినది.

అక్కడ దొంగగా ముసుగు వేసుకొన్న మనిషి ఐదు నిమిషములలో దొంగతనమును ఎంతో తెలివిగా చేశాడని చూచిన పెద్దమనిషికి సంబంధించిన మనుషులే చెప్పుచున్నా, ఆ దొంగతనమును చేసినవాడు తమ నాయకుడే అని వారికి తెలియదు. పెద్దమనిషి ముసుగు ధరించడము వలన తన మనుషులే ఆయనను గుర్తించలేకపోయారు. మిగతా విదేశీ పర్యటన రెండు నెలలు గడచిపోయినది. వారందరూ తిరుగు ప్రయాణము చేసి స్వంత దేశమునకు, స్వంత ఇంటికి చేరుకోగలిగారు. అలా ఇంటికి చేరిన వారందరూ ఒకరోజు కలిసి తమ విదేశీ పర్యటనను గురించి చర్చించు కొన్నారు. అక్కడ జరిగిన చర్చావేదికలో పెద్దమనిషిగాయున్న వ్యక్తి తమ గుంపులోని ఎవరికీ అంతవరకు తెలియని రహస్యమును చెప్పాడు. అదేమనగా! "తమ గుంపులో ఒక వ్యక్తికి నేను డబ్బులు ఇచ్చి జాగ్రత్తగా పెట్టుకోమని చెప్పాను. అయినా ఆ డబ్బులను ఆ వ్యక్తి పోగొట్టుకోవడము జరిగినది. తర్వాత ఆ డబ్బులు తిరిగి సంపాదించి తనవద్ద డబ్బులు పోయిన విషయము ఎవరికీ తెలియకుండా చేయాలనుకొన్నాడు. తన విషయము బయటపడకుండుటకు తొందరగా డబ్బులు సంపాదించాలనీ, తొందరగా డబ్బులు సంపాదించుటకు దొంగతనము ఒక్కటే మార్గమనీ తలచి, ఆ వ్యక్తి దొంగతనము చేసి డబ్బును సమకూర్చి, మన ప్రయాణము సులభముగా సాగునట్లు చేశాడు. అయితే ఆ వ్యక్తి ఎవరు? అను విషయము నాకు మాత్రము తెలుసు. ఆ వ్యక్తి తనకు తానుగా బయటికి వచ్చి నేనే ఈ పని చేశాను అని చెప్పితే, అతను ఎవరయినది మిగతా వారికి కూడా

తెలియగలదు" అని పెద్దమనిషి చెప్పడము జరిగినది. పెద్దమనిషి ద్వారా అప్పుడే ఆ విషయమును వినిన పదిమంది తమ గుంపులో ఎవడో ఒకడు ఆ పని చేశాడు అని తెలియగలిగారు గానీ, ఆ మనిషి ఎవరయినది ఎవరికీ తెలియదు.

పెద్దమనిషి తమ సమావేశములో తమ గుంపులోని వాడు ఒకడు డబ్బును పోగొట్టుకోవడము తిరిగి దొంగతనము ద్వారా సంపాదించడము జరిగినదని చెప్పుచున్నా దానిని గ్రహించలేకపోయారు. దొంగతనము జరిగిన రోజు ముసుగు ధరించిన మనిషిని వారు చూచారు. ముసుగు మనిషి ఆనాడు దొంగయని తెలుసు. అయితే ఆ దొంగ తమ గుంపులోని వాడనిగానీ, తమ నాయకుడేయనిగానీ వారికి ఎవరికీ తెలియదు. తమ గుంపులో జరిగిన విషయము అందరికీ తెలిసినా, దొంగ తమ గుంపులో ఉన్నాడని తెలిసినా, ఫలానావాడని నిర్ణయించుకొనుటకు వీలులేదు. దొంగతనము జరిగినరోజు ముసుగు మనిషిని చూచినా, ముసుగు మనిషి ఫలానావాడని చెప్పుటకు వీలులేదు. దొంగతనము చేసిన దొంగ తమ గుంపులో ఉండుట నిజమేయని అందరికీ తెలిసినా, ఎవరయినది గుర్తించ లేకపోయారు. అదే విధముగా మానవ గుంపులోనికి దేవుడు దొంగగా వచ్చిపోయాడు. పెద్దమనిషి ముసుగు ధరించి వచ్చి దొంగతనము చేసిపోయినట్లు, దేవుడు మానవ సమాజమునకు పెద్దగాయుండి తనను గుర్తుపట్టనట్లు శరీరమను ముసుగు ధరించి దొంగవలె వచ్చి, తాను చేయవలసినది చేసి దొంగవలె ఎవరికీ తెలియకుండా పోయాడు. పెద్దమనిషి తమ విదేశీ పర్యటనలో ఒకరు దొంగగా మారాడని చెప్పాడు. అలాగే దేవుడు మనిషిగా మానవ సమాజములోని మనిషిగా వచ్చాడని చెప్పాడు. గుంపులో దొంగయున్నా ఎలా గుర్తించలేకపోయారో, అలాగే మానవ

సమాజములో దొంగవలె దేవుడున్నా ఎవరూ గుర్తించలేకపోయారు. పెద్దమనిషి దొంగగా వచ్చినప్పుడు ముసుగుతో వచ్చాడు గనుక ఆయనను ఎవరూ గుర్తించలేకపోయారు. అలాగే దేవుడు భూమిమీదికి తనబోధను తెలుపటానికి వచ్చినప్పుడు గుర్తించబడని మనిషి అనబడు మారువేషముతో వచ్చుట వలన ఆయనను అందరూ మనిషే అనుకున్నారుగానీ, దేవుడు అని ఎవరూ గుర్తుపట్టలేదు. పెద్దమనిషి ముసుగుతో వచ్చియుండుట వలన అతనిని గుర్తించలేక ముసుగు మనిషి అన్నట్లు, పెద్దమనిషి అని చెప్పలేనట్లు, దేవుడు మనిషి అను వేషములో భూమిమీదికి వచ్చుట వలన ఆయనను దేవునిగా ఎవరూ గుర్తించలేకపోయారు. పెద్దమనిషే తన సమావేశములో దొంగ విషయమును ప్రస్తావించినట్లు, దేవుడే తన గ్రంథములో అవతారమును గురించి ప్రస్తావించాడు.

పెద్దమనిషే దొంగగా తయారయినాడని తెలియని మనుషులు, దేవుడే మనిషిగా వచ్చాడని తెలియలేకపోయారు. అన్ని విద్యలు తెలిసిన వాడు పెద్దమనిషే అని తెలిసి, దొంగతనము కూడా ఆయనే ఎవరూ గుర్తించనట్లు మారువేషములో చేసియుండవచ్చునని అనుకోలేకపోయారు. అదే విధముగా అన్ని రహస్యములు దేవునికే తెలుసుననీ, దేవుడే జ్ఞానము చెప్పు నిమిత్తము మనిషిగా ఎవరూ గుర్తించలేనట్లు వచ్చియుండునని తెలియ లేకపోయారు. పెద్దమనిషిని పెద్దమనిషిగానే చూడవలెననీ, వేరేవారితో పోల్చకూడదను నియమమును పట్టుకొని, పెద్దమనిషే దొంగ అయినాడను సత్యమును మరచిపోయినట్లు, దేవున్ని దేవునిగానే చూడాలి తక్కువవారితో ఆయనను పోల్చకూడదను నియమమును పెట్టుకొని, దేవుడు మనిషి అయినాడను సత్యమును మనిషి కాదంటున్నాడు. పెద్దమనిషికి 64 కళలు వచ్చుననీ, ఆయన ఏమయినా చేయగలడను సూత్రమును మరచి పోయి,

పెద్దమనిషి దొంగతనము చేయడన్నట్లు, దేవుడు సర్వవ్యాపి, సర్వ శక్తిమంతుడు అను జ్ఞానమును మరచిపోయి, దేవుడు మనిషిగా జీవించడు, మనిషిగా పని చేయడు అంటున్నారు. ఈ విధముగా ఒక పెద్ద మనిషి విషయములో మనుషులు ఎలా పొరపాటు పడినారో అదే విధముగా దేవుని విషయములో కూడా పొరపాటుపడినామని అర్థము చేసుకోలేకున్నారు.

ప్రథమ దైవగ్రంథములో జ్ఞానయోగమందు ఆరవ శ్లోకమున, రాజ విద్యా రాజగుహ్య యోగమందు పదకొండవ శ్లోకమున దేవుడు మనిషిగా అవతరిస్తాడని కలదు. అలాగే ద్వితీయ దైవగ్రంథమున బైబిలులో కూడా దేవుడు ఆదరణకర్తగా అవతరిస్తాడని యోహాన్ సువార్త 14,15,16 అధ్యాయములలో చెప్పడమైనది. అట్లే అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో కూడా 89వ సూరా, 22వ ఆయత్‌యందు,15వ సూరా,29వ ఆయత్‌నందు దేవుడు అవతరిస్తాడని వ్రాయబడియున్నా, మనుషులు ఆ విషయమును చదివి కూడా దేవుడు పుట్టడని అజ్ఞానవాదమును రేకెత్తించుచున్నారు. ఎవరు ఎట్లు చెప్పుకొనినా దేవుడు తన గ్రంథములలో చెప్పినట్లు, దేవుడు మనిషిగా పుట్టి తన జ్ఞానమును మనుషులకు బోధించుచున్నాడు. దేవుడు మనిషిగా వచ్చి జ్ఞానము చెప్పకపోతే భూమిమీద జ్ఞానము తెలిసేదే కాదనిపిస్తున్నది. దేవుడు మనిషిగా పుట్టినప్పుడు ఆ మనిషికి ఏదో ఒక పేరు ఉండును, ఆకారముండును. అలా దేవుడు మనిషి రూపము అను మారువేషములో వచ్చినప్పుడు కల్గియున్న రూపమును దేవుని ప్రతిరూపమని అర్థమొచ్చునట్లు 'దేవుని ప్రతిమ' అని ఆ రూపమును అంటున్నాము. దేవుడు మనిషి ఆకారములో వచ్చినప్పుడు, సజీవమైన శరీరముతోయున్నప్పుడు ఆయనను 'భగవంతుడు' అని అంటున్నాము. దేవుడు నిరాకారముగా కనిపించక సూక్ష్మముగావుంటే ఆయనను దేవుడే అనాలి. దేవుడు సాకారుడై స్థూలముగా

కనిపించువాడుగాయుంటే అతనిని భగవంతుడని చెప్పవచ్చును. నిరాకార మైన దేవుడు సాకారముగా మారితే భగవంతుడు అని చెప్పాలి. దేవుడు ఒకమారు సాకార రూపమున్న మనిషిగా వస్తే, ఆ రూపమే ప్రతిమగా మారిపోవును. దేవుని ప్రతిరూపమును గ్రహించి 'ప్రతిమ' అని చెప్పాలి. ఈ విధముగా ప్రతిమ ప్రత్యేకతను సంతరించుకొన్నది.

దేవుడు కాకుండా జీవుడుగా పుట్టుచున్న ప్రతి ఒక్కరు, అకాల మరణములో చనిపోతే సూక్ష్మగ్రహముగా మిగిలిపోతారు. అట్లు కాకుండా దేవతాజాతిలోనే పుట్టితే విగ్రహముగా ఉందురు. సాధారణ జీవులు మనుషులుగా అయితే గ్రహములు అని పిలువబడుతారు. దేవతలుగా అయితే విగ్రహములుగా పిలువబడుతారు. వీరందరికంటే వేరుగా దేవుని జన్మ ఉండుట వలన, ఆయన ధరించిన ఆకారమును ప్రతిమ అంటాము. ప్రతిమకు, విగ్రహమునకు, గ్రహమునకు ఇంత తేడా ఉన్నట్లు చాలామందికి తెలియదు. కొన్ని మతములవారికి దేవుడను విషయము తెలుసుగానీ దేవుని జ్ఞానము ఏమాత్రము తెలియదు. దేవుని జ్ఞానము తెలియనివారికి దేవుడు అందరికంటే గొప్ప, దేవుడు పుట్టడు, మనిషికి కూడా పునర్జన్మలు లేవు, దేవుడు చనిపోయిన వారందరినీ ప్రళయములో లేపుతాడు అను ఈ నాలుగు విషయములను మాత్రమే చెప్పుచుందురు. అంతతప్ప వాటి వివరము వారికి ఏమాత్రమూ తెలియదు. దేవుడు పుట్టడని తెలుసు, ఎందుకు పుట్టడు? అని తెలియదు. మనిషికి పునర్జన్మలు లేవు అని అంటున్నారు. అయితే రెండవ జన్మలో మొదటి జన్మ జ్ఞాపకాలు చెప్పేవారున్నా, వారు ఎక్కడినుండి వచ్చారనే విషయము తెలియదు. ఇలా తాము విన్నది చెప్పడమే తప్ప, వారు విన్నది తప్పా, ఒప్పా అని ఆలోచించు విచక్షణ లేనివారుగా యున్నారు.

**వారి ప్రశ్న :- మీరు చెప్పనది ఆమూలాగ్రము పరిశీలిస్తే విగ్రహము వేరు, ప్రతిమ వేరని, ప్రతిమ భగవంతుని చిహ్నమని, గ్రహము మానవ సారాంశమని, విగ్రహ దేవతల మారురూపమని తెలియుచున్నది. దేవుడు మనిషిగా వచ్చినప్పడు మాత్రమే ఆ రూపమును ప్రతిమగా చెప్పవచ్చును. మనిషి సగము చచ్చితే గ్రహముగా ఉంటాడు. దేవతలు బ్రతికితే విగ్రహములుగా ఉంటారు అని అర్థమయినది. దేవుని అవతారమును భగవంతుడని, భగవంతుని రూపమును ప్రతిమ అని చెప్పచున్నారు. ప్రతిమను దేవుడు అని అనవచ్చునా?**

**మా జవాబు :–** దేవుడు పుట్టితే భగవంతుడగును. భగవంతుని రూపము ప్రతిమ అగును. దేవుడు, భగవంతుడు, ప్రతిమ అను వరుస క్రమములో దేవునినుండి ప్రతిమ మూడవదగును. అందువలన పద్ధతి ప్రకారము ప్రతిమను భగవంతుడని చెప్పవచ్చునుగానీ దేవుడు అని చెప్పకూడదు. దేవుడు అనగా కనిపించనివాడు, దేవునికి రూపమే లేదు. అటువంటప్పుడు రూపమున్న ప్రతిమను దేవుడు అని అనడము ఏమాత్రము సరిపోదు. ఆధ్యాత్మిక చట్టమునకు వ్యతిరేఖమగును. అయితే చాలా సందర్భములలో ప్రతిమను చూపి దేవునికి నమస్కరించుకోమని చెప్పడము జరుగుచున్నది. చాలా సందర్భములలో జ్ఞానులు సహితము ప్రతిమను దేవుడనియే లెక్కించి చెప్పడము జరుగుచున్నది. ప్రతిమను దేవుడనడము తప్పని తెలిసినా కొన్ని సందర్భములలో అలాగే చెప్పవలసి వచ్చును. అది ప్రతిమ మీద గౌరవముతో కాకపోయినా, దేవుని గౌరవార్థము అలా చెప్పవలసియున్నది. అంతేగానీ అదే పనిగా ప్రతిమను దేవుడు అని అనకూడదు.

**వారి ప్రశ్న :- ప్రతిమ భగవంతుని ఆకారమని చెప్పారు. విగ్రహము దేవతల గ్రహించు శక్తి అన్నారు. అది గ్రహించు శక్తి పేరు విగ్రహ అయినా దేవతను విగ్రహ అని అంటున్నాము. బ్రతికియున్న దేవత విగ్రహకాగా, బ్రతికియున్న లేక**

**బ్రతికిపోయిన భగవంతుని ఆకారమును ప్రతిమ అంటున్నాము. అయితే మీరు ప్రతిమకు పూర్తి వ్యతిరేఖమయినది విగ్రహ అని అర్థమగునట్లు ప్రతిమ X విగ్రహ అని వ్రాశారు. ప్రతిమకు విగ్రహమునకు శత్రుత్వమున్నదా? యని కొందరు అడుగుచున్నారు. దీనికి మీరేమంటారు?**

**మా జవాబు :-** అలాంటి శత్రుత్వమును గురించి ఆ గుర్తును పెట్టలేదు. ప్రతిమకు పూర్తి విభిన్నముగా విగ్రహములుండునను ఉద్దేశ్యముతో అలా ప్రతిమ×విగ్రహ అని వ్రాయవలసివచ్చినది. ఇప్పటికాలములో ఒక ఆకారమును చూస్తే చాలు దానిని విగ్రహ అంటున్నారు. అర్థము ప్రకారము దాని భావము వేరున్నా వీరి అలవాటు ప్రకారము రూపమున్న దానినంతటినీ విగ్రహ అంటున్నారు. రూపములలో విగ్రహ వేరు, ప్రతిమ వేరనే విషయము కూడా తెలియదు. అటువంటి వారికి అది వేరు ఇది వేరు అని అర్థమగు లాగున ప్రతిమ × విగ్రహ అని వ్రాయవలసివచ్చినది. అంతేగానీ వేరు విధముగా అనుకోకూడదని, అది శత్రుత్వమునకు గుర్తు కాదని తెలుపు చున్నాము.

**వారి ప్రశ్న :- దైవము X దైయ్యము అని వ్రాశారు కదా! దీనిని గురించి ఏమనుకోవాలి?**

**మా జవాబు :-** ఇక్కడ కూడా వ్యతిరేఖ భావమును గురించి అనుకోకూడదు. దైవమునకు విభిన్నముగా దైయ్యముండును అని తెలుపు నిమిత్తము అలా వ్రాయవలసి వచ్చినది. దైవము అనగా అణువణువునా సర్వ ప్రపంచము వ్యాపించిన దేవుడగును. దైయ్యము అనగా ఒక మనిషి అకాల మరణముతో చనిపోతే అతని కనిపించని సూక్ష్మశరీరమును దైయ్యము అని అంటున్నాము. దేవుడు కనిపించడు, దైయ్యము కనిపించదు. అయితే దేవుడు సర్వ ప్రపంచము వ్యాపించియుండగా, దైయ్యముగాయున్నవాడు ఎక్కడున్నా వాడు

అక్కడే ఒకచోట మాత్రమే ఉండును. దైయ్యము అను పేరుతోయున్నా అతను కనిపించని సాధారణ మనిషిగానే యుండును. స్థూల శరీరము లేకుండాపోయి సూక్ష్మశరీరముండుట వలన, అకాల మరణము పొందిన వాడు రెండవ జన్మకు పోకుండా భూమిమీదనే బ్రతుకవలసియున్నది. అలా మనుషుల లెక్కలో చనిపోయి సూక్ష్మశరీరముతో ఎవరికీ తెలియకుండా బ్రతికియున్న వారిని దైయ్యము అంటున్నాము. దైవము అను పదమునకు దగ్గరగా యుండునట్లు దైయ్యము అను పదమును సూక్ష్మముగా బ్రతికి యున్న మనిషిమీద ఉపయోగించారు. అలా ఉపయోగించుటకు కారణము కలదు. అదేమనగా! దైవము అంటే కనిపించక అంతటా ఉన్నదని అర్థము. దైవము అను పదములో మొదటి రెండు అక్షరములకే అర్థము గలదు. చివరి అక్షరమైన 'ము' అనునది ముగింపు అక్షరముగా ఉన్నది. 'దైవ' అనగా కనిపించక అంతటా ఉండునది దేవుడేయగును. 'దై' అనగా 'కనిపించనిది' అని అర్థము. 'వ' అనగా వ్యాపించినదని అర్థము. దీనిని బట్టి 'దైవ' అనగా కనిపించక అంతటా వ్యాపించినదని తెలియుచున్నది. అలాగే దైయ్య అను రెండు అక్షరములలో 'దై' అనగా కనిపించనిదని అర్థముకాగా, 'య్య' అనగా వ్యాపించనిదని అర్థము. వ్యాపించనిది అనగా ఒకచోట ఉండునదని అర్థము. దీనినిబట్టి దైయ్యము అనగా కనిపించక ఒకచోట ఉండునదని తెలియుచున్నది. కనిపించక అంతటా వ్యాపించిన వాడు దేవుడు అయినప్పుడు, కనిపించక ఒకచోట ఉండువాడు చనిపోయిన మనిషి అని అర్థమగుచున్నది. ఈ విధముగా దైవమునకు, దైయ్యమునకు ఉన్న విభిన్న భావమును తెలియజేయు నిమిత్తము దైవము × దైయ్యము అని వ్రాశాము.

**వారి ప్రశ్న :- మనిషి శరీరములో గ్రహించుకొను బుద్ధియుండుట వలన గ్రహము అని అంటున్నాము అని మీరు చెప్పిన దానినిబట్టి తెలిసినది. ఈ**

**విషయమును చెప్పినప్పుడు మనిషి బ్రతికియున్నా, అకాల మరణముతో చనిపోయినా అతనిలో గ్రహించుకొను శక్తియుండుట వలన మనిషిని గ్రహము అంటున్నామని, దేవతలలో గ్రహించుకొను శక్తి కొంత విశేషముగా ఉండును కనుక దేవతలను విగ్రహ అని అంటున్నామని చెప్పారు. మనిషి బ్రతికినా, చనిపోయినా 'గ్రహ' అనే చెప్పవచ్చును. దేవత కూడా బ్రతికినా, చనిపోయినా 'విగ్రహ' అనియే చెప్పవచ్చును. ఇంతవరకు ప్రతిమకు, విగ్రహమునకు గల తేడాను వివరించారు. అట్లే దైవమునకు దైయ్యమునకు గల వ్యత్యాసమును వివరించి చెప్పారు. వారి తేడాలు విన్న తర్వాత గ్రహముకంటే విగ్రహము అను పేరులో విశేషత ఏమున్నదో, మనిషిని గ్రహ అని దేవతలను విగ్రహ అని ఎందుకంటున్నారో తెలుపమని అడుగుచున్నాను.**

**మా జవాబు :-** మనిషి స్థూలముగా బ్రతికియున్నప్పుడు 'గ్రహ' అనిపించు కొన్నా, సూక్ష్మముగా బ్రతికియున్నప్పుడు 'దైయ్యము' అని పిలువబడు చున్నాడు. దేవతా జన్మపొందిన వారు బ్రతికినప్పుడు 'విగ్రహ' అని పిలువబడినట్లే, సగము చనిపోయి సూక్ష్మముగాయున్నప్పుడు కూడా 'విగ్రహ' అనియే పిలువ బడుచున్నారు. మనుషులకున్నట్లే చావు, పుట్టుకలు దేవతలకు కూడా కలవని ముందే చెప్పియున్నాము. ఇప్పుడు ముఖ్యముగా తెలియవలసిన విషయమేమంటే! మనిషి బ్రతికియున్నప్పుడు స్థూల శరీరమునందు సూక్ష్మ శరీరముతో కలిసియుండును. స్థూల శరీరము పది (10) భాగములుగా యుండగా, సూక్ష్మశరీరము పదిహేను (15) భాగములుగా యున్నది. మనిషి కాలమరణము చెందితే శరీరములోని జీవుడు (జీవాత్మ) శరీరమును మొత్తము వదలిపోవును. అనగా ఇరువదైదు (25) భాగములుగా యున్న శరీరమును వదలిపోవును. ఒకవేళ అకాల మరణమే సంభవిస్తే కాలమరణము వచ్చువరకు ఆ జీవుడు సూక్ష్మ

శరీరమయిన 15 భాగములలో ఉండవలసిందే. ఇది మనిషికి సంబంధించిన విషయముకాగా, దేవతా జన్మ పొందిన వాడు కూడా జీవుడే అయినా వానికి స్థూల, సూక్ష్మ అను రెండు భాగముల శరీరము మనిషికున్నట్లు లేదు. ఒక విధముగా ఒక రాతి బొమ్మ ఆకారమే ఒక దేవతకు స్థూల దేహముగాయున్నదని చెప్పవచ్చును. అయితే మనిషి శరీరమువలె అది పెరుగునది కాదు, బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య అను దశలు మారునది కాదు. రాతి శరీరము ఎల్లప్పుడు ఒకే విధముగా యుండుట అందరికీ తెలిసిన విషయమే.

మనిషి శరీరములోని జీవుడు ఒకమారు శరీరమును వదలి బయటకు వస్తే తిరిగి ఆ శరీరములోనికి పోవడము సాధ్యముకాదు. మనిషి శరీరములోని జీవుడు కాలమరణములోగానీ, అకాల మరణములోగానీ స్థూల శరీరమును వదలి బయటికి రావడము జరుగును. అట్లు కాల మరణములో వస్తే ఆ జీవుడు ఆ క్షణమే మరుజన్మకు పోవును. కావున శరీరములోనికి చేరు అవకాశమే ఉండదు. ఒకవేళ అకాల మరణము పొందినవాడు సూక్ష్మశరీరముతో ఆయుష్షు ఉన్నంత వరకు జీవించవలసి యున్నది. అటువంటి వాడు అకాల మరణముతో చనిపోయి స్థూల శరీరమును వదలి బయటికి వచ్చియుండును. ఆ విధముగా వచ్చినవాడు సూక్ష్మశరీరముతో తన స్థూలశరీరము ప్రక్కనే కూర్చొని చూస్తూయుండును. తన బంధువులు ఏడ్చేది ప్రత్యక్షముగా చూచిన ఆ జీవుడు తిరిగి తన స్థూల శరీరములోనికి ప్రవేశించి తనవారితో మాట్లాడ వలెనని అనుకొనును. అయితే ఆ జీవుడు ఎంత ప్రయత్నించిననూ అంతవరకు తాను నివాసమున్న తన స్థూల దేహములోనికి ప్రవేశించలేడు. ఆ విధముగా అనేకమార్లు స్థూల శరీరములోనికి ప్రవేశించవలెనని ప్రయత్నించి విఫలమై, ఇక అట్లు

చేరుటకు జరుగదని తెలిసి ఊరకుండిపోవును. అట్టివాడు తన ఆయుష్షు ఎంతకాలముండునో అంతకాలము సూక్ష్మశరీరముతోనే గడుపవలసి వచ్చును. ఆ స్థితినే దైయ్యము అనికూడా అంటున్నాము. అలా తన స్థూల శరీరములోనికి చేరలేనివాడు, ఇతరులు జీవనము సాగించు బ్రతికియున్న స్థూల శరీరములోనికి చేరు అవకాశము గలదు. అందువలన కొందరు అకాల మృత్యువుతో చనిపోయినవారు ఇతరుల శరీరములోనికి ఆవహించి మాట్లాడడము జరుగుచున్నది. అప్పుడు "బ్రతికియున్న వానిని చచ్చినవాడు పట్టాడు" అని అంటుంటాము.

ఇదంతయూ మనిషి జన్మ యెడల జరుగు విధానము కాగా, దేవతల జీవితములో జరుగు విధానము వేరుగాయున్నది. దేవతలుగా యున్నవారు జీవాత్మలే అయినా వారికి మానవులవలె మాంస శరీరము లేదు. రాతి శరీరములలో అనగా రాతి బొమ్మలలోగానీ లేక ఇతర బొమ్మలలోగానీ నివసించుచున్నారు. దేవతలకు మరణము రాకముందే సజీవముగా యున్నప్పుడే వారివారి రాతి శరీరమును వదలి బయటికి రాగలరు. అట్లే లోపలికి పోగలరు. మనిషి శరీరములో అలా జరుగుటకు వీలులేదు. దేవతలుగా యున్నవారు తమ రాతి శరీరమునుండి ఎప్పుడయినా బయటికి రాగలరు, ఎప్పుడయినా లోపలికి పోగలరు. ఉదాహరణకు నేను చూచిన ఒక ప్రత్యక్ష సంఘటనను గురించి చెప్పుచున్నాను చూడండి. ఒక పేరు పొందిన ఆంజనేయస్వామి గుడికి ఇతరులవెంట మేము పోవడము జరిగి నది. అక్కడికి సాయంకాలము ఐదు గంటల సమయములో పోయాము. అక్కడ గుడిలో ఆంజనేయస్వామికి పూజలు జరుగుచున్నవి. బయట ఎంతోమంది అనారోగ్యముతో యున్నవారు 'ఆంజనేయస్వామి తమ రోగమును పోగొట్టి ఆరోగ్యమును చేకూర్చును' అను నమ్మకముతో అక్కడికి

వచ్చిన వారుగలరు. అక్కడికి వచ్చిన అనారోగ్యవంతులందరూ దైయ్యాల బాధను పొందువారే అయివున్నారు. ఆ గుడి దగ్గర కొన్నాళ్ళుంటే తమను పీడించు దైయ్యములను ఆంజనేయస్వామి తరిమివేయునని వారి నమ్మకము. అందువలన చాలామంది అనారోగ్యవంతులు అక్కడ కూడాయున్నారు.

అంతలో ఆంజనేయస్వామి గుడిలోని ఆంజనేయుడు బయటికి వచ్చి, అక్కడున్న రోగస్థులలోనున్న ఒక దైయ్యమును దండించడము జరుగుచున్నది. అప్పుడు మనిషిలోని దైయ్యము బయటికి వచ్చి మాట్లాడుచూ "నన్ను కొట్టొద్దు స్వామీ! నేను ఈమెను వదలిపోతాను ఇక ఎప్పటికీ రాను" అని అనడము నేను కూడా విన్నాను. అయినా ఆంజనేయస్వామి కొట్టుచున్నట్లు "అబ్బ! కొట్టొద్దు స్వామీ! ఇక నేను అబద్ధము చెప్పను రేపు ప్రొద్దున్నే పోతాను" అని మరీమరీ చెప్పడము కూడా విన్నాను. ఈ విధముగా అక్కడున్న దాదాపు పదిమంది దైయ్యాల బాధితులను ఆంజనేయస్వామి దండించడము జరిగినది. ఆ సమయములో గుడిలో పూజార్లు పూజలు చేయుచున్నా, ఆంజనేయస్వామి ఆ పూజలవద్ద లేడనీ, అప్పుడు బయట కార్యములలో ఉన్నాడనీ తెలియుచున్నది. ఈ విధముగా అరగంట కాలము గడచిన తర్వాత అక్కడ సద్దుమణిగిపోయినది. దానిని బట్టి ఆంజనేయస్వామి అక్కడ లేకుండా గుడిలోని ప్రతిమలోనికి చేరిపోయాడని తెలిసినది. ఇట్లు అనేక దేవాలయములలోని దేవతలు తమ ఆకారమును వదలి బయటికిపోయి అనేక కార్యములను చేసి తిరిగి తమ శరీరములలోనికి చేరుచున్నారు. ఇదంతా దేవతల విషయము తెలియని వారికి ఏమీ తెలియదు. మేము అనేకమార్లు దేవతలతో మాట్లాడి వారి జీవిత విశేషములన్నీ తెలుసుకోవడము జరిగినది. అందువలన దేవతలు తమ ఆకారములయిన రాతిబొమ్మలను వదలి బయటికి వచ్చి పోయినట్లు అనేక

ఆధారములు గలవు. మేము దేవతల జీవన విధానమును దాదాపు నలభై (40) సంవత్సరములనుండి గమనించుచున్నాము. అందువలన దేవతల సమస్త విషయములు మాకు బాగా తెలుసు.

దేవతలకు స్థూల అవయవములుండవు. వారికి సూక్ష్మగ్రాహిత శక్తులే ఎక్కువ ఉండును. ఉదాహరణకు దేవతలకు స్థూలమైన చెవులు మనవలె ఉండవు. రాతిబొమ్మలలో దేవతలుండుట వలన వారికి చెవులు బయటికి తెలియునట్లు లేకున్ననూ వినికిడి శక్తి ఎక్కువగా ఉండును. మనిషికున్న వినికిడి శక్తికంటే వందరెట్లు ఎక్కువ వినగలరని చెప్పవచ్చును. మనిషికి స్థూలముగా చెవులుండుట వలన వాటికి గ్రాహితశక్తి అయిన 'వినికిడి' కొంతవరకేయుండును. కొంత పరిధిలోని శబ్దమును మాత్రము మనిషి వినగలడు. అయితే స్థూల అవయవము లేనిదానివలన, ఉన్నా అది రాతిదై యుండుట వలన, దేవతల చెవియొక్క 'వినికిడి' అను గ్రాహిత శక్తి ఎక్కువగా యుండుట వలన ఒక కిలోమీటరు పరిధి నుండి నాలుగు లేక ఐదు కిలోమీటర్ల పరిధి వరకు వారు వినగలరు. అందువలన నీవు ఒక దేవతను నీ ఇంటివద్ద దూషించినా రెండు మూడు కిలోమీటర్ల దూరములో యున్న దేవత వినగలదు. నీవు దూషించిన తర్వాత రెండు మూడు రోజులకు నీవు ఆ దేవతవద్దకు పోయినప్పుడు నీవు ఇంటివద్ద దూషించిన విషయమును ఆ దేవత చెప్పగలదు. అదే విధముగా చూపుశక్తి కూడా ఎక్కువగా యుండుట వలన నాలుగు లేక ఐదు కిలోమీటర్ల దూరములో యున్న దృశ్యమును కూడా దేవతలు చూడగలరు. ఈ విధముగా మనుషులకు దేవతలకు ఎన్నో రెట్లు గ్రాహిత శక్తిలో తేడాయుండుట వలన విశేషమైన శక్తిగలవని దేవతలను విగ్రహములని చెప్పడము జరిగినది. విగ్రహము అనునది వారికున్న గ్రాహితశక్తికి గల మారుపేరని తెలియవలెను.

మనుషులకంటే దేవతలు ఎన్నోరెట్లు ఎన్నో విషయములందు అధికులుగా యున్నారు. అందువలన మనుషులకంటే దేవతలు గొప్పవారు అను పేరు వారికి వచ్చినది. ఒక మనిషి మరొక మనిషి ముఖమును చూచినప్పుడు అతని ముఖ వర్చస్సునుబట్టి, ముఖ కదలికలనుబట్టి అతను ఏమి ఆలోచిస్తున్నాడో చెప్పగలడు. మనుషులలో బాగా తెలివైనవారు, గ్రహింపుశక్తి ఎక్కువయున్నవారు ఎదుటి వ్యక్తిలోని ఆలోచనా భావమును గ్రహించగలరు. ఇది వాస్తవమే ఎందుకనగా! కొందరు చూస్తూనే మనము ఏమి అనుకొనేది చెప్పగల స్థోమత గలవారున్నారు. అయితే దేవతలలో ఈ విషయములో మరీ ఎక్కువ గ్రాహితశక్తి గలవారున్నారని తెలియుచున్నది. ఒక మనిషి తాను తన తలలో అనుకొను విషయమును ముఖమును చూచి చెప్పగల దేవతలున్నట్లు తెలిసినది. ప్రత్యక్షముగా జరిగిన సంఘటనను చూస్తే ఆ విషయము సత్యమని తెలియగలదు. ఒక ఊరిలో ఒక దేవత ఒక మనిషి మీదికి పూనకము వచ్చి ఒక గంటసేపు మాట్లాడడము వారమునకు ఒకమారు జరిగెడిది. ఆ సమయములో ప్రజలు ఆ దేవత దగ్గరకుపోయి తమ ప్రపంచ సంబంధ కోర్కెలను అడిగెడివారు. అప్పుడు ఆ దేవత వారికి తనకు తెలిసిన విషయము చెప్పెడిది. ఒక దినము వంద కిలోమీటర్ల దూరమునుండి చిన్నపల్లె అనే ఊరినుండి ఒక వ్యక్తి తన ఇంటిలోనుండి పారిపోయిన ఆవును గురించి అడుగవలెనని వచ్చి యున్నాడు. అప్పుడు దేవత పూనకము వచ్చిన తర్వాత కొద్దిసేపటికి అక్కడ చేరిన దాదాపు యాభైమంది జనములో "చిన్నపల్లెనుండి ఆవును గురించి అడుగవలెనని వచ్చిన గుర్రప్ప, నీవు ముందుకు వచ్చి కూర్చోమని" చెప్పడము జరిగినది. అంతవరకు వచ్చిన మనిషి ఎవరితోనూ మాట్లాడనూ లేదు, తన పేరు, తన ఊరు, తాను వచ్చిన పని అక్కడ ఎవరికీ తెలియదు. అటువంటప్పుడు ఆ దేవతకు తన విషయము ఎలా తెలిసింది? అను

ప్రశ్న అతనికి వచ్చినది. అప్పుడు ఆ దేవత గొప్ప మహత్యముగల దేవతయని అందువలన ఆ దేవతకు తన విషయమంతా తెలిసిపోయినదని అనుకొన్నాడు. అతను అనుకొన్న మహత్యము ఆ దేవతవద్ద లేకున్నా, అతను అట్లు ఊహించుకోవడము జరిగినది. దేవతల విషయములో ఇదే విధముగా చాలామంది మోసపోవుచుందురు.

వాస్తవముగా అక్కడ జరిగిన విషయము అతనికి తెలియదు. మనుషులకంటే దేవతలకు గ్రాహితశక్తి అన్ని విధములా ఎక్కువయుండునను విషయము మనుషులకు తెలియకపోవడము వలన దేవతలకు గొప్ప మహత్యములున్నవని మనుషులు అనుకోవడము జరుగుచున్నది. అక్కడున్న దేవతకు ఇంద్రియ గ్రాహితశక్తి ఎక్కువగాయుండుట వలన మనిషి ముఖమును చూస్తూనే, ఆ చూపు మనిషి తలలో మెదడునందు మెదులు ఆలోచనలను సహితము చూడగలదు. అప్పుడు ఆ దేవత అతని మెదడులో కనిపించిన అతని ఉద్దేశ్యమును తెలుసుకోగలుగును. అతను ఆవును గురించిన చింత అతని తలలో ఉండుట వలన ఆ దేవత అతని ప్రశ్నను సులభముగా గ్రహించగలిగింది. అందువలన "ఆవును గురించి అడిగే దానికి వచ్చిన గుర్రప్ప" అని పిలువడము జరిగినది. గుర్రప్ప అను తన పేరును గ్రహించి దేవత తనను పేరుతో పిలుస్తుందని ఆ మనిషి అనుకోవడము వలన అతని మెదడులోనే అతని పేరు గుర్రప్పయని ఆ దేవతకు తెలిసి పోయినది. ఈ విధముగా ప్రస్తుత సమయములో ఆలోచన రూపములో యున్న సమాచారమును దేవతలు గ్రహించుశక్తిగలవై ఉన్నవని తెలియని మనిషి దేవతలకు మహత్యములను ఆపాదించుచున్నాడు. ఇట్లు దేవతలను మనుషులు తమకంటే గొప్పవారుగా చెప్పుకొను అవకాశము ఏర్పడినది. దానితో కొందరు సమాజములోని ముఖ్యమైన మనుషులు

దేవతలకు పూజలు చేయడము, నైవేద్యములను సమర్పించడము వలన దేవతలు పూజ్యులుగా మారిపోయారు. దేవతలను గొప్పగా భావించిన మనుషులు తమ కోర్కెలను దేవతలు తీర్చగలరని నమ్ముచున్నారు. భూమిమీద మనుషులు ఆశల చేత నిండినవారై, ఎన్నో కోర్కెలను దేవతలను కోరుచూ దేవతలకు గుడులు కట్టించి నిత్యము మ్రొక్కుచున్నారు. ఈ విధముగా దేవతలు భూమిమీద నిత్యపూజ్యులుగా మారిపోయారు. కోర్కెలు నెరవేరే దానినిబట్టి దేవతలను చిన్న పెద్ద దేవతలుగా మనుషులే విభజించారు. ప్రతి మనిషి ఏదో ఒక కోర్కె నిమిత్తము ఏదో ఒక దేవతను నిత్యము మ్రొక్కుచుండుట వలన, క్రొత్తగా పుట్టి వచ్చువారు కూడా తమ పెద్దలు ఏమి చేయుచున్నారో దానినే విచక్షణ లేకుండా చేయుచున్నారు. అలా పెద్దవారిని చూచి చిన్నవారు వారి దారిలో పోవడము వలన అసలయిన దేవున్ని, ప్రపంచమునంతటినీ సృష్టించిన దేవున్ని మరచిపోయి ఎల్లప్పుడూ దేవతల జ్ఞాపకములోనే మనుషులున్నారు. మనుషుల దృష్టిలో అందరికంటే పెద్ద దేవుడు అను విషయమే తెలియకుండా పోయినది.

**వారి ప్రశ్న :- మీరు చెప్పిన విషయములో దేవతలకు (విగ్రహములకు) గల విశేషత తెలిసిపోయినది. గ్రహములకు లేని ఇంద్రియశక్తి విగ్రహములకున్నదని అర్థమయినది. మనిషి చనిపోతే అతను కూడా స్థూల శరీరమును కోల్పోవును కదా! అప్పుడు మనిషికి సూక్ష్మశరీరముండును కదా! స్థూల అవయవములు లేని సూక్ష్మ ఇంద్రియములకు గ్రహింపుశక్తి ఎక్కువ వుండునని మీరన్నట్లు మనిషి అనగా చనిపోతే గ్రహముగా యున్నవాడు దైయ్యముగా మారిపోతే అప్పుడు అతనికి విగ్రహమునకున్నట్లే ఇంద్రియ శక్తుల గ్రాహిత స్థోమత ఎక్కువగా యుండునా! అని కొందరికి అనుమానము గలదు. ఈ విషయములో మీరేమంటారు?**

**మా జవాబు :-** మనిషి బ్రతికియున్నప్పుడు గ్రహముగానే చెప్పబడును. అప్పుడు స్థూల శరీరముండుట వలన అతని ఇంద్రియ శక్తులు మనుషులందరికీ ఉన్నట్లేయుండును. అయితే మనిషి అకాల మృత్యువుతో చనిపోతే, అతడు స్థూల శరీరమును వదలి సూక్ష్మ శరీరముతో గడుప వలసివచ్చును. అప్పుడు అతనిని 'గ్రహ' అని అనకుండా 'దైయ్యము' అని అంటున్నాము. దైయ్యము దేవతకంటే అన్నిటియందు చిన్నదేయగును. అట్లే గ్రాహితశక్తిలోనూ చిన్నదేయగును. అయితే మనిషి బ్రతికియున్నప్పుడు ఇంద్రియములకున్న శక్తులకంటే, దైయ్యముగా ఉన్నప్పుడు కొంత ఎక్కువ ప్రభావము కల్గియుండును. అందువలన దైయ్యములు కూడా కొంత దూరములోయున్న శబ్దములను వినగల్గుచున్నవి. అలాగే చూడగలుగు చున్నవి. మనిషి బ్రతికియున్నప్పుడు ఉన్న చూపుకంటే దైయ్యముగా మారినప్పుడు చూపు దాదాపు నాలుగు రెట్లు ఎక్కువగాయుండును. అలాగే చెవియొక్క వినికిడి శక్తి కూడా గ్రహముకంటే దైయ్యముగా మారినప్పుడు దాదాపు నాలుగురెట్లు ఎక్కువగా ఉండును. ఒక ప్రత్యక్ష సంఘటన ద్వారా ఆ విషయము కొంత నిరూపణకు వచ్చినది. ఒక ఊరిలో రాత్రిపూట దాదాపు 150 గజాల దూరములోగల ఇంటిలో దొంగతనము జరుగు చుండగా, ఆ దృశ్యమును 150 గజాల దూరమునుండి చూచిన దైయ్యము అక్కడేయున్న మనిషిలోనికి చేరి మిగతా వారందరినీ లేపి, ఫలానా ఇంటిలో దొంగతనము జరుగుచున్నదని చెప్పగా, దానిని విన్న వారందరూ అక్కడికి పోయి చూచారు. అప్పుడు పూనకము వచ్చి చెప్పిన దైయ్యము మాట నిజమేనని తెలిసిపోయినది. అక్కడ దొంగతనము జరుగుచుండగా వారు చూచి దొంగలను తరిమివేయడము జరిగినది. ఈ సంఘటనతో బ్రతికి యున్న గ్రహముకంటే చనిపోయిన దైయ్యము ఎక్కువ శక్తిగలదని తెలిసిపోయి నది. చూపులోనూ, వినికిడిలోనే కాకుండా బలము కూడా ఎక్కువగా యుండును.

**వారి ప్రశ్న :- ఒక మనిషి బ్రతికియున్నప్పుడు దేవతలు తనకంటే గొప్పవారని ఎంతో భక్తిగా ముడుపులు కట్టి, నైవేద్యములు పెట్టి పూజించెడివాడు. తన జీవితములో ఒక దేవతను ఆశ్రయించి ఆ దేవతా భక్తుడనని చెప్పకొనుచూ జీవితాంతము పూజలు చేశాడు. అలా ఒక దేవతకు పూర్తి భక్తునిగాయున్న అతను చనిపోవడము జరిగినది. అతని కర్మవశాత్తు అతను అకాల మరణమును పొందాడు. అప్పుడు అతను దైయ్యముగా ఆయుష్షు అయిపోవు వరకు జీవించవలసి యుంటుంది. అలా జీవించునప్పుడు తాను జీవితాంతము పూజించిన దేవతను కూడా చూడడము జరుగును. అలా చూచినప్పుడు ఆ దైయ్యమునకు తన దేవత మీద భక్తి పెరుగునా? తరుగునా? అంతవరకు ఎంతో పెద్ద అని గౌరవించిన దేవతను చూచినప్పుడు దైయ్యముగా ఉన్న అతనికి ఏ మనిపించును?**

**మా జవాబు :-** మనిషి బ్రతికియున్నప్పుడు దేవతలను గొప్పగా తలువడము సహజమే! అయితే మనిషి అకాలమరణము పొందిన తర్వాత అంతవరకు గ్రహముగా యున్నవాడు దైయ్యముగా మారును కనుక అంతవరకు చూడని దేవతలనందరినీ చూచును. అంతేకాక తన జీవితకాలములో పూజించిన దేవతను కూడా చూచును. దైయ్యముగా యున్నవారు దాదాపు దేవతలకు సమానముగాయుండుట వలన అప్పుడు దేవతలలో గొప్పతనము ఏమీ కనిపించదు. ఇంతకాలము వీరినేనా మేము పూజించినదని ఆశ్చర్యము కల్గును. ఎందుకనగా! కొందరు దేవతలు మనుషులకంటే నీచులుగా యుండుట దైయ్యములుగా యున్నవారు చూడగలరు. అలా చూచినప్పుడు వారి ప్రవర్తన అజ్ఞానముగా ఉండడమేకాక నీచముగా కూడా కనిపించు చుండును. కొందరు దేవతలు గొప్ప భావములతో గొప్పగా మసలుకొను చుండగా, కొందరు మాత్రము దానికి పూర్తి భిన్నముగా ఉందురు. మనుషుల

కున్నట్లే దేవతలకు కూడా మంచి, చెడు గుణములుండుట వలన, వారు కూడా కర్మప్రకారమే కర్మ ఆధీనములో నడచుట వలన, కొందరు దేవతలు మనుషులకంటే మంచిగా ప్రవర్తించగా, కొందరు దేవతలు మనుషులకంటే నీచముగా ప్రవర్తించుచూ 'వీరు దేవతలేనా!?' అన్నట్లుందురు. అటువంటి దేవతలకంటే మనుషులే ఎన్నోరెట్లు మంచిగా యున్నారనిపించును.

కొన్నిచోట్ల కొందరు దేవతలు తమ ప్రవర్తనల వలన దైయ్యముల వద్ద కూడా గౌరవము లేకుండా చేసుకొనుచున్నారు. దేవతల చెడు ప్రవర్తనలను చూచిన దైయ్యములు కొన్నిచోట్ల దేవతలకు ఎదురు తిరిగి మాట్లాడడము, కొన్నిచోట్ల పోట్లాడడము కూడా జరుగుచున్నది. కొన్నిచోట్ల దైయ్యముల చేతిలో పరాభవమును పొందిన దేవతలు కూడా కలరు. దైయ్యములుగా మారిన వారికి దేవతలవద్ద ఏ మహత్యములు లేవనీ, వారు కూడా తమవలె బ్రతుకుచున్నవారేనని తెలిసిపోవుచున్నది. దేవతలు కూడా మానవజాతివలె ఒక జాతిగాయున్నారు తప్ప వారిలో ఏ జ్ఞానముగానీ, ఏ మహత్యముగానీ లేదని తెలిసిపోవుచున్నది. కొందరు దేవతలు దేవుని జ్ఞానము అంటే ఏమాత్రము సరిపోని వారుండగా, కొందరు ఎంతో శ్రద్ధతో జ్ఞానమును తెలియువారు కూడా కలరు. కొందరు దేవతలు ప్రేమ, దయకల్గి మానవుల ఎడల ఎంతో మంచిగా నడుచుకొనుచూ ఎంతో మంచిపేరు పొందియుండగా, కొందరు దేవతలు మాత్రము చెడు గుణములతో పూర్తి చెడుపేరును కల్గియున్నారు. మనిషి బ్రతికియున్నప్పుడు, ఎంతో దైవ జ్ఞానమును పొందినవారు కూడా కర్మానుసారము అకాల మరణమును పొందవలసివచ్చినప్పుడు వారు కూడా దైయ్యములుగా ఉందురు. అటువంటి గొప్ప జ్ఞానులను చూచినప్పుడు కొందరు దేవతలు వినయ విధేయతలు కల్గినవారై, జ్ఞానులవద్దకు వచ్చి సేవలు చేయుచూ వారి వలన

జ్ఞానమును తెలియువారు కూడా కలరు. కొందరు దేవతలు మాత్రము జ్ఞానులంటే సరిపోనివారై జ్ఞానులకు ఏదో ఒక చెడును చేయాలని చూచుచుందురు.

దేవతలలో కొందరు ఏదో ఒక గుడిలో దేవునిగానో, దేవతగానో ఉండి, ఆ గుడి, గుడి ఆవరణ అంతయూ తన సామ్రాజ్యముగా తలచి, ఆ స్థానమునకంతా నేనే పెద్దయన్నట్లు ప్రవర్తించుచుందురు. కొందరు దేవతలు గుడిలో జన్మపొందినా, ఏ గర్వము లేకుండా వచ్చిపోయే భక్తులకు ఎటువంటి అసౌకర్యము కలుగకుండా చూచుకొనుచుందురు. అటువంటి దేవతలు తాము ఆ గుడికి దేవతగాయున్నా తమకు, అందరికీ దేవుడు పెద్దగా యున్నాడని తలచుచూ జ్ఞానముమీద ఆసక్తి కల్గియుందురు. కొందరు దేవతలు ఏదో ఒక గుడికి అధిపతిగాయున్నా, అది తమకు ఇష్టములేనివారై దైవజ్ఞానము మీద శ్రద్ధకల్గి ఎక్కడ దైవజ్ఞానము తెలియబడుచున్నదో అక్కడికి పోయి నెల, రెండునెలలు గడిపి తిరిగి తమ గుడికి వచ్చుచుందురు. అలా వచ్చినవారు పదిలేక పదిహేను రోజులు అక్కడి పనులను చూచుకొని తిరిగి జ్ఞానము తెలుసుకొను ప్రయత్నములో బయలుదేరి పోవుచుందురు. ఒకమారు ఒక గుడిలో బొమ్మలోనికి చేరిన జీవుడు ఆ జన్మయంతయూ ఆ బొమ్మలోనే ఉండవలెను. ఆ బొమ్మ ఆ దేవతయొక్క శరీరముగా ఉండును. ఒక బొమ్మలో ఒక దేవత జన్మించిన తర్వాత తిరిగి ఆ దేవత మరణమును పొందువరకు వేరే దేవత ఆ బొమ్మలో జన్మించుటకు వీలులేదు. మనుషుల శరీరములో ఇతర దెయ్యము వచ్చి చేరునట్లు, దేవతల శరీరములయిన రాతిబొమ్మలో వేరే దేవత చేరుటకు అవకాశములేదు. ఒకమారు ఒక బొమ్మలో చేరిన దేవత ఎన్నిమార్లయినా ఆ రాతిబొమ్మ నుండి బయటికి రావచ్చును లోపలికి పోవచ్చును. ఒక్కొక్కమారు ఆరు

నెలలు సహితము బొమ్మలో ఆ దేవత లేకుండా ఉండును. కొన్ని గుళ్ళలోని దేవతలు ధనికులుగా ఉండగా, కొందరు దేవతలు తమ గుడులకు వచ్చి కానుకలు ఇచ్చువారులేక పేదవారుగా యున్నారు.

ముఖ్యమైన విషయమేమనగా! ఆధ్యాత్మిక రంగములో మనుషులు తక్కువగాయున్నారని మనము అనుచున్నాము. అయితే ఆధ్యాత్మిక రంగములో మనుషులకంటే దేవతలే తక్కువగాయున్నారు. ఆధ్యాత్మికతలో మనుషులు ఎక్కువగా ఉండడమేకాక, దేవతలకంటే ఎక్కువ జ్ఞానులుగా యున్నారు. అంతేకాక దేవతలకంటే ఎక్కువ జ్ఞానశక్తి కలవారుగా కూడా యున్నారు. దేవతలు ఎందరున్నా అందరిలో జ్ఞానము తెలిసిన గురువుగా ఎవరూ లేరు. దేవతలందరూ మనుషులను ఆశ్రయించి జ్ఞానమును తెలియు చున్నారు. అందువలన జ్ఞానము మీద ఆసక్తికల దేవతలు ఎల్లప్పుడు సరియైన గురువు కొరకు అన్వేషిస్తూ ఉంటారు. మనుషులు చెప్పు జ్ఞానము సరియైనదో కాదో గుర్తించు స్థోమత దేవతలకుండును. అందువలన వారు సరియైన జ్ఞానము కొరకు అన్వేషణ సాగించుచుందురు. మనుషుల వలె ఏదో ఒక జ్ఞానముతో సరిపెట్టుకోరు. ఇదంతయూ మనిషిగా యున్న వానికి తెలియకున్నా, వాడు చనిపోయిన (అకాలమరణమును పొందిన) తర్వాత తాము పూజించిన దేవతలుండు స్థితిని చూచి ఇంతకాలము వీరినా మేము పూజించినదని మనుషులు సిగ్గుపడుదురు.

**వారి ప్రశ్న :- మీరు చెప్పిన దానినిబట్టి మానవులలో నీగ్రోజాతి వేరుగా యున్నట్లు, దేవుని సృష్టిలో మనుషులకంటే కొంత భిన్నముగా దేవతలున్నా వారికి కూడా కర్మానుసారము గుణములు, పాపపుణ్యములు, కష్టసుఖములు గలవు. అంతేకాక మనుషులలో ఆడ మగ జాతులున్నట్లు దేవతలలో ఆడ మగ జాతులు ఉన్నవని తెలియుచున్నది. దేవతా జాతిలోని ఆడవారిని దేవతలని**

**పిలువవచ్చును. మగజాతిని దేవుళ్ళు అని పిలవాలి. అయితే దేవతలు, దేవుళ్ళు అని పిలువకుండా ఆ జాతినంతటినీ కలిపి దేవతలు అనడమెందుకు? అని ప్రశ్నించుచున్నాము. దీనికి మాకర్థమగు వివరమును చెప్పండి?**

**మా జవాబు :-** మనుషులలో నీగ్రోజాతి ప్రత్యేకముగా యున్నట్లు, దేవుడు తన సృష్ఠిలో ప్రత్యేకమైన దేవతల జాతిని సృష్ఠించాడు. మనుషులలో ఆడ మగ రెండు రకములున్నట్లే దేవతలలో కూడా స్త్రీ పురుషులున్నారు. అయితే మనుషులను స్త్రీ పురుషులని వేరుగా పిలిచినట్లు దేవతలను స్త్రీ పురుషులుగా విభజించి పిలువరు. విభజించి పిలిస్తే దేవతలని ఆడవారిని, దేవుళ్ళని మగవారిని పిలువవలసి యుండును. అయితే **"దేవుడు"** అను పేరు ఒకే ఒక పరమాత్మకు తప్ప ఇతరులకు ఉండుటకు వీలులేదు. దేవునితో సమానమైన వారు ప్రపంచములో ఎవరూ లేరు. అందువలన దేవతా జాతిలో ఒక మగవానిని దేవుడు అని పిలువవలసి వచ్చును. ఆడ, మగ అందరినీ కలిపి దేవుళ్ళని చెప్పినా, మగవానిని పిలుచునప్పుడు ఒక్కనిని దేవుడని చెప్పవలసి వచ్చుట వలన అట్లు పిలుచుటకు జ్ఞానులు ఎవరూ ఇష్టపడలేరు. దేవుడు అనగా వెదకినా తెలియనివాడు, వెతకబడేవాడు అని చెప్పుకొన్నాము. ఆ భావమునకు దేవతాజాతిలోని ఏ పురుషుడు సరిపోడు. అంతేకాక దైవత్వము లేనివారు ఆధ్యాత్మిక చట్టమురీత్యా స్త్రీగా పరిగణించబడుదురు. దేవతా జాతికి జ్ఞానము లేదు. దానికి తగిన జ్ఞానశక్తి లేదు. అందువలన ఆ జాతిలో ఆడ, మగ మొత్తము ప్రకృతి సంబంధమైనదిగా చెప్పుచున్నాము. అందువలన దేవతా జాతిని మొత్తము దేవతలని చెప్పుచున్నాము. దీనినిబట్టి దేవతలు, దేవుడు వేరు వేరని భావము కల్గునని జ్ఞానులయిన వారు దేవతా జాతిని దేవతలని చెప్పడమైనది. అయినప్పటికీ మానవుని అజ్ఞానమువలన దేవతనే దేవునికంటే గొప్పగా

తలచి, దేవున్ని వదలి దేవతలను ఆశ్రయించారు. అటువంటి అజ్ఞానము నుండి బయటపడుటకు దేవతా జాతినంతటినీ దేవతలని అన్నారు.

**వారి ప్రశ్న :- మనుషులు దేవతలను ఎందరినో మ్రొక్కుచున్నారు. దేవతలు ఎందరో గలరు. వారికి మనుషులు భక్తులుగా ఎందరో గలరు. ఒక మనిషి ఒక దేవతను కొన్నాళ్ళు మ్రొక్కి తర్వాత వేరే దేవతను ఆశ్రయించితే మొదట మ్రొక్కుచున్న దేవతకు కోపమొస్తుందా? నన్ను వదలి వేరే వారిని మ్రొక్కుతావా! అని అతని మీద కక్ష సాధింతురా? లేక ఎవరి ఇష్టము వారిదని వదలివేతురా?**

**మా జవాబు :-** దేవతలలో కూడా జ్ఞానులు, అజ్ఞానులు ఇరువురు కలరని చెప్పాము కదా! మనుషులు తమను వదలి వేరే దేవతలను ఆశ్రయించితే కొందరు ఏమాత్రము పట్టించుకోకపోయినా, కొందరు మాత్రము చాలా కోపముగలవారై కక్షసాధింపు చేయుదురని కొన్ని సంఘటనల ద్వారా తెలిసింది. అంతేకాదు తమకు కానుకలు ఇస్తామని మాటచెప్పి తర్వాత కానుకలు ఇవ్వనివారి మీద కూడా కక్ష సాధిస్తారని తెలిసినది. మనుషులలో అనేక రకముల మనుషులున్నట్లే దేవతలలో కూడా చాలా రకముల మనస్తత్వములు గలవారున్నారు. కొందరు చాలా సౌమ్యముగాయుందురు. కొందరు చాలా క్రూరముగా ఉందురు. కొంత కాలము తమను మ్రొక్కి తర్వాత వేరే దేవతలను ఆశ్రయించితే అంతవరకు మ్రొక్కిన దేవతకు కోపము రావడము, ఆ కోపముతో కక్షసాధింపు చర్యగా ఎన్నో ఇబ్బందుల పాలు చేయుదురు. కొన్ని రోగముల రూపములో మనుషులను పీడించడము జరుగుచున్నది. తిరిగి తమను మ్రొక్కేవరకు అనేకరూపములలో ఇబ్బందులు కలుగజేతురు. అట్లే కానుకలు ఇస్తామని చెప్పి మరచిపోయినా కొందరు దేవతలు తమ కానుకలను ఇచ్చేంతవరకు వదలక రోగముల రూపములో బాధించడము మేము ప్రత్యక్షముగా చాలాచోట్ల చూచాము. తమ తప్పును

తెలుసుకొన్నవారు ఎప్పుడయితే కానుకలు చెల్లిస్తారో అప్పుడే రోగములు బాగయిపోయిన సంఘటనలను మేము చాలా చూచాము. నలభై సంవత్సరముల క్రిందట తిరుమలలోయున్న వెంకటేశ్వరునికి, నేడు తిరుమలలో యున్న వెంకటేశ్వరునికి ఎంతో తేడా కలదని మేము చెప్పుచున్నాము. నేడు గల వెంకటేశ్వరస్వామి ఎంతో సౌమ్యుడు. చెప్పిన కానుకలు ఇవ్వకున్నా ఈయన ఏమీ పట్టించుకోడు, కక్షసాధించాలని అనుకోడు. గత నలభై సంవత్సరముల క్రిందటయున్న వెంకటేశ్వరుడు వృద్ధాప్యమును పొంది చనిపోయిన తర్వాత ప్రస్తుతము ఇప్పుడున్న వెంకటేశ్వరుడు తిరుమల గుడిలో పుట్టడము జరిగినది. ఇప్పుడున్న వెంకటేశ్వరునికి దాదాపు నలభై (4o) సంవత్సరముల వయస్సుండవచ్చును. ఈయన ఎంతో సౌమ్యుడు, ఉత్తముడు, ఎవరినీ ఇబ్బంది పెట్టువాడు కాదు.

గతములోయున్న వెంకటేశ్వర స్వామి దాదాపు నాలుగు వందల చిల్లర సంవత్సరములు బ్రతుకడము జరిగినది. ఆయన కానుకలు ఇస్తామని ఇవ్వనివారిని ఎవరినీ వదలక పీడించి మరీ వారినుండి తన కానుకలను రాబట్టుకొన్నాడు. అప్పటి వెంకటేశ్వరున్ని చూచి అప్పటి ప్రజలు చాలా భయము కల్గియుండేవారు. ఎప్పుడయినా వెంకటేశ్వరస్వామికి కానుక డబ్బులను ఇస్తామని ఎవరు చెప్పిన సమయమునకు చెల్లించెడివారు. ఒకవేళ ఎవరైనా చెల్లించడములో ఒకనెల ఆలస్యమయినా దానికి తగిన వడ్డీతో సహా ఇచ్చెడివారు. అందువలన అప్పటికాలములో వెంకటేశ్వరున్ని వడ్డీకాసులవాడని చెప్పెడివారు. నేను చూచినంతటిలో ఒక వ్యక్తి డబ్బులను కానుకగా సమర్పించుకుంటానని చెప్పిన తర్వాత ఇవ్వడము మరచి పోయాడు. ఒక సంవత్సర కాలము వెంకటేశ్వరుడు కానుక కొరకు వేచి చూచి అప్పటికీ కూడా చెల్లించని వానికి గుండెనొప్పిని కలుగజేశాడు.

గుండెనొప్పి ఫలానా కారణము వలన వచ్చిందని మేము చెప్పిన తర్వాత ఆ ఇంటివారు వెంటనే కానుకలు చెల్లించడము జరిగినది. అలా చెల్లించగానే గుండెనొప్పి వెంటనే నయమైపోయినది. ఇటువంటి సంఘటనలతో వడ్డీకాసులవాడని గతములో వెంకటేశ్వరుడు పేరు తెచ్చుకోవడము జరిగినది. ఈ విధముగా గమనించి చూస్తే గతములో 40 సంవత్సరముల క్రిందట యున్న వెంకటేశ్వరునికి నేడు గల వెంకటేశ్వరునికి ఎన్నోరెట్లు తేడాగలదని చెప్పవచ్చును.

**వారి ప్రశ్న :- భూమిమీద మనుషులు చేయు తప్పులకు ఫలితముగా పాపము వస్తున్నదని చెప్పినట్లే దేవతలు కూడా చెడు చేస్తే పాపము వస్తుంది. మంచి చేస్తే పుణ్యము వస్తుందని మీరు చెప్పిన దానినిబట్టి తెలిసినది. మనుషులు పాపపుణ్యములను భూమిమీదనే అనుభవిస్తున్నారని మీరే చెప్పారు. ఇప్పుడు దేవతలు చేసుకొన్న పాపపుణ్యములను వారు ఎక్కడ అనుభవిస్తారని అడుగుచున్నాము.**

**మా జవాబు :-** పాపము అనుభవించుటకు యమలోకము, సుఖమును అనుభవించుటకు స్వర్గలోకము కలదని కొందరు చెప్పినా, అవి ఎక్కడో ఉన్నాయని అనుకోవడము పొరపాటగును. మనుషులు అనుభవించు స్వర్గ, నరకములు రెండూ భూమిమీదనే కలవు. ఈ విషయమును గురించి గతములో చాలామార్లు చెప్పాము. ఎక్కడ మనిషి సుఖమును అనుభవించు చున్నాడో, అప్పుడు అక్కడ అతను స్వర్గమును పొందినట్లేనని తెలియవలెను. అదే విధముగా మనిషి ఎక్కడ కష్టమును, బాధను అనుభవిస్తున్నాడో, అప్పుడు అక్కడ అతను నరకమును పొందుచున్నాడని తెలియవలెను. స్వర్గ నరకములు అనుభవించు సమయమునుబట్టి అనుభవించు ప్రాంతమునుబట్టి అక్కడేగలవని తెలియుచున్నది. దేవతల విషయానికి వస్తే మనుషులు ఏ

విధముగా కష్టసుఖములను, నరక స్వర్గములుగా అనుభవించుచున్నారో అదే విధముగా దేవతలు కూడా అనుభవిస్తున్నారని తెలియుచున్నది. స్వర్గనరకములను అనుభవించడములో ఎవరికీ ఏ రాయితీలు లేవని తెలియవలెను.

**వారి ప్రశ్న :- నేడు భూమిమీద గల ముఖ్యమైన మూడు మతములలో హిందూ సమాజములో మాత్రము దేవతలున్నారని నమ్మి వారిని ఆరాధించు వారు కూడా కలరు. మిగతా రెండు సమాజములలో దేవతలున్నారను విషయమునే వారు నమ్మడము లేదు. పైగా వారు దేవతలను వారు లేనే లేరు. దేవుడు ఒక్కడు మాత్రమే కలడని అంటున్నారు. ఈ విధముగా దేవతలున్నారని కొందరు, లేరని కొందరు వాదిస్తున్నారు. మీరేమో దేవతలున్నారని తేల్చి చెప్పచున్నారు. దేవతలున్నారని నమ్మి పూజించిన వారినే కొన్ని విషయములలో దేవతలు బాధించుచున్నారని చెప్పారు. అయితే దేవతలు లేరని చెప్పవారి జోలికి దేవతలు ఎందుకు పోలేదు. తామున్నట్లు వారికి ఎందుకు తెలియునట్లు చేయలేదు?**

**మా జవాబు :-** మనుషులలో సూక్ష్మజ్ఞానము తెలియనివారు సూక్ష్మముగా యున్న దేవతలు ఉన్నారని తెలుసుకోలేకపోయి దేవతలను వారు లేనేలేరు అని చెప్పుచున్నారు. మనకు తెలియనంత మాత్రమున ఉన్నవారు లేకుండా పోరు కదా! ఆకాశములో ఎన్నో శక్తులు మనుషులకు తెలియకుండా ఉన్నవి. ఆ శక్తులు మనకు తెలియనంత మాత్రమున, వాటిని మనము లేవు అన్నంతమాత్రమున ఆ శక్తులు తమ పనులు చేయకుండా మానుకోలేదు కదా! మానవుల మీద అనేక రోగముల రూపములో వచ్చి పడుచున్నవి. వాటి బాధను మనుషులు అనుభవిస్తున్నారు. మనుషులు రోగముల బాధలను అనుభవిస్తున్నప్పటికీ, వాటిని సర్వసాధారణముగా

తీసుకొంటున్నారు తప్ప, మనము అనుభవించు రోగములు మనకు తెలియని శక్తులు కలుగజేసినవని తెలియలేకపోయారు. అదే విధముగా భూమిమీద మనతోపాటు సహజీవనము సాగించు దేవతలను కొందరు గుర్తించనంత మాత్రమున దేవతలు తమ పనులను చేయుట మానుకోరు.

దేవుడు తన జ్ఞానమును మూడు గ్రంథములలో అందించినప్పుడు ఒక గ్రంథములో ప్రస్తావించని జ్ఞానమును మరియొక గ్రంథములో ప్రస్తావించడము జరిగినది. ప్రథమ దైవగ్రంథములో మనిషి శరీరము స్థూలము, సూక్ష్మము అను రెండు భాగములుగాయున్నదని తెలియజేసి నప్పటికీ, సూక్ష్మశరీరమునే దైయ్యము అంటామని అక్కడ చెప్పలేదు. తర్వాత ద్వితీయ దైవగ్రంథములో దైయ్యముల ప్రస్తావన వచ్చినది. చివరి దైవ గ్రంథములో కూడా దైయ్యముల ప్రస్తావన రాలేదు. ప్రథమ దైవగ్రంథము లోనూ, చివరి దైవగ్రంథములోనూ దైయ్యముల గురించి చెప్పనంత మాత్రమున వాటిని మనము లేవనలేము. అవి ఉన్నాయి కావున మధ్య దైవ గ్రంథములో చెప్పడమైనది. ఏసు జీవితములో వాటి ప్రస్తావన వచ్చినది. దేవుడు తన గ్రంథములలో జ్ఞానమును అందిస్తూ ఒక మాటను చెప్పాడు. **"నా జ్ఞానమంతయూ సత్యసమేతముగా ఉంటుంది"** అని చెప్పాడు. ఖురాన్ గ్రంథములో చాలా వాక్యములలో (ఆయత్‌లలో) **"నా జ్ఞానము సత్యబద్ధమై నది, సత్యముతో కూడుకొనియున్నది"** అని చెప్పాడు. ఖురాన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 48ని చూస్తాము. **(5-48) "ఓ ప్రవక్తా! మేము ఈ గ్రంథాన్ని నీపై సత్యముతో అవతరింపజేశాము. ఇది పూర్వ గ్రంథాలలో మిగిలియున్న సత్యాన్ని ధృవపరుస్తుంది మరియు వాటిలోయున్న సత్యా సత్యములను పరిష్కరిస్తుంది"** అని గలదు.

సత్యము అనగా ఉన్నది, అసత్యమనగా లేనిదని అందరికీ తెలుసు. అట్లే సత్యమనగా జరుగునది, అసత్యమనగా జరగనిది అని కూడా చెప్ప వచ్చును. ఇంకా సత్యమనగా శాస్త్రమని, అసత్యమనగా అశాస్త్రమని కూడా చెప్పవచ్చును. దేవుడు చెప్పినదంతా సత్యమే అయినప్పుడు మనిషి ఒప్పు కున్నా, ఒప్పుకోకపోయినా అది ప్రత్యక్షముగా జరిగి తీరునదిగా ఉండును. దేవుని జ్ఞానము ప్రత్యక్షముగా జరిగినప్పుడు ఆయన మాట సత్యమని నిరూపించబడుతున్నది. నేడు మనుషులు తమమాటను దేవుని మాటలలో కలిపి ఇది దేవుని జ్ఞానమే అని నమ్మబలుకుచున్నారు. అప్పుడు ఏది దేవుని జ్ఞానమని తెలియుటకు జరిగితీరునది దేవుని జ్ఞానమనీ, జరుగనిది దేవుని జ్ఞానము కాదని తెలిసిపోవుచున్నది. ఏది నిజమైన జ్ఞానము అని తెలియుటకు ఇది నిజమైన జ్ఞానమని తెలియుటకు ప్రత్యక్షముగా జరుగునదేనని తెలియవలెను. అదే విధముగా కొన్ని సమాజముల వారు దేవతల జాతియున్నదని చెప్పుచుండగా, మరికొన్ని సమాజములవారు దేవతలే లేరు అని అంటున్నారు. ఎవరు ఏమనినా దేవతాజాతి మానవుల మీద పెత్తనము చెలాయించుటకు, మానవులను దేవుని మార్గమునుండి తప్పించి తమ మార్గములోనికి లాగుకొనుటకు తయారయి ఉన్నారు. దేవుడే ఆ విధముగా ఉండునట్లు దేవతలను సృష్ఠించాడు. దేవతలు భూమిమీద ఉండుట వాస్తవమే అయినా, మనుషుల బుద్ధి గ్రాహితశక్తిని బట్టి దేవతలను ఉన్నారని కొందరు, లేరని కొందరు చెప్పుచున్నారు. దేవుడు ఏ ఉద్దేశ్యముతో దేవతలను తయారు చేశాడో, ఆ ఉద్దేశ్యము ప్రకారమే దేవతలు నడుచుకొను చున్నారు. దేవుని భావమును అనుసరించి మనుషుల మీద వారి పెత్తనమును చెలాయిస్తున్నారు. మనకు తెలిసినా తెలియకపోయినా దేవతల నుండి కొన్ని కష్టాలను మనుషులు అనుభవిస్తున్నారు. ఒక రౌడీ పదిమంది మనుషులను పీడించినట్లు కొందరు దేవతలు ఎంతోమందిని, ఎన్నో

విధములుగా బాధించుచున్నారు. మనుషులు అనుభవించు కొన్ని బాధలు దేవతల వలన వచ్చినవని చాలామందికి తెలియదు. దేవతలు లేరు అనువారు కూడా దేవతలతో ఇబ్బంది పడుచున్నారు.

బయట ప్రపంచములో ఇతర మనుషులైన దుర్మార్గులనుండి చాలామంది పీడింపబడినట్లు, ఇతర దుర్మార్గపు దేవతలనుండి దేవతలు లేరు అను వారుకూడా బాధపడుచున్నారు. బయట మనుషులయిన దుర్మార్గులు కనిపించుచుండుట వలన వారి వలన మేము ఇబ్బంది పడుచున్నామని బయటికి చెప్పుకొనుచున్నాము. అయితే కనపడని రౌడీ దేవతల వలన ఇబ్బందిపడువారు ఎవరిమీదా ఆరోపణ చేయలేరు కదా! ఇబ్బంది పెట్టువారు కనపడనప్పుడు ఫలానా వారివలన నేను కష్టపడుచున్నానని కష్టాలు పొందువానికే తెలియదు. అందువలన దేవతలను గురించి కొందరు ఏమీ చెప్పలేకపోవుచున్నారు. కొందరు దేవతలే లేరని చెప్పుచున్నారు. భూమిమీద దేవతలు లేరు అనువారు కూడా దేవతల వలన అనేక రోగములను పొందుచున్నారు. వారివలన కొన్నిచోట్ల ఎన్నో బాధలను అనుభవించుచున్నారు. దేవతలు కొందరు మనుషుల యెడల దయా దాక్షిణ్యము లేకుండా ప్రవర్తించుచున్నారు. తమ పనులకొరకు మనుషులను బలిపశువులను చేయుచున్నారు. దేవతలు మనుషుల ఎడల అనుచితముగా ప్రవర్తించి, మనుషులకు హాని కలిగించినందుకు కొన్ని సందర్భములలో మేము దేవతలను దండించడము జరిగినది. మనుషుల వలె ప్రవర్తించి పాపములను మూటకట్టుకోవద్దని హెచ్చరించి చెప్పడము జరిగినది. అప్పుడు కొందరు దేవతలు మా మాటను విని, వారి ప్రవర్తనను మార్చుకొన్నవారు కూడా కలరు.

**వారి ప్రశ్న :- దేవతలలో ఎందరో అక్రమముగా సంచరించువారు,**

**దుర్మార్గులుగా, రౌడీలుగా యున్నవారు ప్రజలను ఇబ్బంది పెట్టునప్పుడు వారికంటే తక్కువ జాతియైన దైయ్యములు కూడా కొన్ని అదే విధముగా దుర్మార్గముగా ఉండునని అర్థమగుచున్నది. భూమిమీద కొన్ని సమాజముల వారు దేవతలు లేరు, దైయ్యములు లేవని చెప్పుచుందురు. వాటి ప్రస్తావన ఎక్కడా వారి మాటలలో ఉండదు. అటువంటి వారిలో కూడా కొందరు దైయ్యాలున్నాయని వాటివలన కొన్ని పీడలు, బాధలు కల్గుచున్నవని చెప్పుచూ, వాటి నివారణకు తాయెత్తులు కట్టుచూ కొంత డబ్బును సంపాదించుకొను వారు కూడా కలరు. ముస్లీమ్‌లు దైయ్యములను, దేవతలను నమ్మకున్నా, అవి లేవు అని చెప్పుచున్నా కొందరు ముస్లీమ్‌లు దైయ్యములకు మంత్రాలు చెప్పుచూ, తాయెత్తులు కట్టువారు కలరు. దీనినిబట్టి ముస్లీమ్‌లు దేవతలను దైయ్యములను ఉన్నాయని నమ్ముచున్నట్లా? నమ్మనట్లా? ఎలా లెక్కించు కోవాలి?**

**మా జవాబు :–** ముస్లీమ్‌లు మేము జ్ఞానులము అని అనువారంతా దేవతలను దైయ్యములను లేవు అంటున్నారు. జ్ఞానము తెలియనివారు వీటిని గురించి ఏమీ మాట్లాడడము లేదు. అయితే కొందరు అరుదుగా దైయ్యము లకు తాయెత్తులు కట్టడము చేయుచున్నారు. దేవుని సృష్ఠి కొందరికి అర్థమయి వుండవచ్చును, కొందరికి అర్థముకాకపోయి ఉండవచ్చును. అర్థము కాకపోయినా వారు కనిపించే స్థూలమునే నమ్ముచూ కనిపించని సూక్ష్మమును లేదంటున్నారు. సూక్ష్మము ఉన్నది లేనిది మనుషుల నిర్ణయము మీద ఆధారపడి లేదుగానీ, దేవుని సృష్ఠిమీద, దేవుని జ్ఞానముమీద ఆధారపడి యున్నది. ఎన్నో సత్య సంఘటనలలో దేవతలు, దైయ్యములు ఇరువురు కలరని తెలిసి పోయినది. దేవతలు మనుషుల ఎడల దౌర్జన్యముగా, దుర్మార్గముగా ప్రవర్తించుచున్నారని తెలియుచున్నది. దానివెనుక కారణము

కర్మే అయినా, బయటికి దేవతలు ఆచరణలో మనుషుల మీద పెత్తనము చెలాయిస్తూ, మనుషులను పీడించి వేధించు చున్నారు. దేవతలను చూచిన దైయ్యములు మేము మీకంటే ఏమి తక్కువ అన్నట్లు ప్రవర్తించుచూ, దేవతలవలె వీరు కూడా మనుషుల మీద దౌర్జన్యముగా ప్రవర్తించుచున్నారు. దేవతలు, దైయ్యములు లేవు అనువారిని గానీ, ఉన్నాయను వారినిగానీ ఎవరినీ వారు వదలడము లేదు. దేవతలు, దైయ్యములు లేవు అనువారిని కాస్త ఎక్కువగానే వేధించుచున్నారని తెలియుచున్నది.

నేడు భూమిమీద రోగముల రూపములో యున్నవన్నీ కనిపించని సూక్ష్మముల వల్లనే వచ్చునవిగా యున్నా, వాటిలో ఖగోళములోని భూతముల వలన, గ్రహముల వలన కొన్ని రోగములు కలుగుచున్నా, కొన్ని రోగములు మాత్రము భూమిమీద సంచరించు దేవతల వలన, దైయ్యముల వలన కల్గుచున్నవి. మనుషులకు రోగమువలె వచ్చు పార్శ్వవాయువు లేక పక్షవాత వాయువు అను ఒక ప్రక్క కాళ్ళు, చేతులు పడిపోవు రోగమును చాలామంది చూచియే ఉందుము. ఆ రోగమును గురించి అడిగితే మెదడులో నాడీవ్యవస్థ దెబ్బ తినడము వలన ఆ రోగము వస్తుందని వైద్యులు చెప్పుచున్నారు. అయితే మెదడులో అతి భద్రముగాయున్న నాడీవ్యవస్థ ఎలా దెబ్బతినిందో చెప్పలేకపోవుచున్నారు. ఈ రోగము వెనుక దాదాపు ఇరువదైదు (25) శాతము ఖగోళములోని భూతములు, గ్రహములు కారణముకాగా, దాదాపు డెబ్బయి ఐదు (75) శాతము భూగోళములోని దేవతలు, దైయ్యములు కారణమగుచున్నవని బహుశా ఎవరికీ తెలియదనుకుంటాను. పార్శ్వ వాయువును గురించి ఆ రోగము ఎవరివలన కల్గుచున్నదో, ఎవరివలన ఎంత శాతము కల్గుచున్నదో 1980వ సంవత్సరములోనే చెప్పగలిగాము. 1970 నుండి మేము జరిపిన పరిశోధనలో దేవతలు, దైయ్యాల విషయమును, భూతములు, గ్రహముల విషయమును తెలియగలిగి

1980వ సంవత్సరములోనే ఇప్పుడు చెప్పిన పార్శ్వవాయువు విషయమును అప్పుడే చెప్పగలిగాము.

పార్శ్వవాయువు పూర్తి సూక్ష్మముగా మనకు తెలియకుండా మనతో పాటు భూమిమీద నివసించు దేవతల వలన, దైయ్యముల వలన 75 శాతము కల్గుచున్నదంటే ఎవరూ నమ్మలేని స్థితియైనా జరుగుచున్న సత్యము అంతేనని చెప్పుచున్నాము. ఆ ఒక్క రోగమేకాక నేడు భయంకర రోగములుగా, పెద్ద రోగములుగా పేరుగాంచిన ఎయిడ్స్ (H.I.V) రోగము, క్యాన్సర్ మొదలగు రోగములు ఎన్నో భూతముల వలన గ్రహముల వలన వచ్చునవనీ, మిగతా ఎన్నో రోగములు దేవతలు, దైయ్యముల వలన కల్గు చున్నవని చాలామందికి తెలియదు. ఈ రోగములు పైకి క్రిముల వలన కల్గుచున్నవని డాక్టర్లు చెప్పుచున్నా, ఆ క్రిముల వెనుక పని చేయునది కొన్ని అగోచరశక్తులని చాలామందికి తెలియకుండా పోయినది. కలరా, ప్లేగు, డెంగ్యూ రోగములు దేవతల వలన కల్గునవనీ, మంగు పొంగు అను చర్మ రోగములు దైయ్యముల వలన కల్గునవని మనకు తెలియదు. కలరా ఒక దేవతయని తెలిసిన షిరిడీ సాయిబాబా, ప్రక్కవూరిలో యున్న కలరాను తమ ఊరిలోనికి రావద్దని ఊరిలోనికి వచ్చుదారిలో రొట్టెపిండితో అడ్డగీత గీచినట్లు పిండిని వేయడము వలన, అక్కడవరకు వచ్చిన కలరా అను దేవత సాయిబాబాగారు పిండితో వేసిన గీతను చూచి అంతగొప్ప వ్యక్తి చెప్పినమాటను జవదాటడము మంచిది కాదని తలచి వెనుదిరిగి పోయింది. ఇక ఆ ఊరిలోనికి రాలేదు. ఇది చరిత్రలో అందరికీ తెలిసిన విషయమే. దీనినిబట్టి దేవతలు, దైయ్యములు ఎలా ప్రవర్తించుచున్నవో తెలియగలరు.

**వారి ప్రశ్న :- దేశములో ఎంతోమందిని ఇబ్బంది పెట్టి రోగములపాలు చేసిన**

**ఆకాశములోనున్న భూతములు, గ్రహములు భూమండలములోయున్న దేవతలు, దైయ్యములు మనుషులలో ఒకరైన మిమ్ములను ఏమీ అనకుండా, ఏమీ చేయకుండా వదలి పెట్టియుండునా? అని కొందరికి ప్రశ్న వచ్చినది. వారివలన మీరు బాధింపబడలేదా? ఇలా అడిగానని ఏమీ అనుకోవద్దండి ఇది మిగతా ప్రజలకేకాక మాకు కూడా వచ్చిన ప్రశ్నగాయున్నది. అందువలన అడుగుచున్నాము.**

**నా జవాబు :-** మంచి బుద్ధియున్నవారు మంచిగా, చెడు బుద్ధియున్నవారు చెడుగా ప్రవర్తించుట సహజముగా జరిగేపని. కనిపించే మనుషులలో ఎటువంటి ప్రత్యేకత లేని సాధారణ మనిషిగా నేను ఉండెడివాడిని. గతములోని నా చరిత్రను గురించి ఏమాత్రము దాచుకోకుండా నేను **"గుత్తా"** అను గ్రంథములో చెప్పియున్నాను. చిన్నవయస్సులో దేవతల దృష్టి, దైయ్యాల దృష్టి ఎవరిమీదా అంతగా ఉండదు. అందువలన అప్పుడు వారివలన నాకు ఏ ఇబ్బంది కలుగలేదు. నేను యుక్తవయస్సుకు వచ్చేటప్పటికి డబ్బులేని వానికి మనుషుల మధ్యలో విలువ ఉండదని తెలిసింది. అప్పటికే ఎంతోమంది మనుషులు మాతో అగౌరవముగా మాట్లాడడము, బంధువులందరూ నీచముగా చూడడము జరిగెడిది. అప్పటికి స్థూల ప్రపంచము బాగా అర్థమయినది. అయితే ఆనాడు ఏ జ్ఞానములేని నాకు సూక్ష్మ ప్రపంచమును గురించి ఏమాత్రము తెలియదు. అటువంటి స్థితిలో నేనున్న ఊరికి ప్రక్కనున్న పల్లెటూరి నుండి గుండెలో నొప్పియున్న ఒక ఆడమనిషిని ఆమె అన్నగారు మరియు భర్త నేనున్న ఊరిలోని ఆసుపత్రికి తెచ్చారు. వారు పేదవారయిన దానివలన ప్రభుత్వ ఆసుపత్రికి పోవడము జరిగినది. అక్కడ ఒక వారము రోజులున్నా ఆ నొప్పి ఆమెకు నయము కాలేదు. ఆమె అన్నగారు నాకు కొంత పరిచయముండుట వలన ఆ విషయమంతా నాతో చెప్పడము జరిగినది. 1970వ సంవత్సరమునుండి

నేను వైద్యమును గురించి మనిషి ఆరోగ్యమును గురించి కొంత నా స్వయం పరిశోధన సాగించుచుండెడి వాడిని. అందువలన గుండెలో నొప్పియున్న ఆమె విషయము చెప్పి వారము రోజులుగా ఆసుపత్రిలో యున్నా బాగు కాలేదని చెప్పడముతో నేను కొంత ఆలోచించి నా పరిశోధన నిమిత్తము ఆమెను నావద్దకు తీసుకరమ్మని చెప్పడము జరిగినది. ఆ దినము నేను ఆమె రోగమును నయము చేయుటకు రమ్మని చెప్పలేదు. వ్యాధిని గురించి తెలుసుకొను నిమిత్తము మాత్రమే రమ్మని చెప్పడము జరిగినది.

ఆసుపత్రిలో ఎటూ బాగుకాలేదు, ఇక ఇంటికి పోవాలని నిర్ణయించు కొన్నవారు, నా మాటను విని నా వద్దకు తెచ్చారు. ఆ దినము వారికి కూడా నేను వైద్యము చేసేవాడిని కాదని తెలుసు. ఆమె అన్న నాకు పరిచయస్థుడయిన దానివలన, వారు కూడా ఆసుపత్రి వదలి వెళ్ళాలని అనుకొన్నదానివలన, వారి ఊరికి సాయంకాలము బస్సుయుండుట వలన అంతవరకు మా ఇంటివద్ద యుండవచ్చునులే అనుకొని వారు రావడము జరిగినది. అప్పుడు 1974వ సంవత్సరము అనుకుంటాను. అప్పటికి నాకు 24 సంవత్సరముల వయస్సు వచ్చినది. అంతవరకు బాల్యములో యున్న నేను యవ్వనములోనికి వచ్చియుండుట వలన నాలోని వ్యక్తిత్వ వికాసము వృద్ధి అవుతుంటుంది. ఆ దినము ఉదయము 9 గంటలకు వారు మా ఇంటికి వచ్చిన తర్వాత 9.30 నిమిషములకు నేను గుండె నొప్పియున్న ఆమెను నా ముందర కూర్చోమని చెప్పి, ఆమెను నొప్పిని గురించి తెలుసుకొనుటకు నొప్పి ఎప్పుడు వచ్చింది, ఎలా వచ్చింది, మొదట ఎలా ఉండేది, తర్వాత ఎలా ఉంది? అని ప్రశ్నించి ఆమె చెప్పినదంతా వింటూ, ఒకమారు నీ నొప్పి ఎక్కడుందో చెప్పమని అడిగాను. అప్పుడు ఆమె బాగా గమనించి, ఇంతవరకు యున్న నొప్పి మీరు ఎక్కడుందో

చెప్పు అంటూనే లేకుండా పోయినదని చెప్పింది. ఆ మాట వినిన అక్కడున్న ఐదారుమందితో సహా నేను కూడా ఆశ్చర్యపోయాను. ఒకమారు బాగా చూచుకొని చెప్పమని అడిగాను. అప్పుడు కూడా ఆమె బాగా గమనించుకొని ఏమీలేదని చెప్పడము జరిగినది. నా జీవితములో అదే మొదటి అనుభవము అయినందున ఆ విషయము నాకు కూడా అర్థముకాలేదు. ఆమెకు నొప్పి ఉన్నట్లుండి లేకుండా పోవడముతో ఆమె భర్తకు, అన్నకు ఇద్దరికీ సంతోషమయింది. ఇక్కడే ఒకరోజు ఉండి రేపు పోతామని వారు అడుగగా సరేనని నేను చెప్పి నా పని నిమిత్తము బయటికి వెళ్ళిపోయి సాయంకాలము వచ్చాను.

సాయంకాలము ఆరుగంటల సమయములో ఆమె కొద్దిగా నొప్పితో బాధపడుచూ ఆ విషయము మాకు చెప్పడమైనది. అప్పుడు నేను ఆమెను నా ముందర కూర్చోమని చెప్పగా, ఆమె అలాగే కూర్చొని అంతవరకు నన్ను ఎవరూ పిలువని **"స్వామీ"** అను పదమును పలుకుచూ మాట్లాడడము జరిగినది. అప్పుడు మాట్లాడు ఆమె ఒక దేవతయని వారు చాలాకాలము నుండి ఆ దేవతను ఆరాధించెడివారనీ, ప్రతి సంవత్సరము పూజలు చేసేడివారనీ, అయితే ఇప్పుడు ఆమెను పూజించడము మానివేశారనీ, ఆ దేవత బదులు ఇంకొక దేవతను ఆరాధించుచున్నారనీ, అందువలన వారిమీద కోపముతో ఆమెకు గుండెలో నొప్పి వచ్చునట్లు చేశాననీ, ఇప్పటికి మూడుచోట్ల ముగ్గురు వైద్యులతో చూపించినా ఎక్కడా నొప్పిపోలేదనీ ఇక్కడ మీ ముందరికి రావడముతోనే నేను భయపడి లోపల వణికిపోతూ ఉంటిననీ, చివరిగా మీరు నీ నొప్పి ఎక్కడ ఉందో చెప్పమన్నప్పుడు ఆమెను నొప్పించకుండా వదలివేశాననీ, అందువలన ఆమెకు నొప్పి అప్పుడు ఏమాత్రము లేకుండా పోయినదని చెప్పింది. అప్పుడు నేను ఈ విధముగా

అనేక ప్రశ్నలనడిగి సూక్ష్మలోకము యొక్క వివరమును కొంత తెలుసుకో గలిగాను.

**నేను :-** నీవు నన్ను 'స్వామీ' అని ఎందుకు పిలిచావు?

**దేవత :-** అంతకంటే గొప్ప పదము నాకు తెలియదు. అందువలన నాకు తెలిసిన పదముతో గౌరవముగా పిలువాలని పిలిచాను?

**నేను :-** నన్ను ఎందుకు గౌరవముగా మాట్లాడవలెనని అనుకొన్నావు?

**దేవత :-** నేను ఎంతోమంది స్వామీజీలను, బాబాలను చూచాను. వారందరిలో లేని వెలుగు మీలోయున్నది. అందువలన మీలోని శక్తికి నేను మిమ్ములను చూస్తూనే భయపడిపోయాను. నేను ఎంత దేవతనయినా మీ శక్తి ముందర నేను నిలువలేను. మీలోని వేడికి నేను తట్టు కోలేకున్నాను. ఎక్కువసేపు మీతో మాట్లాడలేను. మీరు సెలవిస్తే నేను ఈమె నుండి దూరముగా పోతాను. ఎప్పటికీ ఈమె దరికి కూడా రాను.

**నేను :-** సరే! నీవు పోవచ్చును. (అని నేను చెప్పగానే ఆమె ఒక ప్రక్కకు వాలిపోయింది. ఒక నిమిషము తర్వాత లేచింది. లేచినది మామూలు మనిషి అయినందున అంతవరకు అక్కడ ఏమి జరిగినది ఆమెకు తెలియ లేదు. ఆ విషయము నాకు తెలిసి ఆమెను ప్రక్కన కూర్చోమన్నాను.)

ఈ విధముగా నా మొదటి అనుభవములోనే ఒక దేవతతో మాట్లాడడము జరిగినది. తర్వాత సూక్ష్మలోకమును గురించి ఒక్కొక్క విషయము నేను ఊహించుకొన్నది బయట ప్రత్యక్షముగా తెలిసిపోయెడిది. అప్పటినుండి ఎంతోమంది దేవతలతోనూ, దైయ్యములతోనూ నేను మాట్లాడడము జరిగినది. కొందరు గౌరవముగా మాట్లాడితే కొందరు తలబిరుసుగా మాట్లాడినవారు కూడా కలరు. అటువంటివారు తర్వాత

క్షమాపణ అడిగిన సందర్భములు కూడా కలవు. కొందరు దేవతలు నీ అంతు చూస్తానని నన్ను బెదిరించిన వారు కూడా కలరు. అటువంటివారు నా చేతిలో శిక్షార్హులైనారు. సూక్ష్మముగా కనిపించని దేవతలతోనూ, దైయ్యములతోనూ ఎన్నోమార్లు మాట్లాడడము జరిగినది. వారి రహస్యము లన్నీ తెలుసుకోవడము జరిగినది. నన్ను అగౌరవముగా మాట్లాడిన దేవతలు, దైయ్యములున్నా, వారు నా వైపు తల ఎత్తి చూచిన వెంటనే క్షమాపణ చెప్పిన వారు గలరు. బ్రతికియున్న కనిపించే మనుషులలో నేను డబ్బులేనివాడినని విలువలేకున్నా, కనిపించని దేవతలలో గొప్ప గౌరవముండెడిది. నా వయస్సు పెరుగుకొలది నాలోని ఆధ్యాత్మికము పెరిగినది. నేను ఎక్కడా జ్ఞానమును నేర్వకున్నా సహజముగా నాలో జ్ఞానము బయటికి వచ్చేది. నేను ఊహించినదే నేను 30 సంవత్సరముల క్రితము చెప్పినదే నేడు దైవగ్రంథములలో ఉండడము వలన మూడు దైవ గ్రంథములలోని జ్ఞానము నాకు చాలా సులభమైపోయినది. మొదటి రోజు ఒక దేవత నన్ను 'స్వామీ' అని ఎందుకు సంబోధించినదో ఇప్పుడు నాకు బాగా అర్థమయినది. అప్పటినుండి నాలోని వ్యక్తిత్వము పెరుగుకొలది జ్ఞానము కూడా బయటపడుచూ వచ్చినది. వాస్తవముగా ఈ జన్మలో నేను ఒక్క ముక్క జ్ఞానమును కూడా తెలియలేదు. అయినా నాకు మూడు దైవగ్రంథములలోని జ్ఞానము సులభముగా కనిపించుచున్నది. ఎంత క్లిష్టమైన వాక్యమునకైన భావము అట్లే తెలిసిపోవుచున్నది

నాలోని జ్ఞానశక్తి కనిపించునది కాదు. సూక్ష్మమైనది కావున స్థూల మైన మనుషులకు ఏమాత్రము నా విలువ తెలియకపోయినా సూక్ష్మమైన దేవతలకు, దైయ్యములకు సూక్ష్మమైన శక్తి కనిపించడము వలన వారు నాలోని గొప్పతనమును గ్రహించి గౌరవముగా మాట్లాడడము జరిగినది.

అయితే మనుషులకు నా విలువ ఏమాత్రము తెలియదనియే చెప్పవచ్చును. అందువలన నేటికినీ మనుషులు నన్ను హేళనగా, దూషణగా మాట్లాడు చున్నా, నన్ను గౌరవించు దేవతలు ఎందరో గలరు. ఈ మధ్యకాలములో దాదాపు ఐదు సంవత్సరముల క్రితము బ్రహ్మముగారు వ్రాసిన కాల జ్ఞానములో మా పేరుండడము చూచి, అందులో మా జ్ఞానము గొప్పదని చెప్పియుండడము చూచి, కొందరు మనుషులు కొంత గౌరవము నిచ్చు చున్నారు. అయితే మొదటినుండి దేవతలు, దైయ్యములు మమ్ములను గౌరవించడము జరుగుచున్నది. దాదాపు పది సంవత్సరములనుండి ఖగోళములోని గ్రహములు, భూతములు కూడా మమ్ములను గౌరవించడము వలన, మావద్దకు వచ్చిన వారికి ఉన్న రోగములను భూతములు, గ్రహములు వెనక్కు తీసుకోవడము జరిగినది. ఈ విధముగా ఎందరికో రోగములు సులభముగా నయమైపోవడము వలన కొందరు మనుషులు ఇప్పుడిప్పుడు గౌరవముగా చూస్తున్నారు. ఇప్పటికీ ఎప్పటికీ మనుషులలో లేని విలువ భూతముల, గ్రహముల, దేవతల, దైయ్యముల మధ్యగలదని చెప్పుచున్నాము. అందువలన ఏ భూతము వలనగానీ, ఏ దేవత వలనగానీ నాకు ఇబ్బంది లేదు. భూతములు, గ్రహములు, దేవతలు నన్ను ఎప్పుడూ ఇబ్బంది పెట్టలేదు గానీ, నన్ను దూషించిన వారినే దేవతలు, భూతములు, గ్రహములు చాలా ఇబ్బంది పెట్టారు.

**వారి ప్రశ్న :- క్షమించండి, మా దృష్ఠికి వచ్చిన ఇతరులు అడిగిన ప్రశ్నను మీకు తెలుపుచూ దీనికి మీరేమంటారో తెలుసుకోగోరుచున్నాము? ఇది ఇంటర్‌నెట్‌లో ఫేస్‌బుక్‌నందు ఒక ముస్లీమ్ అడిగిన ప్రశ్నలను మేము 2015 సెప్టెంబర్ 19వ తేదీన చూచాము వాటినే అడుగుచున్నాము?**

**మా జవాబు :-** ఎవరు ఏ ప్రశ్నయినా అడుగవచ్చును. ప్రశ్న అడుగడములో తప్పులేదుగానీ, చెప్పిన జవాబును గ్రహించుకోకపోతే ఎంతో విలువయిన జవాబు బూడిదలో పోసిన పన్నీరు కాగలదు. అలా కాకుండా జవాబును స్వీకరించండి.

**వారి ప్రశ్న:- "త్రైత సిద్ధాంత ప్రచారకులు తౌరాత్‌ను భగవద్గీతగా చెప్పకొంటూ దేవుడు కృష్ణుని రూపములో, ఏసు రూపములో అవతరించాడని ప్రచారము చేస్తూ, ఖురాన్‌లోని వాక్యములను వక్రీకరిస్తూ అరువుకు తెచ్చుకొన్న జ్ఞానముతో, అతుకుల జ్ఞానముతో విగ్రహారాధనను బలపరుస్తూ, తాము మూడు గ్రంథాలలోని జ్ఞానబోధను చేస్తున్నామని చెప్పకొంటున్నారు" అని గలదు. దీనికేమంటారు?**

**మా జవాబు :-** దీనిని ఎవరూ ఎట్టి పరిస్థితిలోనూ ప్రశ్న అనరు. దీనిని విమర్శ అంటారు. ఎవరు ఏమనినా మేము ఓపికతో వింటాము. ప్రపంచ మన్నాక ఇటువంటి ఆటుపోట్లు సహజముగా ఉంటాయి. విమర్శ చేయడములో ఒక పద్ధతంటూ ఉంటుంది. మేము చెప్పిన విషయము ఎలా తప్పో చూపించి చెప్పితే బాగుంటుంది. అలా కాకుండా నాకు తెలిసిందే సరియైనది, మీది తప్పు అంటే అది సద్‌విమర్శ క్రిందికి జమ కట్టబడదు. అసూయతో చెప్పిన మాటలుగా లెక్కించబడుతాయి. ఏదయినా చిల్లర మనుషులు బజారులో మాట్లాడుకొన్నట్లు కాకుండా పెద్దమనుషులు అడిగినట్లు అడగండి. అట్లుకాకుండా అరువుకు తెచ్చుకొన్న జ్ఞానము, అతుకుల జ్ఞానము అని మీరు అనుటకు మేము ఎక్కడినుండి అరువుకు తెచ్చుకొన్నామో చెప్పగలరా? మేము చెప్పేది ఇంకొక చోట వుంటే అక్కడి నుండి తెచ్చుకొన్నట్లగును. మేము చెప్పే విషయములు దైవగ్రంథము లోనివై యుంటాయి. అక్కడలేనివేవయినా వుంటే మాతోనే ప్రారంభమయి

వుంటాయి. కాబట్టి మీరు అరువు తెచ్చుకొన్న జ్ఞానము అనినా, చదివిన వారు నీ మాటనే తప్పంటారు. నేను చెప్పు జ్ఞానము శాస్త్రబద్ధమై ఉన్నప్పుడు, సత్యబద్ధమై ప్రత్యక్ష ప్రమాణమై ఉన్నప్పుడు అతుకుల జ్ఞానమని చెప్పుటకు ఆధారమేమయినా ఉన్నదా? ఇది అసూయతో చెప్పుమాట అని అందరికీ తెలియును. దేవుడు కూడా ఈ మాటను ఒప్పుకోడు.

మేము భగవద్గీతను తౌరాత్ గ్రంథముగా చెప్పుమాట వాస్తవమే. మా మాటను కాదనుటకు మీరు తౌరాత్ గ్రంథమేదో చూపగలరా? తౌరాత్ గ్రంథమునకు గ్రంథకర్త ఎవరో తెలియదు? అది ఏ భాషలో వ్రాశారో తెలియదు? అది ఎంత గ్రంథమో తెలియదు? అని కొందరు ముస్లీమ్ పెద్దలు చెప్పగా విన్నాము. అలాగే వ్రాసిన వ్రాతను కూడా చూశాము. మేము తౌరాత్ గ్రంథమును తక్కువచేసి చెప్పియుంటే బాధపడవలెను గానీ దానిని ప్రథమ దైవగ్రంథమని గొప్పగా చెప్పునప్పుడు తప్పేముంది. మాకు తెలిసో తెలియకో చెప్పామనుకో! మీరు తౌరాత్ గ్రంథమును తెచ్చి చూపగలరా? అలా చూపండి! మా మాట తప్పని ఒప్పుకొంటాము.

**వారి ప్రశ్న :- త్రైత సిద్ధాంత ప్రచారకుల వాస్తవ వక్రీకరణ : దివ్య ఖురాన్ 5-68 వాక్యము ఇలా ఉంది. "వారికి చెప్పు, గ్రంథముగల ప్రజలారా! మీరు తౌరాత్‌ను, ఇంజీలును, మీ ప్రభువు తరపునుండి మీపై అవతరించిన దానిని (ఖుర్‌ఆన్‌ను) స్థాపించనంత వరకు మీకంటూ ఒక ప్రాతిపదిక లేనట్లే, నీ ప్రభువు తరపున నీవద్దకు పంపబడినది వారిలోని అనేకుల తలబిరుసుతనాన్ని మరింత పెంచుతుంది. కనుక నీవు ఈ తిరస్కార జనుల స్థితిపై విచారపడకు. తౌరాతు, ఇంజీలు, ఖురాన్‌లోని ప్రధానమైన ఆజ్ఞ "పూర్ణ హృదయముతో, పూర్ణాత్మతో, పూర్ణవివేకముతో నిజదేవుడు నిజ ప్రభువును ఆరాధించడము, ఆయన్ను అమితముగా ప్రేమించడము, విగ్రహారాధన త్యజించడమును చేయవలెను" అని కలదు.**

**మా జవాబు :-** "వానికి పిచ్చి ముదిరింది రోకలి తలకు చుట్టితే బాగవుతుందని" లోగడ ఒకడన్నాడట. ఎదుటివానికి పిచ్చి ముదిరిందని చెప్పి ఊరకుంటే మిగతా వినేవారు నిజమేనేమో! అని అనుకొనెడివారు. ఎదుటి వానికి పిచ్చి అని చెప్పేవాడు అంతటితో ఆగక, రోకలిని తలకు చుట్టండి అని అన్నప్పుడు, ఆ మాటను విన్నవారంతా ఎదుటివానికి పిచ్చి లేదు, చెప్పేవానికే పిచ్చి అని అందరూ చెప్పే వానిని చూచారట. ఎందుకంటే రోకలిని తలకు ఎవరూ చుట్టరు, చుట్టలేరు. రోకలి అనునది ఏమాత్రము వంగని గట్టి కట్టెగాయుండుట వలన అది వంగేది కాదు. అటువంటి రోకలిని తలకు చుట్టమనువాడే నిజముగా పిచ్చివాడని అక్కడున్నవారికి తెలిసి పోయినదట. అలాగే ఇక్కడ మాట్లాడువారు ఎదుటివారు అజ్ఞానులనుచూ అంతటితో ఆగక, ఇంకా సంబంధములేని వాక్యములు చెప్పడముతో, ఎదుటివాడుకాదు నిజముగా ఆమాట చెప్పువాడే అజ్ఞాని అన్నట్లు తెలియుచున్నది. అతడు మమ్ములను వక్రీకరణ చేయువారు అని ఊరక ఉండివుంటే బాగుండేది. అట్లు కాకుండా మిగతా వాక్యములు చెప్పడముతో అతనిలోని ఉద్దేశ్యము సరిగాలేదని, అసూయతో కూడుకొన్నదని తెలియుచున్నది. ఆయన చెప్పినది అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఇలా ఉంది చూడండి. **(5-68) "ఇలా చెప్పు. ఓ గ్రంథ ప్రజలారా! మీరు తౌరాతును, ఇంజీలును మరియు మీ ప్రభువు తరపునుండి మీపై అవతరింపజేయబడిన దానిని (ఖురాన్ గ్రంథమును) ఆచరించనంతవరకు, మీ జీవితాలలో నెలకొల్పనంతవరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే, నీ ప్రభువు తరపునుండి నీపై అవతరింపజేయబడినది వారిలోని తలబిరుసు తనాన్ని, తిరస్కారవైఖరిని మరింత అధికము చేస్తుంది. కనుక ఈ తిరస్కార జనుల గురించి దిగులు చెందకు"** అని వాక్యము కలదు. ఆయన అంతటితో

ఆపక తౌరాత్, ఇంజీల్, ఖురాన్‌లలోని ప్రధానమైన ఆజ్ఞ అని మొదలు పెట్టాడు. "పూర్ణహృదయముతో, పూర్ణాత్మతో, పూర్ణ వివేకముతో నీ నిజ దేవుడు, నిజ ప్రభువును ఆరాధించడము, అధికముగా ప్రేమించడము, విగ్రహారాధన త్యజించడము" అని వ్రాశారు. అయితే ఈ వాక్యము బైబిలు క్రొత్త నిబంధనలో మత్తయి సువార్త, 22వ అధ్యాయములో 36, 37, 38, 39, 40 వాక్యములలో ఇలా కలదు చూడండి. **"(36) బోధకుడా! ధర్మ శాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞ ఏది? అని అడిగెను. అందుకాయన (37) నీ పూర్ణ హృదయముతోనూ, నీ పూర్ణాత్మతోనూ, నీ పూర్ణ మనస్సు తోనూ నీ దేవుడైన ప్రభువును ప్రేమించవలెననునదియే (38) ఇది ముఖ్యమైనదియు, మొదటిదియునైన ఆజ్ఞ (39) నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించవలెనను రెండవ ఆజ్ఞయు దానివంటిదే (40) ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికినీ ప్రవక్తలకును ఆధారమైయున్నవని అతనితో చెప్పెను".**

ఇక్కడ బైబిలు మత్తయి సువార్తలోని ఐదు వాక్యములను చూస్తేగానీ అక్కడి సమాచారము అర్థము కాదు. అటువంటి దానిని పూర్తి చెప్పక సగము వరకు చెప్పి వదలివేయడము వలన వాక్యము విషయము అతనికి తెలియదని తెలిసిపోవుచున్నది. ముఖ్యమైన ఆజ్ఞలు రెండు గలవు. ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికీ ఆధారమని చివరిలో చెప్పియున్నారు. ఈ ప్రశ్నలో ఖురాన్ గ్రంథములోని (5-68) వాక్యమును కూడా సరిగా చెప్పక అస్పష్టముగా చెప్పియున్నారు. "తౌరాతు, ఇంజీలు, ఖురాన్ గ్రంథములను స్థాపించనంతవరకు" అని వ్రాశారు. అక్కడ "మీ జీవితములలో ఆచరించనంతవరకు" అని ఉండవలెను. "మీకంటూ ఒక ప్రాతిపదిక లేనట్లే" యని చెప్పారు. "ఆచరించనంతవరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే" అని ఉండవలెను. అనగా ఏ మతములో లేనట్లేయని

లేకపోతే ఏ మతధర్మములో లేనట్లేయని అర్థమగుచున్నది. మీకు ఇచ్చిన ఖురాన్ గ్రంథమును చూచి కొందరు తిరస్కారులకు తలబిరుసు తనము ఎక్కునని, వారిని లెక్కచేయకు అని చెప్పారు. ఇదంతా ప్రత్యేకమయిన సమాచారముకాగా, దానికి అనుబంధములేని బైబిలు వాక్యమును అక్కడ చెప్పడము జరిగినది. దానితో నన్ను విమర్శించాలనుకొను వారే విమర్శకు లోనైపోయారు. తిక్కపట్టిందని ఎదుటివానిని ఆరోపించునప్పుడు తెలివిగా మాట్లాడక 'రోకలి తలకు చుట్టు' అని చెప్పి, వాని పిచ్చిని బయటపెట్టు కొన్నాడట. అదే విధముగా అసందర్భముగా బైబిలు వాక్యము చెప్పి అనవసరముగా బయటపడిపోయాడు. అదియూ అక్కడ చెప్పిన బైబిలు వాక్యమును కూడా తప్పు చెప్పడమైనది. "నీ హృదయముతోనూ, నీ పూర్ణాత్మతోనూ, నీ పూర్ణమనస్సుతోనూ" అని చెప్పవలసియుండగా, 'నీ' అనే అక్షరమును చెప్పక వదలివేయడము వలన వాక్యములోని అర్థమే మారిపోగలదు.

మొదట ఖురాన్ గ్రంథములోని (5-68) వాక్యమును తీసుకొని చెప్పారు. అందులోని సారాంశము సరిగా చెప్పకనే బైబిలు వాక్యములోనికి పోయి ముఖ్యమైన ఆజ్ఞను గురించి చెప్పడమైనది. మొదటి వాక్యములో మూడు దైవగ్రంథములను అనగా భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలోని జ్ఞానమును మనిషి తన జీవితములో ఆచరించకపోతే, వాడు ఏ మత ధర్మములో లేనట్లేయని స్పష్టముగా చెప్పడమైనది. హిందువులుగా యున్న మేము ఖురాన్ గ్రంథము దైవగ్రంథము అని ఒప్పుకుంటున్నాము. అటువంటప్పుడు భగవద్గీతను దైవగ్రంథముగా మిగతా మతములవారు ఒప్పుకుంటే తప్పేమి? అని అడుగుచున్నాను. తౌరాతు గ్రంథమును భగవద్గీత అని అనుట తప్పు అని మీరు చెప్పుచున్నారు. మేము తౌరాతు

అను పదమునకు అర్థముతో సహా చెప్పి మూడు ఆత్మల రహస్యము గల గ్రంథమయిన 'భగవద్గీత'ను పూర్వము అరబ్బీ భాషలో 'తౌరాత్' అని చెప్పెడివారు. తెలుగు భాషలో మూడు అనుటను హిందీలో తీన్ అనీ, అరబ్బీ భాషలో 'తౌరాత్' అనీ ఇప్పటికీ అనుచున్నాము. భూమిమీద గ్రంథరూపమైన మొదటి గ్రంథము భారతదేశములోని భగవద్గీతయే. అందువలన ప్రథమ దైవగ్రంథము భగవద్గీతయని చెప్పడమైనది. 5150 సంవత్సరముల పూర్వము గ్రంథముగా రూపొందిన భగవద్గీతా జ్ఞానమే మిగతా బైబిలు, ఖురాన్ గ్రంథములలో గలదు అని చెప్పుటకు ఎన్నో సాక్ష్యములు గలవు. బైబిలు, ఖురాన్ గ్రంథములలోని జ్ఞానమే దానికి సాక్ష్యముగాయున్నది. భగవద్గీతను తౌరాత్ గ్రంథముగా మేము చెప్పితే సంతోషించాల్సింది పోయి విమర్శించడమేమిటి? (5-68) వాక్యములో "భగవద్గీత, బైబిలు, ఇప్పుడు మీకు ఇచ్చిన ఖురాన్ గ్రంథములోని జ్ఞానమును అనుసరించకపోతే" అని వుంది. దానిప్రకారమే మేము అన్ని గ్రంథములలోని జ్ఞానమును ఒప్పుకొంటున్నాము. మీరెందుకు భగవద్గీతను ప్రక్కనపెట్టి తౌరాత్ అంటే భగవద్గీత కాదంటున్నారని అడుగుచున్నాను. భగవద్గీత తౌరాతు ఒక్కటి కాకపోతే తౌరాతు గ్రంథమును మీరు ఎక్కడయినా చూపగలరా? అని అడుగుచున్నాను. మీరు ఎవరయినా చూచారా? అని అడుగుచున్నాము. దానిని ఏ భాషలో వ్రాశారో తెలుసా? అని ప్రశ్నించుచున్నాను. చేతనయితే చెప్పండి అని చెప్పుచున్నాము.

బైబిలు గ్రంథములోని మత్తయి సువార్త 22వ అధ్యాయములోని 37వ వచనమును కొంత చెప్పి, మిగతా విషయమును అక్కడ లేనిదానిని చెప్పడము జరిగినది. "నీ పూర్ణ హృదయముతో, నీ పూర్ణాత్మతో, నీ పూర్ణ మనస్సుతో నీ దేవుడైన ప్రభువును ప్రేమించవలెను" అని వాక్యమున్నది.

అయితే మీరు “నీ పూర్ణ వివేకముతో నీ నిజ దేవుడు, నిజ ప్రభువును ఆరాధించడము, అధికముగా ప్రేమించడము, విగ్రహారాధన త్యజించడము” అని వ్రాశారు. మీరు చెప్పిన వాక్యము అక్కడ లేనేలేదు. లేని వాక్యమును మీరు ఎందుకు వ్రాయవలసివచ్చినదో చెప్పమని మేము అడుగుచున్నాము. మేము విగ్రహారాధకులన్నట్లు మీరు లేనిపదమును ఉపయోగించి మమ్ములను ఆరోపణ చేయు నిమిత్తము బైబిలులో లేని పదమును వ్రాశారు. అక్కడ విగ్రహారాధన విషయమే చెప్పలేదు. ఆ పదమునే వాడలేదు. మమ్ములను వెక్కిరించినట్లు మేము విగ్రహారాధన చేసినట్లు మీరు చెప్పారు. నేను విగ్రహారాధకుడననీ, దేవతలను ఆరాధిస్తాననీ ఎక్కడయినా చెప్పామా? వ్రాశామా? మీరు చెప్పే దేవతలు, విగ్రహములు నన్నే గౌరవించుచున్నవనీ, నా మాటే వినుచున్నవనీ నేను కొన్నిచోట్ల చెప్పడము జరిగినది. అంత ధైర్యముగా దేవతలను గురించి చెప్పిన వారు ఎవరూ లేరు. దేవతలను గురించి తక్కువగా వారిముందర మాట్లాడినా వారిని దేవతలు ఎన్నో ఇబ్బందులపాలు చేశారని కూడా చెప్పాము.

మీరు అవసరములేని బైబిలులోని మత్తయి సువార్త 22వ అధ్యాయమునందు గల వాక్యమును అసందర్భముగా వ్రాశారు. అదే మాటను నేను తిరిగి అడుగుచున్నాను. “నీ పూర్ణ హృదయము” అని అక్కడ చెప్పారు. హృదయమంటే ఏమిటో సరియైన అర్థము తెలుసా? అని అడుగుచున్నాము. **“నీ పూర్ణ హృదయముతో, నీ పూర్ణాత్మతో, నీ పూర్ణ మనస్సుతో నీ దేవుడైన ప్రభువును ప్రేమించుము”** అనునది దేవుని ధర్మశాస్త్రములో మొదటి ఆజ్ఞగా ఉన్నట్లు బైబిలు గ్రంథములో వ్రాశారు. రెండవ ఆజ్ఞ **“నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించవలెను”** అనునది. ఈ వాక్యమును మేము కొన్ని వందలమందిని వివరమడిగాము. ఇంతవరకు

వాటికి సరియైన వివరము చెప్పిన వారు మాకు కనిపించలేదు. రెండవ ఆజ్ఞ అయిన వాక్యములో పొరుగువాడను విషయమే ఎవరికీ తెలియకుండా పోయినది. మొదటి ఆజ్ఞ విషయము అగమ్యగోచరముగాయున్నది. దాని వివరము ఎవరికీ ఇంతవరకు తెలియలేదని చెప్పుచుండగా, ఆ వాక్యముతో మమ్ములనే ఎదురు ప్రశ్న వేయడము విచిత్రముగాయున్నది. ఈ వాక్యమునకు శాస్త్రబద్దతతో కూడిన వివరము, మేము వ్రాయబోయే **"సువార్త బైబిలు"** గ్రంథములో తెలియగలదు.

**వారి ప్రశ్న :- నిజ ఆరాధ్యదైవమును వదలి 'శ్రీకృష్ణున్ని దేవుడని' నిరూపించే పనిలో త్రైత సిద్ధాంతము వారున్నారు అని ఒక ముస్లీమ్ అంటున్నాడు, ఆ మాట నిజమేనా?**

**మా జవాబు :-** మేము కృష్ణున్ని దేవుడని చెప్పలేదు, భగవంతుడని చెప్పుచున్నాము. నోరుంది ఏది మాట్లాడినా సరిపోతుందని అనుకోకూడదు. కృష్ణుడు దేవుడని చెప్పకూడదు, భగవంతుడని చెప్పాలని చాలామార్లు చెప్పాము. భగవంతునికి దేవునికి తేడా తెలియనప్పుడు అనవసర ఆరోపణ చేయకూడదు. **"దేవుడు దేవునిగా భూమిమీదికి రాడు"** అనికూడా అనేక మార్లు చెప్పాము. దేవునికున్న ప్రాథమిక జ్ఞానము ప్రకారము దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ మాట్లాడడు. అయితే దేవుడు తన జ్ఞానమును భూమిమీద తెలియజేయుటకు దేవుడు దేవునిగా భూమిమీద పుట్టుటకు అవకాశములేదు. అందువలన దేవుడు భగవంతుడను మారురూపుతో పుట్టి మాట్లాడవచ్చును. అప్పుడు దేవుడు దేవునిగానే ఉంటూ భగవంతునిగా మాట్లాడు అవకాశము గలదు. అప్పుడు భగవంతుడు మాట్లాడుట వలన దేవుడు మాట్లాడినట్లు కాదు. దేవుని యొక్క మారురూపు భగవంతుడయిన దానివలన, దేవుడు భగవంతునిగా తన జ్ఞానము ప్రజలకు చెప్పు అవకాశము

గలదు.  ఆ విధముగా బయటికి వచ్చిన జ్ఞానమే భగవద్గీత, బైబిలు. ఇదంతా జ్ఞానదృష్ఠియున్న వారికే తెలుసునని 'పశ్యన్తి జ్ఞానచక్షుసః' అని భగవద్గీతలో చెప్పడమైనది.  జ్ఞానదృష్ఠి లేనివారికి ఎంత చెప్పినా అర్థము కాదు.  దేవుడే వానికి అర్థము కాకుండా చేశాడని, అటువంటి వానిని తననుండి దూరము చేయుదునని ప్రత్యేకించి భగవద్గీతలోనూ, ఖురాన్‌లోనూ దేవుడు చెప్పడమైనది.

**వారి ప్రశ్న :- నిజ దైవమును ఆశ్రయించమని భగవద్గీతలో కృష్ణుడు చెప్పాడు. అటువంటప్పుడు మీరు నిజదైవమును వదలి కృష్ణున్ని ఎందుకు ఆరాధిస్తున్నారు?**

**మా జవాబు :-** నిజ దైవమును ఆరాధించమని దేవుడు నేరుగా ఎవరితోనూ మాట్లాడి చెప్పలేదు, కనుక  కృష్ణుడు భగవద్గీతలో నిజ దైవమునే ఆరాధించ మని చెప్పుచున్నాడు. అదే భగవద్గీతలో కొన్నిచోట్ల నేనే నిజదైవమని కూడా చెప్పాడు, దానిని కూడా మరువకూడదు.

**వారి ప్రశ్న :- దేవుడు పుట్టుకలేనివాడు, ఆకారములేనివాడు అని కలదు. అటువంటప్పుడు  పుట్టుకగల కృష్ణున్ని దేవుడని మీరు ఎలా చెప్పగలరు?**

**మా జవాబు :-** మేము కృష్ణున్ని భగవంతుడని చెప్పుచున్నాము.  తర్వాత భగవంతుడు ఎవరను ప్రశ్నకు జవాబుగా  భగవంతుడు దేవుడేయని అంటున్నాము.  నేరుగా దేవున్ని కృష్ణుడని చెప్పలేదు.  శాస్త్రబద్ధము ప్రకారము మాట్లాడితే రూపము పుట్టుకలేని దేవున్ని, చెప్పనిదే ఎవరూ గుర్తించలేరు. సరే! చెప్పుటకు ఆయన (దేవుడు) ఎవరికీ తెలియదు.  అందువలన దేవుడే చెప్పాలి.  దేవునికి పుట్టుక ఆకారము లేని దానివలన చెప్పలేదు.  అందువలన మధ్యవర్తిగా భగవంతుడను పాత్రను దేవుడే పోషించి, తన విధానమును తానే చెప్పిపోయాడు.  ఒక్క దేవుడు తప్ప భగవంతుడు ఎవడూ కాలేదు,

ఒక్క భగవంతుడు తప్ప దేవుడు ఎవడూ కాలేడు. దేవుడు ఒక్కడే, భగవంతుడు ఒక్కడే. దేవుడు మనుషులతో భగవంతునిగా మాట్లాడగలడు. దేవునిగా మాట్లాడలేడు. భగవంతుడు ఒక్కడే మనిషితో మాట్లాడి దేవుని జ్ఞానమును చెప్పగలడు. భూమిమీద భగవంతుడు తప్ప మనిషి అయినవాడు ఎవడూ దేవుని జ్ఞానమును చెప్పలేడు. భగవంతుడు మనిషి ఆకారములో యున్నా మనిషి కాదు. మనిషి శరీరమును ధరించి పుట్టుచున్నాడు. భగవంతుడు శరీరమును ధరించి పుట్టలేదు. దేవునికి పుట్టుకలేదు, అలాగే భగవంతునికి పుట్టుకలేదు. భగవంతుడు మనిషివలె కనిపించినా మనిషివలె పుట్టుచున్నాడని ఎవరయినా చెప్పగలరా? భగవంతుడు పుట్టినట్లు శాస్త్రబద్ధముగా చెప్పగలరా?

**వారి ప్రశ్న :- త్రైత సిద్ధాంత ప్రచారకులు అంతిమ దిన తీర్పును నమ్మరు. తీర్పుదినమే లేదంటున్నారు. ఖురాన్‌లో ఒక ఆయత్‌నందు "ఓ ప్రవక్తా! తొలిసారి పుట్టించినవాడే మలిసారి బ్రతికిస్తాడు" అని వారితో అను అంటూ కొన్ని వందలసార్లు చెప్పడము జరిగింది అని వారు చెప్పచున్నారు. మీరు ఖురాన్‌లో చెప్పిన తీర్పు దినమును నమ్మరా?**

**మా జవాబు :-** తీర్పు దినమును గురించి అంతిమ దైవ గ్రంథములోనే కాకుండా ఐదువేల సంవత్సరముల క్రిందటే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో కూడా చెప్పడము జరిగినది. మేము తీర్పు దినమును నమ్మడమే కాదు, వివరించి కూడా చెప్పాము. అయితే తీర్పు దినమును గురించిన సరియైన అవగాహన మీకే లేదంటున్నాను. ఎప్పుడో ప్రళయములో తీర్పు దినమున దేవుడు చనిపోయిన వారందరినీ సమాధులనుండి లేపి తీర్పు తీర్చును అనుటనే మేము పూర్తిగా కాదంటున్నాము. దేవుడు అలా ఎప్పుడూ చెప్పలేదు. అక్కడ చెప్పిన ప్రళయము ప్రపంచమునకు సంబంధించినది

కాదు, నీకు నీ శరీరమునకు సంబంధించినదని చెప్పుచున్నాము. నీకు ప్రళయము ఏర్పడి నీ శరీరము నాశనమయిన రోజు దేవుడు నిన్ను తిరిగి సమాధినుండి లేపునని మేము కూడా చెప్పుచున్నాము. ప్రళయము అనగా నీ మరణము అనీ, తిరిగి లేవడము అనగా రెండవ జన్మయనీ, సమాధి నుండి అనగా అపస్మారక స్థితినుండియనీ దేవుడు చెప్పియుండగా, మీరు దానిని వేరు విధముగా అర్థము చేసుకోవడము జరిగినది. "దేవుడు సమాధి స్థితి నుండి మనిషిని లేపినప్పుడు అతడు నగ్నముగా శరీరము మీద గుడ్డలు లేకుండా లేపబడునని" ముహమ్మద్ ప్రవక్తగారు చెప్పగా, ఆయన చిన్న భార్య ఆయిషా అనుపేరుగల ఆమె "దేవుడు తిరిగి బ్రతికించినప్పుడు, సమాధినుండి లేపినప్పుడు గుడ్డలు లేకుండావుంటే ఆడవారమయిన మాకు సిగ్గుచేటు కాదా, అవమానముకాదా' అని అడిగింది. అప్పుడు ముహమ్మద్ ప్రవక్త గారు సమాధానము చెప్పుచూ ఇలా అన్నాడు. **"మనిషిని తిరిగి సమాధి నుండి లేపినప్పుడు అతనికి ప్రపంచ ధ్యాసవుండదు. నేను ఆడ, నేను మగ అను ధ్యాసలేకుండా ఉందురు"** అని చెప్పాడు. అలా చెప్పడము వలన మనిషి తల్లి గర్భమునుండి మలిసారి పుట్టినప్పుడు శిశుదశలో ఉండును, కనుక అప్పుడు ఆడ, మగ ధ్యాస వుండదనే ప్రవక్తగారు సెలవిచ్చారు.

అంతేకాక మనిషికి రెండవ జన్మ అనగా పునర్జన్మలు ఉన్నాయని చెప్పుటకు ఖురాన్‌గ్రంథములో ఎన్నో సాక్ష్యములు గలవు. ఖురాన్ గ్రంథములో చెప్పిన దానిని అర్థము చేసుకొను శక్తి లేనివారు, ప్రవక్త తన భార్యకు వివరముగా చెప్పిన మాటలను విన్న తర్వాత కూడా ఇటు ప్రవక్త మాటనుగానీ, అటు ఖురాన్ గ్రంథములో అల్లాహ్ చెప్పినమాటను గానీ లెక్కచేయక, వారికి ఏది తెలిస్తే అదే నిజమను వారిని నేనుగానీ, ఆ

దేవుడుగానీ ఏమీ చేయలేడు. అనగా వారిని ఎవరూ మార్చలేరు అని అంటున్నాము. ఖురాన్‌గ్రంథములో ఈ విషయమును గురించి ఎక్కడ ఏమి చెప్పారో కొద్దిగా చూస్తాము.

**(36-68) "మేము వృద్ధాప్యానికి చేరినవారిని మళ్ళీ జనన స్థితికి తీసుక పోతాము. అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి?"** ఇక్కడ ఈ వాక్యములో అల్లాహ్ ఏదయినా దాచిపెట్టి చెప్పాడా? ఏదీ లేదు. మనిషి ముసలివాడయిన తర్వాత అతనిని తిరిగి జనన స్థితికి తీసుకపోతాను అన్నాడు. అంతటా అదే జరుగుచున్నది. వృద్ధాప్యానికి చేరిన మనిషిని దేవుడు అతని శరీరమును మార్చి తిరిగి శిశువుగా పుట్టించుచున్నాడు ఆ మాటనే ముసలి వానిని తిరిగి జన్మించే స్థితికి తీసుకపోతాను అని చెప్పాడు. దానిని కూడా అర్థము చేసుకోలేక ప్రళయ కాలములో అనగా అంతా నాశనమయి పోయిన తర్వాత దేవుడు తిరిగి లేపుతాడని చెప్పినట్లు కొందరు చెప్పుచుండగా, అది దేవునికి సరిపోక ఈ వాక్యము చివరిలో **'అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి?'** అని అన్నాడు. దేవుడు అలా ప్రశ్నించిన తర్వాతయినా వెనుతిరిగి ఆలోచించక మా ఉద్దేశ్యము సరియైనదే అనుకుంటే వాడు అక్కడే వుంటాడు.

**(40-11) "మా ప్రభూ! నీవు మాకు రెండుసార్లు చావునిచ్చావు. రెండు సార్లు బ్రతుకునిచ్చావు. ఇప్పుడు మా పాపాలను ఒప్పుకుంటున్నాము. మరి ఇప్పుడు మేము బయటపడే మార్గము ఏదైనా ఉందా? అని విన్నవించు కుంటున్నాము."** ఈ వాక్యములో 'రెండుమార్లు చావు, రెండుమార్లు బ్రతుకు నిచ్చావు' అని అన్నప్పుడు ప్రళయ కాలము వరకు ఉండడము, అప్పుడు సమాధులనుండి లేవడము అనుమాట అసత్యమని తెలిసిపోవుచున్నది. ప్రళయ కాలము వరకు అంతిమ దినము వరకువుండి, దేవుడు సమాధుల నుండి లేపినప్పుడు లేచినట్లయితే ఒకమారు చావు, ఒకమారు పుట్టుకయే

అగును. దీనినిబట్టి చాలామంది ముస్లీమ్‌లు చెప్పుకొనుమాట అసత్యమని, వారు తన జ్ఞానమును సరిగా అర్థము చేసుకోలేదని తెలుపుటకే ఈ వాక్యమును దేవుడు చెప్పాడని తెలియుచున్నది. ఈ ఒక్క వాక్యమును చూచిన తర్వాత కూడా పాతపాట పాడేవారిని దేవుడు కూడా ఏమీచేయలేడు. వారిని గాలికి వదలివేస్తాడు. వారికి శాస్త్రబద్ధత, గ్రంథ ప్రమాణము ఏదీ లేనిదానివలన వారి ఇష్టమొచ్చినట్లు వారు పోగలరు. ఖురాన్ గ్రంథములో ప్రళయము, అంతిమ దినము అని కలదు. ప్రళయ దినము అంటే శరీరము నశించిన దినమనీ, అంతిమ దినము అంటే చివరిరోజు మరణ దినమని ఎందుకు అర్థము చేసుకోకూడదు? కొన్ని కోట్ల సంవత్సరములప్పుడు ప్రళయము వస్తుందని ఎందుకు అనుకోవాలి?

**(53-44) "నిశ్చయముగా ఆయన మరణింపజేసేవాడు మరియు జీవితాన్ని ప్రసాదింపజేసేవాడు"** ఈ వాక్యములో అల్లాహ్ అనబడు దేవుడు మనిషికి మరణమును ఇస్తున్నాడు, మనిషి మరణించిన వెంటనే ఏమాత్రము ఆలస్యము లేకుండా వానికి క్రొత్త జీవితమును ప్రసాదించు చున్నాడు. ఈ విషయము మీకు బాగా అర్థము కావాలంటే మేము 1980లో వ్రాసిన అనగా ఇప్పటికి 35 సంవత్సరముల ముందు వ్రాసిన **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును చదవండి. చదివితే సులభముగా తెలియ గలదు. ఒక మనిషికి వాని శరీరములో ఏర్పడిన ప్రళయము ద్వారా, అనగా అవయవముల నాశనము ద్వారా మరణము సంభవించుచున్నది. మనిషి మరణించిన సెకండులోనే మరియొక శరీరమును చేరుచున్నాడు. మరణించిన ఒక్క సెకండు వ్యవధిలోనే, వాని రెండవ జన్మకు కావలసిన కర్మంతయూ వాడు చేసుకొన్న కర్మపత్రమునుండి నిర్ణయింపబడుచున్నది. ఒక మనిషికి మరణమునిచ్చువాడు దేవుడే, అతనిని వెంటనే జన్మకు పంపి

బ్రతికించువాడు దేవుడే. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో అనేకమార్లు చెప్పియున్నా, అల్లా చెప్పిన మాటను కాదని, తమ పెద్దలు, తమ గురువులు చెప్పిన మాటనే ముస్లీమ్‌లందరూ నమ్ముచూ, అసలయిన సత్యమును అర్థము చేసుకోలేకపోవడమే కాక, అర్థము చేసుకొన్న వారిని సహితము అజ్ఞానులని అంటున్నారు. ఎవరు అజ్ఞానులయినా మునిగిపోయింది ఏమీ లేదుగానీ, ఒకమారు మేము తెలుసుకొన్నది సత్యమేనా? అని వెను తిరిగి చూచుకోండి. అలా చూచుకోవడము వలన నష్టపోయేది ఏమీ లేదు కదా! దేవుడు చెప్పినది సత్యబద్దము అయినందున అది జరిగి తీరునదిగా ఉండును. ప్రత్యక్షముగా మనముందరే ఎందరో మరణమును పొందు చున్నారు. ఎందరో జననమును పొందుచున్నారు. వీరంతా ఎక్కడికి పోవుచున్నారు? ఎక్కడినుండి వస్తున్నారని మీరు ఎందుకు ఆలోచించలేక పోవుచున్నారు? ఏది ముందు వింటే అదే నిజమనుకొను స్వభావమును వదలిపెట్టి, ఏది సత్యమని ఆలోచించు వారికే దేవుని జ్ఞానము అర్థము కాగలదు.

హిందూ మతములో గల దైవగ్రంథమయిన భగవద్గీతను తప్పుదారి పట్టించుటకు భగవద్గీతకంటే ముందే వేదములు, పురాణములు, ఉపనిషత్తులు తయారు చేయబడినాయి. అయితే మేము వాటిని కాదని భగవద్గీతా జ్ఞానమును ఆశ్రయించుచున్నాము. అలాగే మిగతా మతములలో దైవగ్రంథములో విశేషమైన జ్ఞానమున్నా, దానిని కాదని వారు ఇతర గ్రంథములను ఆశ్రయించుచున్నారు. దానివలన దైవగ్రంథములోని జ్ఞానమును తప్పుగా అర్థము చేసుకోవడము జరుగుచున్నది. ప్రశ్నవస్తే అడుగకూడదు అనీ, చెప్పిందే వినవలెనని కొందరు ఇతర మతములలో చెప్పుచూ, ప్రజలను జ్ఞానమువైపు పోకుండా చేయుచున్నారు. దైవగ్రంథము

లోని వాక్యమును కూడా తమ మాటముందర వదలి వేయమంటున్నారు. (15-29) వాక్యమునందు **"నేను నా ఆత్మను ఊది పంపిన వాని ముందర సాష్టాంగ నమస్కారము చేయండి"** అని అల్లాహ్ చెప్పియున్నా, మత ధర్మము ప్రకారము మనము ఎవరికీ మ్రొక్కకూడదు అని చెప్పుకోవడమును చూస్తే మతము ముందర దేవుడు కూడా వారి లెక్కలో తక్కువవాడే అని అనిపిస్తావుంది. దేవుని వాక్యము మత షరియత్‌కంటే తక్కువ అని అర్థమగుచున్నది. ఒకప్రక్క అల్లాహ్ గొప్పవాడు అని చెప్పుచూ, మరియొక ప్రక్క అల్లాహ్ మాటను కూడా లెక్కచేయక, మాకు మా మతమే ముఖ్య మన్నట్లు 15-29 వాక్యమును లెక్కచేయకున్నారు. అటువంటివారు మమ్ములను అరువుకు తెచ్చుకున్న జ్ఞానము కలవాడనుట ఎటువంటిదో, ఎటువంటివారు ఆ మాటను అంటున్నారో ప్రజలు గ్రహిస్తున్నారు. ఎప్పటికయినా సత్యబద్ధమైన జ్ఞానము నిలువగలదు. అసూయ మాటలు నిలువలేవు.

**(53-46,47) "ప్రవహింప చేసిన వీర్య బిందువు నుండి మరొక జీవితమును ప్రసాదించడము దేవునికే చెల్లును"** అని కలదు. ఈ వాక్యము ప్రకారము మనిషి చనిపోతే తండ్రి వీర్యము వలననే తల్లిగర్భమునుండి రెండవ జన్మ కలుగుచున్నదని స్పష్టముగా చెప్పినట్లు తెలియుచున్నది. రెండవ జన్మ కూడా వీర్యబిందువు ద్వారానే కలుగుచున్నదని అందరికీ అర్థమగునట్లు దేవుడు చెప్పినా ఆ మాటను వినక, గ్రంథములో లేనిమాటను పట్టుకొని చనిపోయిన వాడు ప్రపంచము నాశనమగు వరకు పుట్టడు అని చెప్పడమూ, ప్రళయ కాలములో భూసమాధి నుండి లేపబడునని చెప్పడమూ, దేవుని మాటను ధిక్కరించినట్లు కాదా! ముహమ్మద్ ప్రవక్తగారు జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును మోసుకవచ్చి చెప్పితే, ఆయన చెప్పిన వాక్యములకు విలువ

నివ్వకపోవడము, ఆ మాటను కాదనడము వలన ఒక్క ప్రక్క దేవున్ని మరొక ప్రక్క ఆ విషయమును చెప్పిన ప్రవక్తను అగౌరవపరచినట్లు కాదా! ముస్లీమ్‌లైనవారు 53వ సూరా 46, 47 వాక్యములను ఎందుకు వ్యతిరేఖముగా చెప్పుచున్నారో వారికే తెలియాలి? రెండవ జన్మ తండ్రి వీర్యము ద్వారానే అని చెప్పినప్పటికీ, దేవుడు ప్రళయములో లేపుతాడని మరీ మరీ చెప్పడము విడ్డూరముగా యున్నది.

విచిత్రమేమంటే తాము తప్పుదారిలో పోవుచూ, సరియైన దారిలో పోవువారిని మీ దారి మంచిది కాదని హేళన చేసినట్లు మేము ప్రతి విషయమును ఎంతో వివరముగా చెప్పినా, శాస్త్రబద్ధముగా చెప్పినా, దైవ గ్రంథములలోని ఆధారమును చూపి చెప్పినా, మా మాటను తప్పు అని చెప్పుచూ, ఏమాత్రము శాస్త్రాధారముగానీ, గ్రంథాధారముగానీ చూపకుండా మాట్లాడుచున్నారు. పైగా వారు తప్పుదారిలో పోవుచూ, మేమే తప్పుదారిని చూపుచున్నామని, గ్రంథములోని వాక్యములకు తప్పు అర్థమును చెప్పు చున్నామని ఆరోపించుచున్నారు.

**వారి ప్రశ్న :- బూటకపు యోగీశ్వరులు అతుకుల జ్ఞానముతో, అరువుకు తెచ్చుకొన్న జ్ఞానముతో మాట్లాడుతారు. గతములో ఎవరూ బోధించని జ్ఞానమును మేము బోధిస్తున్నామని గొప్పలు చెప్పకుంటారు. త్రైత సిద్ధాంతాన్ని ప్రచారము చేసేవారు ఏమంటున్నారో చూడండి. త్రైత సిద్ధాంత గ్రంథములో "కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వరులు చెప్పారు" దీనినిబట్టి త్రైత సిద్ధాంత ప్రచారకుల వంచకత్వము స్పష్టముగా తెలుస్తుంది. ఒకవైపు కృష్ణుని విగ్రహాలను ప్రతిష్ఠింపజేస్తూ పూజలు చేయడము, మరోవైపు శ్రీకృష్ణుడు చెప్పని జ్ఞానమును యోగీశ్వరులు చెప్పారు అంటూ కృష్ణున్ని కించపరుస్తున్నారు. వీరి ప్రచారములో చిత్తశుద్ధి లేదు అనడానికి ఇంతకంటే మరోసాక్ష్యము అవసరమా?**

**మా జవాబు :-** మొగుడు వదలివేసిన భార్య తిట్టేదానికి చేతకాక చివరికి దుమ్ము ఎత్తిపోసిందట! అలాగే నన్ను విమర్శించే దానికి అలసిపోయి చివరకు కృష్ణునికి నాకు చిచ్చు పెట్టాలని చూడడము మంచి ఉపాయమే అయినా నీ మాటలను ఎవరూ నమ్మరు. నీవు చెప్పడములోనే నీ మాట అసూయతో కూడుకొన్నదని అందరికీ తెలిసిపోవుచున్నది. గతములో ఒక ఆమె నేను వల లేకుండా చేపలు పట్టుతానని గొప్పలు చెప్పి చివరకు చీరవిప్పి చేతనయినన్ని చేపలు పట్టినా, చీర లేనిదానివలన తన మర్యాద పోయిందని ఆమెకు తెలియలేదట. చివరకు అందరూ నవ్విపోయిన తర్వాత తనకు చీరలేదే! అని అనుకుందట. అలాగే ఎదుటి వారిని తిరస్కరించి మాట్లాడడమే ధ్యాసగా పెట్టుకొన్నవారు, తనమీద తాను ధ్యాసతో ఏమి మాట్లాడుచున్నామో తెలిసి మాట్లాడడము మంచిది. లేకపోతే మాట్లాడిన వారి మర్యాదే పోతుంది.

మీరు మమ్ములను తక్కువగా మాట్లాడబోయి, మేము చెప్పని మాటలను చెప్పుట వలన మీలోని దుర్బుద్ధి బయట పడుచున్నది. కృష్ణున్ని విగ్రహము అని మేము ఎప్పుడూ అనలేదు. మీరే కృష్ణున్ని మేము 'ప్రతిమ' అంటున్నామని ప్రతిమకు విగ్రహమునకు చాలా తేడాయున్నదని అంటున్నామని ఒకచోట చెప్పారు. ఆ మాటను మరచిపోయి ఇప్పుడు మేము కృష్ణున్ని విగ్రహములను ప్రతిష్ఠించుచూ పూజలు చేయుచున్నట్లు చెప్పారు. మేము కృష్ణప్రతిమలను నెలకొల్పాముగానీ, విగ్రహములను ప్రతిష్టించలేదు. కృష్ణ ప్రతిమలను నెలకొల్పి ఆయన గొప్పతనమును గురించి చెప్పాముకానీ మా జీవితములో కృష్ణున్ని ఇంతవరకు ఎప్పుడూ పూజించలేదు. ఇతరులు పూజచేయుట చూచాము. ఇతరులకు కృష్ణున్ని పూజ చేయుటకంటే ఆయన సేవ చేయడము మంచిదని అనేకమార్లు

చెప్పాము. ఎవరి ఇష్టప్రకారము వారు పూజలు చేయవచ్చును. ఎవరినీ చేయమని మేము ఇంతవరకు చెప్పలేదు. అట్లే చేయవద్దని కూడా చెప్పలేదు. పూజ చేయుట దేవున్ని పొగడినట్లేయగును. అటువంటి పూజలు ఆయనకు ఇష్టములేదు. ఆయన భూమిమీద చెప్పిన జ్ఞానమును ప్రచారము చేస్తే ఆయన సంతోషించునని కూడా చెప్పాము. మేము ఏమి చెప్పినది, ఏమి చేయునది ఇక్కడి ప్రజలకు తెలుసు, ఎక్కడోయున్న నీకేమి తెలియును.

ప్రతి పనికి కంటికి తెలియని ఒక ఫలితముంటుంది. నీవు పనిగట్టుకొని మమ్ములను మాట్లాడిన మాటలన్నిటికీ పాపమో, పుణ్యమో ఏదో ఒక ఫలితముండును. నీ విషయము నాకు తెలియకున్నా, నా విషయము నీకు తెలియకున్నా, ఇద్దరికీ మధ్యలోయున్న దేవునికి అన్నీ తెలుసు. నీకు దేవుడే ఏ కర్మను అంటగట్టాలో ఆ కర్మనే అంటగట్టును. మొత్తము మీద అనవసరముగా మాట్లాడి మీరు కొంత కర్మను సంపాదించు కొన్నట్లే. అది మంచిదో చెడుదోగానీ మొత్తము మీద కర్మను మూటగట్టు కొన్నట్లే, వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో మా గురించి నాలుగు వందల సంవత్సరములప్పుడే వ్రాస్తూ, నన్ను గురించి విమర్శించి మాట్లాడిన వారికి ఏమి జరుగునో కూడా ఆనాడే చెప్పాడు. ఇంతవరకు మేము మూడు గ్రంథముల జ్ఞానవాక్యములకు వివరమును చెప్పాము. ప్రబోధానంద గురువు నాకు గురువే, మీకు గురువేయని చెప్పిన బ్రహ్మముగారు ఒకచోట అన్ని మతములను ఏకము చేయువారని కూడా చెప్పాడు. నీకు తెలియక పోతే ఇప్పటికీ భద్రముగాయున్న బ్రహ్మముగారి ఏష్యకాలజ్ఞానమును చూస్తే తెలుస్తుంది. ఆనాడే **'ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది'** అని వ్రాసియుంచారు. ఆయన చెప్పినట్లే మావద్దకు హిందువులు, క్రైస్తవులు, ముస్లీమ్‌లు రావడము మా జ్ఞానమును ముగ్గురు ఆశ్రయించడము, వారు

తెలుసుకొన్న జ్ఞానమును ప్రచారము చేయడము జరుగుచున్నది. ఇక్కడ మూడు మతములవారు ఒకే తాటిమీద నడుస్తున్నారని లోకములో అందరికీ తెలుసు. నేను జ్ఞానమును అరువుకు తెచ్చుకొన్నవాడినే అయితే నాలుగు వందల సంవత్సరములప్పుడు బ్రహ్మముగారు తన కాలజ్ఞానములో అదే వ్రాసియుండేవాడు కదా! అలా వ్రాయలేదే? నన్ను మూడు మతముల గురువుగా ఎందుకు చెప్పాడో?

చెవిటివాని ముందర శంఖము ఊదినా వానికి ఏమీ వినిపించనట్లు అసూయా భావముతో నిండిన నీకు నా మాటలు రుచించవని, నీ బుర్రకు ఎక్కవని తెలుసు. మీరు నన్ను ప్రశ్నించిన ప్రతీ ప్రశ్నకు, విమర్శించిన ప్రతీ విమర్శకు మేము జవాబుగా ఒక గ్రంథమును విపులముగా వ్రాసి ఇచ్చాము. అయినా మీరు వాటిని జ్ఞానదృష్టితో చూడకుండా, కేవలము అసూయ గుణముతో చూస్తూ అర్థములేని విమర్శలు చేస్తున్నారు. బజారులో ఏనుగు పోతూవుంటే వీధిలో కుక్కలు అరుస్తూ ఉంటాయి. బజారు పెద్దది, వీధి చిన్నది. వీధి కుక్కలు బజారులోనికి రావచ్చును గానీ, బజారు లోని ఏనుగు వీధిలోనికి పోలేదు కదా! బజారు పెద్దది కావున వీధి కుక్కలు బజారులోనికి రావద్దని ఎవరూ చెప్పలేరు. అయితే వీధి చిన్నది కావున ఏనుగును వీధిలోనికి రమ్మనినా పోలేదు. అందువలన ఏనుగు కుక్కలను పట్టించుకోకుండా తన దారిన తాను పోవలసిందే. అదే విధముగా కొందరు ఏ గుర్తింపులేని అనామకులు మాట్లాడు మాటలను విజ్ఞులయిన వారు పట్టించుకోరు. అందువలన అర్థహీనముగా మాట్లాడు వారి మాటలను మేము కూడా పట్టించుకోము. ఇకమీదట అటువంటి వారి మాటలకు ఎటువంటి జవాబునివ్వము.

నేను అందరివలె జ్ఞానమును నేర్చుకొన్న వానిని కాను, నా స్వతహాగా నేను జ్ఞానమును చెప్పు వానిని. మూడు గ్రంథములలోనున్న

జ్ఞానమును నేను ఎప్పుడూ నేర్చుకోలేదు. నాలోయున్న జ్ఞానమే మూడు గ్రంథములలో ఉన్నదని చెప్పాను. నేను ఎప్పుడో 35 సంవత్సరములప్పుడు ఏ గ్రంథము చూడకుండా చెప్పిన జ్ఞానము ఈ మధ్యన గ్రంథములలో కనిపించినది. అందువలన నేడు నాకు మూడు మతములలోని జ్ఞానము సులభమైనది. నేడు ఒక మతములోయున్న వాడు, మిగతా మతములలో యున్న ఎంతటి జ్ఞానినయినా అసూయతోనే చూస్తున్నాడు. పైకి అందరికీ దేవుడు ఒక్కడే అంటూ, లోపల మీ దేవుడువేరు, మా దేవుడు వేరు అను భావము కల్గియున్నారు. మూడుమతములను సమ్మతముగాయున్న నన్ను కూడా అసూయతో చూస్తున్నారంటే, ఒక మతమును గురించి చెప్పు వారిమీద పూర్తి అసూయను కల్గియుందురు. నా భావములో నేనెంత గొప్పవాడినో, ఎంత చిన్నవాడినో నాకే తెలుసు. అయితే ఇతరులను నేను జ్ఞానులుగా చేయు నిమిత్తము, ఈ ప్రపంచములో నేను కూడా కొన్ని మాటలను మాట్లాడవలసివచ్చినది. లేకపోతే దైవజ్ఞానమనేది ఏ గుర్తింపు లేకుండా పోగలదు. నేను చెప్పు మాటలు సాధారణముగాయున్నా ఆలోచించువారికి ఎంతటి సారాంశమునయినా ఇవ్వగలవు.

నేడు నేను చెప్పు జ్ఞానమును చూచి, ఆలోచించు ప్రతివాడు వారికి తెలిసిన విధానమును వదలి, అది సరియైన విధానము కాదని తెలిసి నావైపు రావడము జరుగుచున్నది. లోకములో ఎందరో గురువులు, మరెందరో స్వామీజీలు ఏదో ఒక ప్రచారము చేయుచుందురు. అటువంటి ప్రచారములు ఏమీ చేయకుండా, కేవలము గ్రంథరచనల వలన మాత్రమే మేము మా జ్ఞానమును ఇతరులకు తెల్పుచున్నాము. మా జ్ఞానమును చూచిన ప్రతివాడు మావైపు రావడము జరుగుచున్నది. నేను హిందూ సమాజములో పుట్టియుండుట వలన కొందరు నన్ను హిందూ గురువుగా

లెక్కించుకొన్నా, చాలామందికి నేను ఒక మతమునకు సంబంధించిన గురువుగా కాకుండా, మూడు మతముల గురువుగా కనిపించుచుండుట వలన, మూడు మతముల జ్ఞానులు నావైపు వచ్చారు. వచ్చిన వారు మూడు మతములకు సంబంధించినవారై, వారి వారి మతములలో జ్ఞానులుగా యున్నవారే, మా జ్ఞానమును చూచి ఇది గొప్ప జ్ఞానమని తలచి నా ప్రక్కకు వచ్చి ఇంకా కొంత జ్ఞానమును తెలియగలిగి, సంపూర్ణ జ్ఞానులయినారు. ఏ మతములోయున్నవారు ఆ మతములోనే వుండి అన్ని మతములకు సంబంధించిన దేవుని జ్ఞానమును ప్రచారము చేయమని చెప్పిన నా మాట ప్రకారము, అన్ని మతములవారు వారివారి మతముల పేరు మీదనే ప్రత్యేక సంఘములను స్థాపించి, దేవుని జ్ఞానమును ప్రచారము చేయుచున్నారు. ఈ విధముగా హిందువులు **"ఇందూ జ్ఞానవేదిక"** ద్వారా, క్రైస్తవులు **"సువార్త క్రైస్తవ సంఘము"** ద్వారా, ముస్లీమ్‌లు **"ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ"** ద్వారా వారివారి గ్రంథములలోని జ్ఞానమును వారివారి మతములలో తెలియజేయుచుండుట వలన నేడు అన్ని మతములలో సంశయరహిత జ్ఞానము తెలియబడుచున్నది. ఏ మతములో సంశయమున్నా ఆ మతమునకు సంబంధించిన సంఘము తన జ్ఞానమును అందించి ఆ సంశయమును లేకుండా చేయుచున్నది.

విశాల దృష్టితో, వివేకముతో మీరే ఆలోచించండి. మేము చేయుచున్న పని మంచిదో, కాదో చెప్పండి. నేడు మూడు మతముల సంఘములు ఒక్క గురువు ఆధ్వర్యములో ఎక్కడయినా ఉన్నాయా? ఇక్కడ తప్ప ఎక్కడా లేవు. మూడు మతముల సమన్వయ జ్ఞానము ఎక్కడయినా ఉన్నదా? ఇక్కడ తప్ప ఎక్కడా లేదు. ఒకే వేదిక మీద, ఒకే జ్ఞానమువద్ద మూడు మతముల ప్రజలు ఎక్కడయినా కలుస్తున్నారా? ఇక్కడ తప్ప ఎక్కడా

కలువడము లేదు. ఏ మతమునకు సంబంధములేని దేవుని గుర్తును అన్ని మతముల వారు అనుమానము లేకుండా తమ నుదిటి భాగమున ఎక్కడయినా ధరించుచున్నారా? ఇక్కడ తప్ప ఎక్కడా ధరించడము లేదు. **పరమాత్మ** అంటే మా దేవుడని క్రైస్తవులు, ముస్లీమ్‌లు ఎక్కడయినా అంటున్నారా? ఇక్కడ తప్ప ఎక్కడా అనడములేదు. **పరిశుద్ధాత్మ**యని క్రైస్తవుల గ్రంథములోని దేవుని పేరు చెప్పితే ఆయన మా దేవుడని హిందువులుగానీ, ముస్లీమ్‌లుగానీ ఎక్కడయినా అంటున్నారా? ఇక్కడ తప్ప ఎక్కడా అనడము లేదు. అలాగే **అల్లాహ్** అని ఖురాన్ గ్రంథములోని దేవుని పేరు చెప్పితే మా దేవుడని హిందువులు, క్రైస్తవులు ఎక్కడయినా సంతోషిస్తున్నారా? ఇక్కడ తప్ప ఎక్కడా లేదు. ప్రపంచములో అందరికీ ఒకే దేవుడైనప్పుడు, అందరూ ఎక్కడ ఏ పేరు చెప్పినా అది ఒకే దేవుని పేరని తెలిసినప్పుడు, మనుషులలో భేదాభిప్రాయములు ఎందుకుంటాయి. భగవద్గీతలో చెప్పిన జ్ఞానమును చివరిలో వచ్చిన ఖురాన్ సమర్థించు చున్నప్పుడు, దానిప్రకారము భగవద్గీతా జ్ఞానమును ముస్లీమ్‌లు కూడా సమర్థించవచ్చును. అలాగే భగవద్గీత యొక్క సూత్రములే ఖురాన్‌లో కనిపించినప్పుడు, హిందువులు ఖురాన్‌ను సమర్థించవచ్చును కదా! అలాగే బైబిలు గ్రంథములో అనగా నాలుగు సువార్తలలో భగవద్గీత, ఖురాన్ జ్ఞానమున్నప్పుడు హిందువులు, ముస్లీమ్‌లు సువార్త బైబిలును సమర్థించ వచ్చును కదా! ఈ విధముగా మూడు మత గ్రంథములలో యున్న సూత్రములన్నీ ఒక్కటేయని తెలియునట్లు భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలోని జ్ఞానమును మనిషి జీవితములో ఆచరించకపోతే వాడు ఏ మతమునకు చెందినవాడు కాదు అని ఖురాన్‌లోనే (5-68) లో చెప్పి యున్నారు. దానిని మరచిపోయి మా గ్రంథము ఒక్కటే మాకు తెలుసు, మా మతము ఒక్కటే మాకు తెలుసు అంటే, వారు ఏ మతమునకు

సంబంధించినవారు కాదు. అలాగే ఏ గ్రంథమునకు సంబంధించినవాడు కాదని చెప్పవచ్చును.

నాది అతుకుల జ్ఞానము, అద్దెకు తెచ్చుకొన్న జ్ఞానమయితే మీది అతుకుల జ్ఞానము కాదనేగా అర్థము. సరే! నాది అతుకుల జ్ఞానమే, అరువుకు తెచ్చుకొన్న జ్ఞానమే అని నీకు కనిపించియుంటే దానికి ఏ శక్తి లేదనేగా మీరు చెప్పేది. అటువంటప్పుడు మీ వద్దగలది శక్తివంతమైన జ్ఞానమైవుండాలి. మాటల రూపములో మీరు ఎట్లు మాట్లాడినా ఫరవాలేదు. అది బయటికి కార్యరూపములో కనిపించాలి కదా! దేవుడు తన జ్ఞానము సత్యమైనదని చెప్పాడు, కావున అది ప్రత్యక్షముగా కార్యరూపములో కనిపించును. మీవద్ద మాటల రూపమున అడ్డముగా మాట్లాడు జ్ఞానము ఉండుట వలన అది ఎక్కడా కార్యరూపముగా కనిపించలేదే! మమ్ములను విమర్శించు మీ మాటను ఏ దేవత అయినా గానీ, ఏ దైయ్యమయినా గానీ వినగలిగాయా అని అడుగుచున్నాము. మీరు చెప్పినట్లు మాది అతుకులబొంత జ్ఞానమే అయినా, మా మాటను దేవతలుగానీ, దైయ్యములు గానీ జవదాటలేదు. మేము చెప్పినట్లు వింటున్నవి, మాకు భయపడుచున్నవి. మా వద్ద వినయ విధేయతలతో భక్తిగాయున్నవి. దీనికి మీరేమంటారో? దేశములో భయంకర రోగములుగా పేరుగాంచిన పెద్ద రోగములు కూడా మా మాటను విని వారినుండి దూరముగా పోవుచున్నవి. పాపము చేత పీడింపబడు వానిని సహితము క్షమించి రోగములు దూరముగా పోవు చున్నవి. ఇదంతా మా మాట మీద జరిగినవంటే మాది అతుకుల జ్ఞానమని చెప్పవచ్చునా? మా జ్ఞానమును విని ఆచరించి ఎందరో జ్ఞానశక్తి కలవారై వారి కర్మలను కాల్చుకోగలుగుచున్నారంటే మాది అతుకుల జ్ఞానమని చెప్పవచ్చును. మా అతుకుల జ్ఞానమునకు ఇంత శక్తియున్నట్లు ప్రత్యక్షముగా

తెలియుచుంటే, మీ సక్రమమైన జ్ఞానమునకు ఎంతోశక్తి ఉండును. అయితే మీ జ్ఞానమునకున్న శక్తి ఇంకా పెద్దదయి ఉండవచ్చును. మీ జ్ఞానశక్తి వలన ప్రత్యక్షముగా ఏమి జరిగాయో చెప్పగలరా? చెప్పలేరు. ఎందుకనగా ఏదీ మీ మాట వినదు. ఏ కర్మ మీ జ్ఞానము వలన క్షమించ బడదు.

దేవుని జ్ఞానము ఎక్కడున్నా అది క్షమాశీలత కల్గియుంటుంది. క్షమాశీలత లేనిది అది దేవుని జ్ఞానము కానేకాదు. **'అగ్నిలో కట్టెలు కాలి పోయినట్లు, జ్ఞానమను అగ్నిలో కర్మలను కట్టెలు కాలిపోతాయని'** భగవద్గీతలో భగవంతుని రూపములో దేవుడే చెప్పాడు. బైబిలులో **"పాపక్షమాపణ జ్ఞానము వలన కలదని"** చెప్పారు. ఖురాన్ గ్రంథములో **"దేవుడు క్షమాశీలుడు"** అని చెప్పారు. దానినిబట్టి దేవునికున్న శక్తియే దేవుని జ్ఞానమునకు ఉండునని తెలియుచున్నది. దేవుని జ్ఞానము ఎక్కడున్నా దాని శక్తి బయటపడును. దేవుని జ్ఞానము ప్రత్యక్ష శక్తిగలదై ప్రత్యక్షముగా యున్న కర్మలను కాల్చివేయుచుండుట వలన సత్యవాదులు ఎవరో, అసత్య వాదులు ఎవరో ప్రత్యక్ష జ్ఞానమువద్ద బయటపడిపోవుదురు. **ఎచ్చట దైవ జ్ఞానముండునో అక్కడ క్షమాశీలత అనగా కర్మ నాశనముండును.** ఎక్కడయితే దేవుని జ్ఞానము లేదో అక్కడ క్షమాశీలతయుండదు. మావద్ద యున్న జ్ఞానము క్షమాశీలతగల శక్తిగలదైవుండగా, ఏదీ చేతకానివారు మా జ్ఞానమును అతుకుల జ్ఞానమంటే వారిని దేవుడు బాగా గుర్తు పెట్టుకొనును. అటువంటి వారికి క్షమించరాని పాపమును చేకూర్చును.

ప్రస్తుత కాలములో మేము చెప్పు జ్ఞానము గొప్ప రహస్యములతో కూడుకొన్నదై ఉన్నది. కొన్ని సందర్భములలో సరికొత్త జ్ఞానమును చెప్పి దీనిని ఇంతవరకు ఎవరూ చెప్పని జ్ఞానమని చెప్పడము కూడా జరిగినది. అనేక సందర్భములలో మూడు గ్రంథములలో లేని జ్ఞానమును కూడా

చెప్పడము జరిగినది. అది భూమిమీద క్రొత్తగా చెప్పబడిన దైవ జ్ఞానముగా యుండినా, దాని మూలము మూడు దైవగ్రంథములలో ఏదో ఒక దానియందు ఉండును. అయితే అది ఇంతవరకు అర్థముకాకపోవడము వలన అది సరిక్రొత్త జ్ఞానముగా ఉండును. ఇంతవరకు నాలుగు యుగములలో తెలియని జ్ఞానము తెలియబడుచున్నదని మేము కూడా చెప్పుచున్నాము. ఆ మాట మేము చెప్పడము వలన పైకి కనిపించు ప్రబోధానందస్వామి చెప్పుచున్నాడని కొందరనుకోవడము జరిగినది. అయితే ఇక్కడ అందరూ తెలియవలసినదేమనగా! నాకు తెలిసిన కొంత జ్ఞానమును నేను చెప్పినది నిజమే. అయినా ఇంతవరకు భూమిమీద ఎవరికీ తెలియని జ్ఞానమును నా వెనుకనయుండి నన్ను నడుపుచున్న దేవుడే స్వయముగా చెప్పుట వలన అనేక రహస్యములు బయటపడుచున్నవి. అందువలన ఇక్కడ చెప్పు జ్ఞానము లోకములో ఎవరూ ఎదురాడని జ్ఞానమని మేము అనేకమార్లు చెప్పాము. మూడు గ్రంథములను ఎవరయితే చెప్పారో, ఆ శక్తియే నా శరీరము నుండి చెప్పుచున్నదని నాకు బాగా తెలిసినది. దేవుడు ఎప్పుడో ఒకప్పుడు అలా చెప్పు అవకాశమున్నది. ఈ గ్రంథము ప్రారంభములోనే **'శరీరములోని దేవుడు, శరీరము బయట దేవుడు'** ఇరువురు గలరని చెప్పాము. శరీరములోని దేవుడు శరీరము బయటగల దేవున్ని గురించి చెప్పుచున్నాడని నాకు బాగా తెలిసినది. బయటికి కనిపించు నేను చెప్పుచున్నా, జ్ఞానమంతయూ కనిపించని వాడు చెప్పుచున్నాడని నేను చాలామార్లు ఉపన్యాసములలో కూడా చెప్పాను.

ఇదంతయూ గమనిస్తే **గురువు గుట్టుగా ఎవరికీ తెలియకుండా తన జ్ఞానమును బయటికి చెప్పుచున్నాడని, కావున మూడు గ్రంథములలో ఇంతవరకు అర్థముకాక రహస్యముగా మిగిలిపోయిన ఎన్నో రహస్యములు**

**బయట పడుచున్నవని అర్థమగుచున్నది.** ఇటువంటి సమయములో మనుషులు తమలోని అహమును వదలి, తెలియబడు స్వచ్ఛమయిన జ్ఞానమును తెలుసుకోవడము మంచిది. అట్లు కాకుండా చెప్పేవాడు మాలాంటి మనిషే కదా!యని అసూయ కల్గియుంటే మీకు ఏమీ ప్రయోజన ముండదు. నష్టపోయేవారు మీరే. నేను సాధారణ మనిషినేనని నేనే చెప్పుచున్నాను. అయితే లోపలి నుండి నేను జ్ఞానమును చెప్పడము లేదు. చెప్పేవాడు నా వలె నాతోయున్నవాడని, నేను కాదని గ్రహించవలెను. నీవలె నీ పొరుగువాడున్నట్లు, నావలెనున్న నా పొరుగువాడు చెప్పు ప్రతి మాట నాది కాదు ఆయనదే. నీ శరీరములో పూర్ణ హృదయముగా యున్నవాడు, పూర్ణ ఆత్మగాయున్నవాడు, పూర్ణ మనస్సుగాయున్నవాడు ఒక్కడేననీ, ఆ ఒక్కడు తెల్పునదే నిజమైన జ్ఞానమని తెలియగలిగితే ఎవడయినా ధన్యుడు కాగలడు. దేవుడు మనతో ప్రత్యక్షముగా మాట్లాడడు. ఆయన ఎవరూ చూడకుండా ముసుగులోనే అన్నీ చేయును. నీకు ముసుగు తెలియదు, ముసుగులోనివాడు తెలియడు, తెలిసేది ఆయన జ్ఞానము ఒక్కటే, దానినే తెలుసుకో!...



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే**
**ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**



# ప్రతిమ × విగ్రహ
# దైవము × దైయ్యము

| మనిషిలోనే | | మనిషిలోనే | |
|---|---|---|---|
| జీవాత్మ → | శిష్యుడు | జీవాత్మ → | దైయ్యము |
| ఆత్మ → | దైవము | ఆత్మ → | గురువు |
| పరమాత్మ → | ఏదీకాదు | పరమాత్మ → | ఏదీకాదు |

Author :

The Only Guru of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

Sri Acharya Prabodhananda Yogeeshwarulu

www.thraithashakam.org